శ్రీరస్తు-

చార్‌దర్వేష

అనగా

నలుగురు ఫకీరుల చారిత్రము



ఇది,

ఉరుదు - యింగిలీషు అనే

రెండుభాషలలోనుంచి

ఎల్లమిల్లి - మల్లికార్జునులనే కవివరునిచే

తెనుగుభాషతో రచింపబడి

మహారాజరాజశ్రీ - ఆనరేబిల్

గొడే-నారాయణగజపతిరాయనింగారియుత్తరువుచొప్పున

పిళ్లారిసెట్టి- రాఘవయ్యనాయనివారి

స్వకీయ

శ్రీభారతీనిలయముద్రాక్షరశాలయందు

మూడవపర్యాయము - ముద్రింపఁబడెను-

౧౮౭౬సం॥ జూలై నెల- ౨౫ తేది.

MADRAS.

శ్రీరస్తు.

---

## చార్ల డ్విషు అనే గ్రంధముయొక్క

## పీఠిక.

అహాహా ఈశ్వరుండెంతచమత్కారి ఇచ్ఛామాత్రముచేతనే సమస్తభూతజాలములను సృజించి సర్వాంతర్యామియై ప్రపంచోత్పత్తిస్థితిలయములను జరిగించుచు తిరిగేటిసమాయచేత వాటిని వేరువేరుగా వ్యవసాన మవ్యేలాగున భ్రమతనుపుట్టించుచున్నాడు- యితనిచమత్కారమును సూర్యచంద్రులు తెలుసుకోలేక ప్రత్యక్షముగనున్న నిరాధారములేకుండా భూమియాకాశములను తిరుగుచు యున్నటువంటిచేత తమతమ గతులు స్వభావసిద్ధమై యధాస్థానమునకే చేరుచున్నారు- మిగిలిన గ్రహములకుపుట్టిన గ్రహచారము చెప్పడానకు శక్యముకాదు వేదములు మొదలైనవి యితని స్తుతించుటకు అలవికానందున పురాణాదిగ్రంధములకసాధ్యము ఈశ్వరునకు యిటువంటి చమత్కృతి కలదని యెరిగిన్ని లోకోపకారార్థముగా యుపదేశించి ప్రఖ్యాపకులైన మతాచార్యులే స్వము యీశ్వర స్వరూపమునన్ని ప్రతిపత్తునా తత్సంబంధమైనన్ని గ్రంధముల యొక్క తాత్పర్యమును తెలుసుకొనుటకు ప్రత్యక్ష నిదర్శనముగుపడుతూనుండగా సాధారణుడైన యొకమనుష్యుడు అహంకృత్యాది మానములను వహించియేమిచేయగలడు- యీం పేరులవల్లచేతనే ఎందుకున్న స్వాధీనములేక సర్వకర్తృత్వము చేయునిదనియాలోచించి చేయుటకునమస్కరించవలసినది.

అష్టభాగవదను గ్రహముచేత హిందుస్థానఖండముయొక్క ప్రజాపరిపాలనము వర్తమానమునందు యింగిలీషువారు జరిగించుచున్నారు, పూర్వయుగములయందు ఋషులయొక్క తపస్సుచేత సాధించబడిన దూరదృష్టియు దూరశ్రవణము, వాయువేగము, మనోవేగము, కాలపరిమాణనిరూపణము మొదలైనవి వీరికి లోహాదియంత్రములచేత సమకూడినవి.

అధికారులకే యిటువంటియోగ్యత కలిగినప్పుడు ప్రజలకందరికిని క్రమక్రమముగా సత్ప్రవర్తనకలుగుచున్నందున యీయధికారమే యింకాయభివృద్ధికి రావలెనని కోరతగినది.

ఈయధికారమునకుచెందియున్న గొప్పస్థలములలో నొకటియైన (శిరాఖప

పతిరాయనింగారు) విద్యాభ్యాసంగమునిమిత్తము అనేకగ్రంథములను చూచు చుండగా వొకరోజున (చార్దర్వేషుయనే) నలుగురు ఫకీరులయొక్క చరిత్ర ను చిత్తగించగా చిత్రచిత్రతమ్మైలై మనోల్లాసము కల్పించినదేగాక యీగ్రం థము లోగడ (అమీరుఖుసురూయను) యొకమహమ్మదీయునివల్ల ఫారసీభాష లోజాతమైయున్నట్టున్నది (౧౮౦౧) సంవత్సరములో (ఢిల్లీకాపురస్థుడయిన) (మీరుఅమ్మన్) అనేయొక తురకవల్ల ఉరుదూభాషలోనున్న (౧౮౧౧) సం వత్సరములో మేష్టర్ * ఎల్ * ఎఫ్ * స్మిత్ అను (యూరోపియనక్) వల్లఇంగి లీషుభాషలో తర్జుమా అయినట్టుకనుపడుతున్నందున దీని లోకోపకారముగా తెనుగుభాషతో యెవరైనాచేస్తే బాగావుండునని చెప్పినందున యిప్పుడు (యె ఱ్ఱమిల్లి * మల్లికార్జునులనేయొక బ్రాహ్మణుడు యీమోపించి యీగ్రంథము ను తెనుగించడమున కుపక్రమించెను తెనుగుదేశములలో రాజ్యాంగములుబద లాయించడముచేతను యితరదేశస్థులనేకులు యొక్కొక్క స్థలమందు తరుచు గా కలిగియుండడముచేతను యనేకభాషలయొక్క శబ్దములు మిళితమైస్వభా షలవలె వాడికైయున్నందునవాటిని ఖేటించి తెనుగుమాటలతో వ్యాకరణపద్ధ తిగా గ్రంథముచేసేయెడలసర్వజన సాధారణముకాక పోవడమేకాక దేశియ్యా భాషాచమత్కారముబోధపడక విరసమౌనని తోచి స్త్రీపురుషులు వొకరితోనొ కరుమాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేపముగా జాతి యుపసములో భాషాంతరులకుపూర్వోత్తరములు తెలియడమునకు ముఖ్యమైన కొన్ని రిమార్కులతో ఈ గ్రంథమునేయునిశ్చయించడమైనదిగనక యిందుకున మస్తమైనవారుహర్షించవలసినది.

ఈచార్ దర్వేషుకేబాగ్ బహార్ అనగా శృంగారవనమనికూడ రెండోపే రుకలిగియున్నది యిందుకు అధిదేవతవిద్యయు స్థానము సరసహృదయము అ యినందున కాలనిర్ణయములేకుండా యెల్లప్పుడునందనవనమువలె పల్లవించుచు పుష్పించుచు ఫలించుచున్నదని విశేషించి యీవనము(మున్షీనూర్ మహమ్మద్ * సాహేబు) మొదలైనవారిసహాయమువల్ల ఆయాభాషలనేతోటలోనుండి అం టుగట్టితేసినాటినటువంటిన్ని విద్వాంసులైన (శ్రీమత్పరవస్తు * వేంకటాచార్యు లయ్యావార్లగారి) పాండిత్యమనే దోహదమువల్ల * పెరిగినటువంటిన్ని కృతినా యకుని యాదరణమనే జీవనమువల్లసంరక్షించబడినటువంటిన్ని ఈయారా మవిహారముసమస్తమైన దేవతలకు మనుష్యులకు కూడా యభిరామమైయుండడ మేకాకుండా దైనకటూత్తములవల్ల యీసలతాసప్రసంస్థాఫలము గ్రంథకర్త

కుకలగడమునకు యేమివింత - మరిన్నియది యచ్చుపడడమువల్ల బంగారుపుష్ప సమూహమునకు పరిమళముకలిగినట్లు ప్రకాశించిమనోహరమైయుండునని కూడా నమ్మతగియున్నది అయితేకొన్నిపుష్పములక్రిందముండ్లున్ను ఫలములయందు గింజలున్ను రసమందునలకలున్ను ఉన్నట్టుగానిందులో తప్పులుండక మానవు గనుక కరుణచేత సారస్యమును మాత్రమేగ్రహించ వలసినదని సమస్తమైన యోగ్యులనుముందుగా ప్రార్థించి కథా ప్రారంభముసేయడమైనది.

క థా ప్రా రం భ ము.



పూర్వకాలమునందు రూమ్ అనేదేశములోనొక రారాజుండెను (౧) నవుషేరవాన్ వంటిధర్మపరిపాలనమున్ను (౨) హాతెమ్‌వంటిదాతృత్వమున్ను ఆయనకున్నైజగుణములై యుండెను ఆపాదుషాపేరు ఆజాద్‌బఖ్తు * రాజధాని * ఖుస్తుంతునియా - దీనియింగిలీషువారుకన్ స్టాంటినోపిల్‌అనుచున్నారు అతడురాజ్యముచేసేకాలములో ప్రజాసౌఖ్యమున్ను ధనసమృద్ధిన్ని సేనాప్రాబల్యమున్ను పేదలకు జీవనమున్ను కలిగియుండెను ప్రతియింటను పగలుపండుగవలెనున్ను రాత్రిదీపావళివలెనున్ను సంతోషముగాకాలము జరుగుచుండెను చోరులుమొదలైనదుర్మార్గులనుయీదేశములోలేకుం [illegible] వేయడముబజారులో దుకాణములుమూయడము యెన్నడున్నులేకయుండెను యింతకే యడవిలోనుండే యయినాబయలనుండియైనా ఒంటరిగాబంగారము నెరగవేయుచు వెళ్లుచుంటే యెవడియేమనియడగడము సహాతప్పితముగానుండెను ఆచక్రవర్తియధికారముక్రిందయనేక వేలరాజులుపాదకట్నములు చెల్లించుచుందురు ఇటువంటిభాగ్యస్థితిలోనున్నప్పటికిని యొకనిమిషమైన నాభగవత్పాదారవిందధ్యానముయేమరకుండాయుండెనుయతనికిప్రపంచసౌఖ్యములన్నియుకలిగిన్ని కుమారుడనేజన్మఫలము తనియదృష్టరేఖయను వనములోఫలించకున్న విషయమైతరుచుగావిచారగ్రస్తుడై (నమాజు) అనగాదేవప్రార్థన చేసునప్పుడెల్లాఓభగవంతుడా యీదీనుడికితమకటాక్షమువల్లసమస్తమున్ను కలిగినదిగాని యీచీకటింటికిదీపము లేదనిమీమాయ భండారములోనుంచిఆయుర్భాగ్యములుగలయొకకుమారునిదయచేసినయెడల నాపేరున్ను ఈయైశ్వర్యమున్ను స్థిరములైయుంటున్న

(౧)నవుషేరవాన్ అనేయాయనతురకలలోయనుధర్మరాజువంటివాడు. (౨)హాతెమ్ అనేయాయినతురకలలోదానకర్ణుడివంటివాడు.

దసిమనివి చేయుచు ఈకోరికెతోనే పాదుషానలుబదిసంవత్సరములుగడిపెనుయి
ట్లుండగా ఒకరోజున అద్దాలమహాలులో శైవప్రార్థనచేసిమంత్రానుష్టానముచే
యుచుండగా వెండితీగవలెమెరయుచున్నయొక తెలసివెన్ట్రుకమీసములోనుంచికను
పడినందున పాదుషాకంటతడిపెట్టి స్ట్టూర్పునిగుడించి తననస్సులో తానిట్లనియె
అయ్యయోయింతమట్టుకువృధా కాలక్షేపముచేయుచు ప్రపంచవాంఛచేతఅ
నేకులనుక్రిందుమీదుచేసినానుయిప్పుడదినాకుయేమక్కరకువస్తున్నదినాకెప్పుడేచా
వుకబురు వచ్చునదికదా యికకొంతకాలము జీవించినా దేహదార్ఢ్యము ముండ
దు తుదకుయీయావత్తు మరియొకరుయెత్తుకుని పోయెదరుగదాయని యుద్యో
గస్తులసందరిని వారివారిపనులలో వారివారిని జాగ్రతగా నుండుడని యాజ్ఞా
పించి రాజ్యభారము నంతటుతానేవిడిచిపెడు వ్యాసనములో ప్రవేశించిపరమార్థ
చింతచేత తపస్సుచేయనారంభించెను ఆ సమయములో తానూరికె ఆశ్చర్యపడడ
ముదుఃఖించడ మునెప్పుడు దర్భాసనముమీదపడియుండడమురోజు ౧ దఫా
డుగుటకలమంచినీళ్లు ఒక్కఖజూరపుకాయి పుచ్చుకోవడము మాత్రమేతప్ప
యితరవ్యాపారము లేకుండా యుండెను ఈవార్త క్రమక్రమముగా దేశమం
తటవ్యాపించి శత్రువులుహద్దుదాటి రావడమునకున్ను దుష్టకోకలు తలయెత్త
డమునకున్ను వ్యవహారస్తులు అక్రమములుచేయడమునకున్ను అవకాశముకలిగి
నందున దర్బారుమంత్రులంతా నాలోచించి ఖిరుదుమండఅను పెద్దవజీరువద్ది
కి వెళ్లి స్థితియంతయు తెలియచేసిరి ఆయనభగవంతునియందు భారమువేసిపా
దుషాహుజూరుకు అక్కడనుండే యొకపరిచారకునిచేత ప్రపంచమునకలం
కారమైన యేలినవారి సుందరరూపమును చూచిపాదములను ముద్దుపెట్టుకో
వలెనని చాలారోజులనుంచి పెద్దగులాముకు కోరికకలిగియున్న దని వర్తమా
నముపంపించినంతలో - ఆయనతండ్రినాటివజీరున్నుమంచిఆలోచనకర్తయున్నై
నన ంగతిరారాజు యెరిగివున్నందున రావడమునకు యాజ్ఞాపించినారు, ఆయ
నవెళ్లిమామూలుచేసివందనములుచక్రవర్తియొక్కశ్రమకరమైనస్థితినిన్నిఆహారవ
ర్జనమువల్లవచ్చిన మారురూపమునున్ను చూచిమొర పెట్టకుండా నుండలేక
పోయెను అంతటనీవువచ్చిన పనియేమనది వెళ్లి రాజ్యపరిపాలనము సేయవలసిదని
పాదుషాసెలవియ్యగానె ఏలినవారి కటాక్షమువల్ల రాజ్యాధికారమునాకు సి
ద్ధమయ్యేయున్నది, తమవలెలాగున నుండడమున కేమియగత్యము తటస్థించినదో
సెలవిచ్చితె నాకుతోచినమనవి చేసుకుంటాననిన్నియిందుకేమమ్మున జాగ్రతచే
సి యుంచినారనిన్ని వజీరుఅగుపరచితే యిదిఆలోచనకుసాధ్యమైనదికాదుఎం

దుఃఖనీకి శ్రమ ఇంతకాలానకు భగవంతుడు నాకుసంతానమివ్వలేదు యికరా
జ్యభారమను తలనొప్పిని నేను భరించచాలనుగనక ఈశ్వరారాధనవల్లనైన ఐహిక
ముకాకపోతే ఆముష్మికమైన నాకలుగునేమోయనిన్ని యీపైని అడవులు కొండ
లు మొదలైనస్థలములోని వాసముసేయనిశ్చయిస్తిననిన్ని చెప్పియొక్కపర్యాయ
ముపోయని నిట్టూర్పులిడి యూరకుండెను అప్పుడు ఖిరుదుమందు(౩)పదునెని
మిదివేల తరహాలుగల జీవరాసులను వొకమాటలో పుట్టించిన దేవుడు తమకు
కుమారునియివ్వడని నిరాశపొందడము న్యాయముకాదని ఉయ్యాలలో బిడ్డనుం
చియూరిలో సాటించినట్టు చెప్పినసామితెగా దేవుడు యిక్కడనే యుండగా అడ
విలో వెతకడము బైరాగులపనిగాని (పాదుషాపనికాదనిన్ని) ముందు(౪)
అంత్యవిమర్శదినములలో దైవసాన్నిధ్యమందు రాజుకేవలము న్యాయపరిపా
లన విషయమైయే విమర్శించబడుతాడుకదా అందుకు వ్యతిరేకముగానిప్పు
డు తమతపస్సు యేమిచేయకలదు, తుదకు తమతండ్రిగారు చాలా ప్రయాసపడి
సంపాద్యముచేసినరాజ్యము తమరు పుణ్యానకు పోగొట్టుతున్నట్టు అపకీర్తికి
పాత్రులౌదురనిన్ని మహారాజులకు న్యాయపరిపాలనము దానధర్మముప్రచ్ఛ
న్నవేషులైయుండే ఫకీరులయొక్క ఆశీర్వాదమువనికి వస్తున్నదని మాటిమా
టికి వజీరుమనివిచేసి న్యాయము నిష్పక్షపాతముగా సేయుటచేత చక్ర
వర్తియతని ప్రార్థనను యంగీకరించి రాజ్యభారమును వహించి సమస్తమైనవా
రిని సంతోషపరచుచు పగలు వ్యవహారమున్ను రాత్రి గ్రంధకాలక్షేపమున్ను సే
యుచుండెను - యిట్లుండగా నొకరోజున ఖిరుదుమందు తెలియచేసిన తరహాగా
గ్రంధమందుకూడా కనబడ్డందున నొకరోజు రాత్రి రాజుమారువేషము వేసుకొ
ని కొంతపైకము తీసుకొని యెవరికి తెలియక కోటబయలుదేరి నిర్మలాంతఃకరణ
ముతో (౫) దరూద్ అనేయొకమంత్రమును పఠించుచు ఊరువెలపల స్మశాన
వాటికకు వెళ్లుచుండెను అప్పుడు చీకటిన్ని గాలిన్ని విశేషముగా కలిగినందున
ఎదుట కొంతదూరములో వొకకాంతి కనబడెను అదియంత్రమా లేక మాయ
దీపమా మరియేమనియాలోచించుచు యేదైతేనేమి వెళ్లితే తెలుస్తున్నది యీ
వెలుగుయొక్క కాంతిచేత నాయింటిదీపమునకు కూడా ప్రకాశము కలిగినా కోరి
కె సఫలమా నేమోయని యెంచి ముందు అడుగుపెట్టి చూస్తే నలుగురు ఫకీరులు త

(౩) పదునెనిమిది వేల జీవులను మొదట సృజించినట్టు తురకలకు సిద్ధాంతము. (౪) హూ
ణులవలెనే తురకలకున్ను అంత్యవిమర్శ కద్దని సిద్ధాంతము, (౫) దరూద్ అనే మంత్రము
తురకలలో గురువిషయమై చెప్పియున్నది.

మదేశమునుంచిన్ని జాతినుంచిన్ని వైరాగ్యమార్గాయాసముచేత మోకాళ్లమీదతలలుంచుకొని ఆకాశమే ఆచ్ఛాదనముగానుంచిన దీపము మెరుస్తుండగాగోడ మీదవ్రాసినచిత్తరువులవలె కూర్చుండిరి.

వారిలోకలిసివారిస్థితిని తెలుసుకోవడమునకు మహారాజుగారు ఆలోచించినాకుగాని వారుదేవతులో కొరవిదయ్యములోలేక మరియెవరో కనుక్కోందామని బుద్ధినిమళ్లించివారికి తెలియకుండా యాసమీపమందుండే యొకస్థలములోదాగియుండిరి యంతట యానలుగురిలో నొకఫకీరు అవశ్యాత్తుగాతుమ్మి భగవత్ప్రార్థనచేసెను ఆధ్వనిచేత తతిమ్మాముగ్గురు తుళిక్కిపడిలేచి దీపమునెగసనతోసిహుక్కాపుచ్చుకొని తమతమబిచానాలమిదకూచుండియుండగా అందులోనొకడు ఈరాత్రికొండలాగునతెగకుండానున్నది రేఖ్రమనముయేలాగునయెక్కడనుందుమో తెలియదు, ఇందుకు కాలక్షేపార్థముగాయెవరెవరిలలాటస్థితిజరిగినంత అబద్ధములేకనొకరితో నొకరు తెలియచేస్తె తెల్లవారగట్లవుతున్నది మిగిలినరాత్రిపక్కమీదనిటుంచి అటువొత్తిగిలేవరకు అవుతున్నదనిచెప్పెను, అందుకు తతిమ్మావారు హర్షించి కోరినందున ముందుగానొకఫకీరు అతనిస్థితియాత్రిందవివరించినప్రకారము తెలియచేసెను.

మొదటఫకీరుకథ.

మొదటిఫకీరు రెండుమోకాళ్లపైని కూర్చొనిటిబెట్టుకొని తనప్రయాణముయొక్కస్థితిని యీతరహాగా చెప్పడమునకు ఉపక్రమించెనదియెట్లనిన.

ఓభగవద్భక్తులారా కొంచమిటుతిరిగి తుదమొదలులేనినాగ్రహచార స్థితిని చిత్తగించిపరిశీలనచేయుడీ ఓస్నేహితులారా నాజన్మభూమియు పెద్దలనివాసస్థానము(౬)యెమన్ అనేదేశము, ఈదీనునియొక్కతండ్రి ఖాజాఅహమదు అనేపేరుగలగొప్పవర్తకుడు యతనితో యేసాహుకారున్నువర్తకుడున్నుయతనికిసమానములేకుండానుండిరి అన్నిపట్టణముల్లలోకొఠీలున్ను ఆయాదినుస్సులుఅమ్మడముకొనడమునిమిత్తముగుమస్తాలుమొకరరుఅయియుండిరి,లక్షలకొలదిరూపాయలునగదున్ను దేశదేశములవర్తకులయింట్లోసిద్ధముగానుండడముగాకయతనికిద్దరుసంతానముమాత్రముకలిగియుండెను అందులోపెద్దలసాన్నిధ్యమందుహాజరుగానుండిఫకీరువేషమువేసుకొనితనసంగతి తెలియచేస్తున్నయీఫకీరొకడు రెండోదియితనితోడపుట్టువు, ఆమెకుతండ్రిజీవించియున్నప్పుడేసురియొకపట్టణపుసౌదాగరుకుమారునికి వివాహముచేసియున్నందున ఆమెయత్తవారియింటివద్దనే

---

(౬) యమన్ అనేదేశము అరబ్బిలోచేరియున్నది.

యుండెను ఆయనయింట్లో ఇంతఐశ్వర్యమున్ను ఒక్కటేపురుష సంతానమైనం
దున ఆచిన్నవానియొక్క ముద్దుముచ్చటలకేమితక్కువ ఈఫకీరుయొక్క ప్రేమచేత
తలితండ్రులసంరక్షణచే పెరిగిచదవడము వ్రాయడము శస్త్రవిద్యావర్తక నైపు
ణ్యముమొదలైనవి యభ్యసించినందున పదునాలుగవ సంవత్సర పర్యంతముమి
క్కిలి సంతోషముగా స్తిమితముగా ప్రపంచదృష్టిలేకుండా కాలముజరుగుచుం
డెను అవశాత్తుగానొక్క సంవత్సరములో నేతలిదండ్రులుదైవవశము వల్లచ
నిపోయినందున దుఃఖముసంప్రాప్తమైనది, అదియెట్టిదని చెప్పచాలనువొక్క
పర్యాయమే తనపైనిపెద్ద లెవ్వరులేనందున దిక్కుమాలినవాడనై అవశాత్తు
గాసంభవించిన యీయాపద చేతనన్నపానములులేకుండా నలుబదిదినములవ
రకు జరిగినవి పెద్దరోజున తనబంధువులువచ్చి కార్యముకాగానే వారందరుతం
డ్రిపోగానాకు చుట్టి ప్రపంచములో సంసారికి తలితండ్రులు చనిపోతునేయు
న్నారు, మనమున్ను వొకనాడు చనిపోవుచున్నాము గనుక మనస్సుసమాధా
నముచేసుకొని నీయిల్లుచూచుకోవలసినదన్ని యిప్పుడునీవుతండ్రిస్థానమున కె
జమానుడవయినావు గనుకనీయొక్క వ్యవహారములలోనున్న ఇచ్చిపుచ్చుకోవడ
ములలోనున్ను జాగ్రతగానుండవలసినదన్ని బోధపరచి ధైర్యము చెప్పి శెలవు
పుచ్చుకొనిరి వ్యవహార సంబంధులైన గుమస్తాలు నౌకరులు చాకరులు వచ్చి
నజరులిచ్చి కొలువులోనున్ను నియమన్ను దినస్సులమరు చెల్లగించవలసినదని మనివి
చేసినారు వొకపర్యాయమే అపరిమితమయిన యీభాగ్యమును చూచికండ్లు భ్ర
మిసినది యప్పుడేఖచ్చేగసిద్ధపరచి ఫరషులున్ను చాదినీలున్ను ఆయాకాలముల
కు తగినట్టుచిక్కుచాపలు వేయించడమున కాజ్ఞాపించినాను మంచిమంచిచూ
పరులైయినలంబుతాలను నౌకరినుంచినర్కారులోనుంచే వాండ్లకు పశస్తమై
నముస్తాబులుసరహాలుతరహాలుగాయిచ్చినాను ఈఫకీరు మసలందు పైనిచాలీసు
నానుకొనినూన్చున్నాడు ఇంతటగుండ్లాలున్ను సోమారులున్ను అబద్ధీకులుకున్నన
వ్వులకబురులుచేసి వాండ్లున్నుపోగైస్నేహితులైగవాండ్లతోనిమిదిజాములసహ
వాసము చెయ్యడముచేత నెక్కడలేని కబురులు తేవడమున్ను తందన పదాలు
పాడమున్ను అక్కరమాలిన ప్రసంగములు ఇటు కొందరు అటుకొందరు
వాదించడమే కాకుండా ఈవయస్సులో మొగలిపువ్వుల ఆసవము గులా
బీపన్నీరుతో వండించి సుందరులైన స్త్రీలతో కూడా పానముచేసి భోగిం
చ వలసినదిని కూడా చెప్పిరి మనుష్యుని చెడకొట్టడమునకు మనుష్యుడే(౬)సై

---

(౬) సైతాన్ అనేభూతముమనుష్యునిపట్టిఅక్రమాలుచేయిస్తుందనితురకలసిద్ధాంతము.

తానై యున్నాడూ ప్రతి మాటా చెప్పడము నుంచి నాయొక్క మనుస్సన్ను చెడిపోయి సారాయి స్వేచ్ఛముల జూదము వీటియందు ఆసక్తిపుట్టి తిరిగి వ్యవహార సంబంధమైనవి యిచ్చి పుచ్చుకోవడములు మరచినను హాచమత్కారము చూడడమే ముఖ్యమైన పనిగానుండెను, నాయొక్క నౌకరులుచాకరులు యిలాకాదారులు ఈపరాకుచూచి యెవరికి ఏవిదొరికితే అవివేరుచేసినారు యెన్నిరూపాయలు ఖర్చు అవుతున్నదో యెక్కడనుంచివస్తున్నదో యెక్కడికి వెళ్లుతున్నదో యేమిన్ని తెలియకుండా సంసారము లూటీఅయినది వకరి ఆస్తియందు రెండోవారికి కనికరములేదన్న సామెతనిజము ఈనివేషమైనకర్చులో (౮) ఖారూన్ యొక్క ధనమైనా నిల్చి పనిచేయు చాలదుకొన్నిసంవత్సరములలోనే యొక్కటోపిన్ని లంగోటిన్ని తప్ప మరియేమి లేకుండా పాయను నోటికిచేతికి అభ్యాసము లేకుండా సంచరిస్తున్నటువంటిన్ని నిమిత్తము వచ్చినప్పుడు నా విషయమై తమ ప్రాణములు ముందుగావిని యోగపరుచు తామని మాటిమాటికి చెప్పేటటువంటి స్నేహితులు మాయమైపోయిరి నౌకరులు చాకరులు లంబుతాలు బంట్లు దలాయతులు స్వకీయపరివారము ఇంటియాశ్రితులు అందరునన్నువదిలి పెట్టిగట్టెక్కినారు ఏమిన్నీ స్థితి యిలాగైన దాయనియడిగేవారు లేకుండానుండిరి దుఃఖమున్ను ఏకాకిత్వము కయినా సంభవించక రెండుమూడు కఠినమైన యుపవాసములుచేసి ఆకలి బాధపడలేక లొంగిపోయి నిర్లజ్జత్వము నేబురఖాముఖము వేసికప్పుకొనితోడఫుట్టు ఇంటికివెళ్లగలందులకు నిశ్చయించినాను గానితండ్రిగారు కాలముచేసినతరువాత (౯) ఈకుండేటిస్వప్నములో ఆమెనుపమై నాపంపించడమునకుగాని యూరకే యుత్తరమువ్రాయడమునకైనాగాని యెంతమాత్రముజరిగించడము లేదనిన్ని పరామర్శ విషయముగాను ప్రేమచేత వొకటిరెండుత్తరములు ఆమె వ్రాస్తేవాటికి జవాబువ్రాయలేదని బిడియమవుతూవున్నా అంతకంటే వేరె మరియేస్థలము కనపడలేదు ఏలాగైతేనేమి కాలుసడకను చేతులోనేమున్ను లేకుండా పడుతూలేస్తూ వెయికష్టములుగడిపి అనేకమజిలీలుదాటి తోడఫుట్టు వుండేపట్టణముచేరి ఆమెయింటికి ప్రవేశించినాను ఆమాత్యతుల్యులైన సతోడ

---

(౮) ఖారూన్ అనేఆయన తురకలలోకు బేరుడువంటివాడు, (౯) కుండేటిస్వప్నమనగా తురకలలో చెవలపిల్లకిని ప్రసిద్ధమైనదౌత్యమును, గనకతుటికాలమువైశ్వాస్యమునిఅగ్నము

పుట్టినది నాయొక్క స్థితిచూచిచాలాఆదరించి ముద్దుపెట్టుకొని కంఠాలింగనము
చేసుకొని మిక్కిలిదుఃఖించి నువ్వులుమినుములు నల్లమేకలు నాపైనినిగతుడిచి
పారవేసి మనముతిరిగి కలుసుకోవడముచేత మనస్సుకు బహుసంతోషమై నది
గానిఅన్నానీకు ఈవిరూపము ఏలాగునసంభవించినదనిఅడిగితేనాకళ్లవెంట బొ
టబొట నీళ్లుకారినవిగాని నేను ఏమిజవాబుచెప్పలేక యూరకేవున్నందున ఆమే
గ్రహించి వెంటనే ప్రశస్థమైనపోషకు తెప్పించిపంపించినందున స్నానముచే
సుకొని ఆబట్టలు తొడుగుకొంటిని తరువాతమిక్కిలి ప్రశస్తమైనటువంటిన్నినా
కుతగినటువంటిన్ని వొకబస ఆయింటికిసమీపముగా విడిపించి ఉదయకాలమం
దు నానిమిత్తముపానకమున్ను మిఠాయిన్ని లేహమున్ను పేశముగుజరులుగల
ఫలహారములున్ను మూడోజామున్ను ఎండుపచ్చిగలపండ్లు రాత్రిపగలు రెండు
పూటలుకొత్తకొత్తరుచులుగల పులావుగొట్టె కబాబులున్ను తెప్పించితానెదు
టనుండి నాచేతతినుపించి వెళ్లుతుండడమేకాక నావిషయమై అన్నితరహాపరా
మర్శలున్ను కూడాఘుచ్చుకుంటూనుండెను. నేనుఅటువంటి శ్రమను పొంది
నతరువాత ఈసుఖమనుభవించినందున భగవంతునిసాన్నిధ్యమందు అనేకస
హస్రవందనములు సమర్పించినాను, కొన్నినెలలు ఈలాగునిర్విచారముగా
నింట్లోకాలుబయిటు పెట్టకుండాకాలముజరిగెను.

వొకరోజునతల్లికి మారుగానన్ను సంరక్షిస్తున్న ఆతోడబుట్టినది ఓఅన్నానీ
వు నాకంటిపాపవంటి వాడవయిన్ని చనిపోయిన తలితండ్రులకు ఆనవాలవై
యున్నావు, నీవురావడముచేత నాహృదయము చల్లపడ్డది, నిన్నుచూస్తున్నం
తమట్టుకు సంతోషముచేత నుప్పొంగుతున్నాను నీవునాయెడల చాలాదయ
వుంచినావు గానిమొగవాండ్లను భగవంతుడు ఆర్జనకొరకే పుట్టించినందున
ఇంట్లోకూర్చుండి యుండడము వారికితగియుండదన్ని, యేమొగవాడు సోమ
రిఅయి యిల్లుపట్టి యుంటాడో వాణ్ని ప్రపంచము లోనిమనుష్యులు ఆక్షేపి
స్తురనిన్ని విశేషించి యీపట్టణములోనిమనుష్యులు నీవుతలిదండ్రులభాగ్యము
యావత్తు పోగొట్టుకొని చావమరిదిపోషణకులోనైయున్నావనివాడుకొంచు
న్నారని చెప్పియిదిసిగ్గులేనితనముగానున్ననీకునాకుహాస్యాస్పదముగానున్నతలి
దండ్రులకప్రతిష్టగానున్నుఉంటున్నదనిచెప్పి, అలాగేకాకపోతే నాయొంటిచర్మ
ముచెప్పులు కుట్టించినీకు తొడిగించినాహృదయములో దాచుకొందును, ఇప్పు
డునీవుప్రయాణము చెయ్యడమునకు సలహాగాకనపడుతున్నది భగవంతుడుద
యచేస్తే దశతిరిగి పట్టవచ్చును. ఈఅలసటున్ను వొంటరితనమునకున్న బదిలీ

సౌఖ్యమున్నుసంతోషమున్నుకలుగుతున్నదనిచెప్పగా యీమాటలువినినప్ప
డేనాకుసిగ్గువచ్చి ఆమెతెలియచేసిన ఉపదేశమునువిని యిప్పుడునీవుతల్లికి మా
రుగానున్నావు నీవుయేలాగుచెప్పితే ఆలాగేచేస్తానని చెప్పితిని, అమెనామాటవి
నగానే యింటికివెళ్లి మేభై సంచులమొహుర్లు పట్టించుకొనివచ్చినాయెదుటను
నిచియొకవర్తకుల సమూహము (౧౦) డమష్కు అనేస్థలమునకు వెళ్లుతున్నది
నీవుఈరూపాయీలు పెట్టివర్తకపు సామానులుఖరీదుచేసి పెద్దమనుష్యుడయి
నయొకవర్తకునిపరముగా నొప్పగించిక్రమమైనదస్తావేజువ్రాయించిపుచ్చుకొని
నీవున్ను అక్కడికివెళ్లి లాభసాటికైనాదినుసుకైనా నగదుకైన అమ్మకముచే
సి సంపాదించవలసినదని చెప్పినది, నేనుఆసొమ్ముపట్టుకొని బాజారుకువెళ్లిసా
మానులఖరీదుచేసియొకవర్తకునిపరముగానిచ్చి దస్తావేజువ్రాయించిపుచ్చుకొ
న్నాను, ఆవర్తకుడు సముద్రముమీదుగా వాడలోరవానా అయివెళ్లినాడు
నేనునాటుప్రయాణము చేయనిశ్చయించినాను, నేనుసెలవుఅడిగినప్పుడు ఆమె
విశేషమైన వెలగలయొకపాగానున్ను రత్నసజ్జుతోనున్న యొకగుఱ్ఱముతెచ్చి
యొకపెట్టెలో మిఠాయినింపి యొకపక్కను మంచినీళ్లు రెండోబాజున తోలు
సంచితోకట్టినది (౧౧) యిమామ్‌జామీనుయొక్క మొక్కుబడిరూపాయినా
జెబ్బకుకట్టినది, పెరుగుతోనానుదిటియందు బొట్టుంచికండ్లనీళ్లు గ్రుక్కుతూని
న్నుదేవునికివొప్పగింత చేసినాను వెళ్లుమన్నది, నీవుఏలాగున వెళ్లుతున్నావో ఆలా
గున నేత్వరగా ముఖముచూపించవలసినదని యన్నది నేనున్ను అందుకుఆమోదిం
చిక్షేమమును గురించినస్తోత్రపాఠము చదివినీకున్ను భగవంతుడే సంరక్షకుడ
ని ఆమెతోచెప్పి అక్కడనుంచి బయలుదేరి గుఱ్ఱపుసవారిఅయి భగవంతునియం
దు భారమువేసి రెండుమజిలీలు వొకమజిలీచేసుకొంటూడమష్కుకు ప్రవేశిం
చినాను.

తుదకు ఊరివెలపలి దర్వాజావద్దకి వెళ్లేటప్పటికి రాత్రియయినది పహ
రా సిపాయీలుతలుపులు మూసివేసినారు, వారినిబహు వినయముగా పరదే
శిని దూరమునుంచి శ్రమపడివచ్చినాను తలుపుతీయిస్తే పట్టణములోకి వెళ్లిసు
ఖిస్తానని బతిమాలితే లోపలనుంచి వాండ్లుకోపపడి యింతరాత్రి అయినత
ర్వాతనీవు యెందుకువచ్చినావు ఈవేళప్పుడు తలుపుతీయడమునకు సెలవులేదని
అన్నారు, వాండ్లవల్లఆఖరు జవాబుపుచ్చుకొని ఊరుచుట్టునుండే కోటదగ్గిరదిగి

(౧౦) డమష్కు అనేపట్టణముపారసీదేశ సమీపముగానున్నది (౧౧) యిమామ్‌జామీను
తురకలలో వెంకటేశ్వరులవంటివాడు.

గుట్టముమీదనుండే జీనుపోషుపక్క వేసుకొని కూచున్నాను, జాగరణనిమిత్తము ఇటుఅటుతిరగడ మారంభించినాను, అప్పుడు అర్ధరాత్రియయి ఊరుమాటుమణిగినది. అప్పుడొకచందుకుపెట్టె కోటగోడమీదనుంచి క్రిందికిపడడము చూచియాశ్చర్యపడి ఇదియొకయంత్రమోలేక భగవంతుడు నాదురదృష్టమును గురించి దారిద్ర్యవిషయమై కనికరించి యెవ్వరికితెలియక ధనముపంపించినాడే మోయనివుంటిని అదిభూమిమీదపడగానేజడుస్తూజడుస్తూ దగ్గిరకువెళ్లిచూస్తేకర్రపెట్టెవాన్ని ఆశచేతవిప్పిచూస్తే ఒకసౌందర్యవతియైన ప్రియురాలుచూచూడముచేతనైతే మతి స్థిరముతప్పిపోవునో అటువంటికామినీ రూపముగలది శరీరమందు గాయములుకలదై రక్తముచేతతడిసికండ్లు మూసుకొని గింజుకుంటూమెల్లిమెల్లిగా పెదవులు కదులుస్తున్నట్టుకనుపించినది, మరిన్ని నోటివెంబడి ఓవిశ్వాసహీనుడవయిన దుర్మార్గుడా హానికరుడవయినక్రూరుడానావల్ల పొందిన మంచికిన్ని స్నేహమునకున్ను,ఇదేనానీవుచేసినకార్యము మంచిది ఇక నొకగాయముచెయ్యి నీయొక్క నాయొక్క న్యాయము భగవంతుడు తీరుస్తాడని యంటూ ఆమతిలేనిస్థితిలోనే దుప్పటీఅంచు మొగముమీదికితీసుకొని నావైపుయేమీచూడలేదు, ఈఫకీరువాన్నిచూచిన్ని ఈమాటలువినిన్ని నిశ్చేష్టితుడై మనస్సులోనే దుర్మార్గుడు ఇటువంటిమృదుత్వముగల స్త్రీకి గాయములుచేసినాడు, వానిమనస్సులోయేలాగుతోచినది చెయ్యిదీనిమీదికె నేలాగునడిచినది, దీనిమనస్సులోనిదివరకున్న స్నేహముకలిగేయున్నది,ఇటువంటి ప్రాణాపత్సమయమందు కూడావాణ్ని జ్ఞాపకముచేసుకొంటున్నదని తనలోతాననుకొంటూనుండగా ఆమాట ఆమె చెవిలోపడ్డది, అప్పుడొకపర్యాయము మొగముమీదనున్న ముసుకు సర్కాయించినన్నుచూడగానే నాదృష్టి ఆచూపుతో కలిసినాకు మూర్ఛవచ్చి శరీరస్మృతిలేకుండానుండెను. ఆపిమ్మట ధైర్యముతెచ్చుకొని నిజముచెప్పవలసినది నీవుఎవరు. యీలాగునెందుకు సంభవించినదని అంటే జవాబుచెప్పడమునకుశక్తిలేనప్పటికిన్ని మెల్లమెల్లగాభగవంతునికి వందనముచేస్తాను నాస్థితి గాయములచేత నీలాగున్నది. మంటిగడ్డనేనుచెప్పేదియేమున్నది, యిక కొంతసేపుమాత్ర మేజీవిస్తాను. ఒకవేళనేనుచనిపోతే ధర్మార్థముగానడుముకట్టి ఈదురదృష్టవంతురాలనైన నన్ను ఈపెట్టెతోనే యేస్థలమందునైనా ఖననముచేస్తే. లోకులుమంచిచెడ్డలువాడిక సేయకుండా విముక్తినిపొందుతాను అందువల్లనీకుపుణ్యముకూడా లభ్యమవుతున్నదని అంతమట్టుకుచెప్పి ఊరకుండెను, ఆరాత్రినావల్ల యేప్రయత్నముకాక ఆపెట్టెనావద్దికితెచ్చుకొని వెళ్లగా

రి తెపట్టణములోకి వెళ్లి శక్తివంచనలేకుండా ఇందుకు సాధనము చేతామనిఘంట
లు లెక్కపెడుతూనుంటిని ఏలాగననైతేనేమి తెల్ల వారగట్ల అయినందున కోళ్లు
కూసినవి, మనుష్యుల సందడి వినపడ్డది. నేను ప్రాతః కాలదేవ ప్రార్థనచేసు
కుని ఆపెట్టెగుఱ్ఱపుగంతకు కట్టుకుని తెలుపు తెయగానే పట్టణములోనికి వెళ్లి అ
న్ని అంగులు కలిగినటువంటిన్ని విశాలమైనటువంటిన్ని వొకహవేలి అద్దెకు పు
చ్చుకొని దిగినాను, ముందుగా ఆప్రియునాలిని ఆపెట్టెలోనుంచి మైకితీసి దూది
పింజలుమీద మృదువైన పక్క వేసి వొకస్థలమందు పరుండపెట్టి, సమ్యకమైన వొ
కమనుష్యుని అక్కడకాపిలయుంచి యీఫకీరు శస్త్రవైద్యుని వెతకడమునకు బ
యిలుదేరినాను. ప్రతివారిని అడుగుతూరగా వొకమంగలి శస్త్రవిద్యయం
దున్ను వైద్యశాస్త్రమందున్ను మిక్కిలిగట్టివాడనిన్ని శవము అయినా అతనియె
దటికి తీసుకొని వెళ్లితే భగవంతుని యాజ్ఞప్రకారం మొక్కపర్యాయము మేజీవించిలే
వడమునకు తగిన చికిత్స చేస్తాడనిన్ని అతడు ఈఃరుగుననే కాపురమున్నాడ
నిన్ని అతని పేరు ఈసా అనిన్ని ఒకమనుష్యుడు చెప్పినాడు ఆసంతోష వార్తవినగానే
యెకాయెకిన భోగట్టాలు చేస్తూజాడలు తుదఅతని యింటిగుమ్మములోకి వెళ్లియక్క
డకూచుండినియున్న తెల్లనిగడ్డముగలవొక మనుష్యునిచూచినాను, అక్కడకొం
దరుమనుష్యులు పలాస్తురులు నూరుచుండిరి, ఈఫకీరు సంతోషముచేత మిక్కిలి
వినయముగా సలాము చేసి మియొక్క పేరున్ను ప్రతిష్టయున్ను వినివచ్చినానని
న్ని నేనునా దేశమునుంచి వ్యవహారనిమిత్తము వచ్చేటప్పుడు ప్రేమచేత భార్యను
కూడా తీసుకొని రావడమైనదనిన్ని ఈపట్టణమునకు సమీపగా వచ్చేవరకు సా
యంకాలమైనందున పరాయిపట్టణములోకి రాత్రి వెళ్లడము మంచిదికాదనుకొ
ని బైటనొకచెట్టుక్రిందదిగియుండగా రెండవజామున బందిపోటువచ్చి యావత్తు
సామానుధనము దోచుకొనినగలకోసరమాశపడి నాబీబికిగాయములు చేసినా
రనిన్ని భగవంతుడు మీకు విశేషవిద్యనిచ్చినాడు గనక యీపరదేశియందను గ్రహిం
చిబీదవానియింటికి విజయముచేసి ఆమెనుచూడవలసినదనిన్ని ఆమె జీవించితే మీ
కు మిక్కిలి కీర్తి కలుగుతున్నదనిన్ని నేనుజీవించియున్నంతమట్టుకు మీకు సేవకావృత్తి
చేస్తాననిన్ని తెలియచేస్తే ఈసాఅనేశస్త్రవైద్యుడు మిక్కిలి కనికరపుమనస్సుక
లవాడున్ను భగవద్భక్తుడున్ను అయినందున నాదీన వాక్యములనువిని కటాక్షించి
నాతోకూడా నాహవేలీదగ్గరకువచ్చి గాయములను చూస్తూనే ధైర్యముచెప్ప
డమేకాకుండా భగవదనుగ్రహము వల్లయీఆమెకు నలుబదిరోజులలో గాయము
బాగుచేసి ఆరోగ్యస్నానము చేయిస్తాననికూడా చెప్పెను అప్పుడు ఆయనఅ

న్ని గాయములు వేపచెక్క కషాయము చేత కడిగించి సాఫు చేసికుట్టడమునకు తగి
న గాయములు తనంతట నే కుట్టి మిగిలిన గాయములలో కొన్నిటికి పట్లున్ను కొ
న్నిటికి వత్తులున్ను వేసిబట్టయీరికెలతో కట్టి రెండుపూటల వస్త్రాన్నిన్ని గాయ
ములకు వేసిన టాకాలూడిపోవ్వే పని చేయకుండా జాగ్రతగానుండవలసినదని
మిక్కిలి యనుగ్రహముతో తెలియచేసినాడు మరిన్ని కోడిపడిదము అన్నమున
కు ప్రతిగా కుతికలో వేస్తూవుండవలసినదన్నిన్ని (౧౨) బేదమష్కయొక్క అర
ఖుపన్నిటితో కలిపియిస్తూవుంటే బలము కలుగుతున్నదనిన్ని కూడా చెప్పి వెళ్లుతానని
సెలవు అడిగితే నేను మిక్కిలి వినయముగా అయన యెదట రెండు చేతులు జోడించుకు
ని మీరు ధైర్యము చెప్పడము చేత నేను జీవించియున్నాను లేకుంటే చనిపోవడముకన్న
వేరే మార్గము కనపడలేదని అగుపరచి అత్తరుతాంబూలమిచ్చి పంపించియుం
టిని, నేను రాత్రిపగలు ఆగంధర్వస్త్రీయొక్క సన్నిధిని హాజరుగానుండి సుఖ
మన్నది నావిషయమై నిషిద్ధముగా నాలోచించి సంచరిస్తూ ప్రతిరోజున్ను దేవుని
సన్నిధియందు ఆమెకు ఆరోగ్యనిమిత్తము ప్రార్థన చేయుచుంటిని, ఇంతలో ఆసా
దాగరున్ను వచ్చి నా ఆస్త్రీ నిచ్చినలాగున నే నాకొప్పగింత చేసినందున నేను అదిమె
చ్చుతగ్గులుగా అమ్మకము చేసి మందుల కింద ఖర్చు చేయుచుంటిని. ఆశస్త్రవైద్యు
డెల్లప్పుడు వచ్చుచు కొంచకాలములోనే అన్ని గాయములు ఎఱ్ఱపుండ్లుపడేలా
గు చేసి వేగముగానే ఆరోగ్యస్నానము కూడా చేయించినందున వింతతరహా
ల సంతోషము సంప్రాప్తమై యుండెను, అప్పుడు వాకదుస్తున్ను కొన్ని మొహ
రీలున్ను ఈసా యెదుటనుంచి ఆమెకు ప్రశస్తమైన ఫరషు చేసి మసలందుమీద
కూచుండబెట్టి ఈఫకీరు బీదలకు మిక్కిలి దానధర్మములు జరిగించెను ఆరోజు
ఈఫకీరు సప్తద్వీపములయొక్క యధికారము తన చేతికి దొరికినట్టు సంతోషించు
చుండెను ఆసౌందర్యవతికి ఆరోగ్యము కలగడమునుంచి యెటువంటి రంగుబయ
లు చేరినదంటే ముఖము చంద్రునివలె దేహము బంగారువలె ప్రకాశిస్తూనుండె
ను, మరిన్ని ఆమె.. ందర్యమును చూడడానకు దృష్టికి శక్తిహీనమై యుండెను, ఈ
ఫకీరు ఆమె యేమి సెలవిచ్చితే ఆప్రకారము ఆజ్ఞ కండ్లనద్దుకొని శిరసావహించి
హాజరుండి జరిగించుచుండెను ఆమె తన సౌందర్యముయొక్కన్ను అధికార
ముయొక్కన్ను గర్వము చేత ఎప్పుడైనా నావైపు చూచి జాగ్రతగా నాతో నీకు అ
క్కరయున్నట్టయితే నావిషయమై యేమాటనీవు అడగవద్దనిన్ని నేను యేమం
టే అది నిరాటంకముగా జరిగించుచుండవలసినదనిన్ని ఆలాగు చేయకపోతే పశ్చా

(౧౨) బేదమష్కయొక్క అరఖు కాశ్మీర దేశములో పుట్టినది.

త్తాపమునుపొందు తావసిస్సి సెలవిచ్చుచుండెను నేనుజరిగించిన సేవయొక్కయు న్ను మన్నించినఆజ్ఞయొక్కయున్ను ఫలము ఆమెకు అంగీకారమైనట్టు కనపడుతూ నుండేది ఈఫకీరున్ను ఆమె తాత్పర్యమునకు వ్యతిరిక్తముగా ఏపనిన్ని సేయకుండా ఆజ్ఞప్రకారము జరిగించుచుండేవాడు, కొంతకాలమిట్లు గుంభనమార్గము గా జరిగినది ఈఫకీరువద్దనుండేనగదున్ను దినుస్సులయొక్క అసలుఫాయిదాలన్ని ఖర్చయిపోయినవి. ఆపరదేశములో నమ్మికయువరూబదులు యివ్వనందునతుద కునిత్యకృత్యము జరగడమునకేయిబ్బందితటస్థమై విచారముచేత నీరసపడిమ ఖమునల్లపడికాంతితప్పిపోవడమున కారంభమైనది, అయితేయెవరితో చెప్పుకో ను, ఏమిజరిగినదో జరిగినది, ఫకీరుకు కోపమువస్తేతన ప్రాణానకేనష్టమన్న సామె తైయుండెను, ఇంతలో ఆమెతనబుద్ధిచేత ఆస్థితిని గ్రహించి ఓఫలానా అనినన్నుపిలి చినీవునావిషయమై జరిగించిన సేవకృత్తినాహృదయములో శిలాక్షరమైయున్న ది అయితేదానికిబదులు ప్రస్తుతము నేను యేమిన్ని చేయలేను ఖర్చుకేమైనా కా వలసియుంటే త్వొందరపడవద్దు యింతకాకితపుముక్కకలముసిరాబుడ్డి తీసుకొని రావలసినదని అన్నది అప్పుడు నేను యీమెవొక చక్రవర్తి కొమార్తై అయియుం డునన్ని అందునుంచి యింతనిర్లక్ష్యముగా మాటలాడుతుంటున్నదనిన్ని గ్రహిం చినాను ఆపైని నేనాలాగుజరిగిస్తేవొక చీటీ వ్రాసి నాచేతికిచ్చి కోటదగ్గిరమూడులా దులుగల వీధిలో వొక గొప్పహవేలియున్నదనిన్ని అందలియజమానుని పేరు సిద్ధీబ హార్ అనిన్ని అతనికి ఈచీటీయివ్వవలసినదనిన్ని ఆనవాలు చెప్పిఇచ్చినందున ఈఫకీరు ఆప్రకారముజరిగించెను అతడుయీచీటీపుచ్చుకొనినన్ను అడగకుండాను నా తో యేమిచెప్పకుండానున్ను వెంటనేలోపలికివెళ్లి పదకొండుసంచులు నౌకరులచే తపట్టించుకొనివచ్చి నామూరీఫత్తుగాయిచ్చినందున బసకుతీసుకొనివచ్చి ఆమెహు జూరులో దాఖలుచేసినాను ఇప్పటికి ఈపదకొండుసంచుల మొహరులు పుచ్చు కొనిఖర్చుచేయుము, ముందుభగవంతుడే ధారకుడైయున్నాడని, ఆమెచెప్పినది, అందువల్ల ఈఫకీరుకుమనస్సంతుష్టికలిగినదిగానివొక్కకాగితపుముక్కతీసుకొని వెళ్లియిస్తేకొత్తమనుష్యునికి ఇంతసొమ్ముఅడగకుండా అతడేలాగుయిచ్చినాడనిన్ని ఈమెతో ఈరహస్యముఎటువంటిదని అడుగుదామంటే మునుపేవద్దని ఆజ్ఞాపిం చియున్నదనిన్ని భగవంతుని తలచుకొని యాశ్చర్యపడుతూవుంటిని, యెనిమిది రోజులు అయినతరువాత యీప్రియురాలు భగవంతుడు చిరిగిపోనటువంటిన్ని మయిలకానటువంటిన్ని మానుషమనేఅంగీమనుష్యునికిచ్చియున్నందున పాతబట్ట లు వేసుకోవడమునుంచి మనుష్యధర్మములో భేదముకనుపడకపోయినప్పటికి ప్రజ

లదృష్టికి పైకి అటువంటి సమ్మకము కనపడదుగనక నాలుగు దారులు కలిసే నడిబజారు
లోనున్న ఈసఫ్ అనే పేరుగల సౌదాగరు దుకాణము వద్దికి రెండు సంచులు ప[illegible]
చుకొని వెళ్లి మంచి వెలగల నగలున్ను రెండు దుస్తుల జరీబట్టలున్ను పట్టించుకొని
రావలసినదని నాతో చెప్పినందున నేను వెళ్లేవరకు ఒక సౌందర్యమైన మొగవాడు అ
క్కడ జాఫరా రంగు బట్టలు తొడుగుకొని గాదీమీద కూర్చుండియున్నాడు, అతని
సౌందర్యమును చూడడమునకు దుకాణము మొదలుకొని బాజారు పర్యంతరము ప్ర
జలు నిండియున్నారు, ఈ ఫకీరు మిక్కిలి సరదతో ఆయనకు సలాము చేసి కూర్చుం
డి కావలసిన వస్తువులను గురించి తెలియచేస్తే అవియన్నియున్నవని అతను జవాబు చె
ప్పినాడు గాని మీరెక్కడనుంచి వచ్చినార్లు ఇక్కడ యెందుకున్నారు అని అడిగినాడు,
నాస్థితి అతనికి తెలియచేయడము మంచిది కాదని, ఆలోచించి వేరే తరహాగా మాట
లు చెప్పి జవాహీరును బట్టలున్ను పుచ్చుకొని వాటి ఖరీదు ఇచ్చివేసి సెలవు అడిగినాను
ఆయన నామీద కోపపడి స్నేహము పట్లు యింత వేగము సెలవడగడము న్యాయము
కాదని రసముగా నాతో సంభాషిస్తే తిరిగి కూచున్నాను, ఆ పిమ్మట ఆయన సంతో
షించి ఈ రోజున బీదవాని యింటికి తమరు దయచేసిన పక్షమందు మీ ఐశ్వర్యము
యొక్క సంతోష సభ కూర్చి నాల్గు ఘడియలు సంతోషించి కొంచ వన్నపా
నాదుల యొక్క విలాసము కూడా మనము కలిసి జరిగింతామని అన్నాడు
ఈ ఫకీరు ఆ సౌందర్యవతిని వొంటరిగా నెప్పుడున్ను ఉంచనందున ఆ పెఖ్ఖిది
జ్ఞాపకము వచ్చి అందుకు అంగీకరించలేదు గాని అతను నేను తిరిగి వెళ్లడమున
కు వొప్పలేదు, ఆఖరుకు ఆ సామాను బస యొద్ద నొప్పగించి తిరిగి [illegible]ావడమున
కు ప్రమాణము చేయించి వదిలినందున బసకు వచ్చి ఆ సౌందర్యవతి యెదుట
ఆ వస్తువులనుంచి యావత్తు స్థితిని తెలియచేస్తిని, ఆ పైని మష్యానకు తన ఖరారు చొప్పు
న నడవడము వాజిబీ గనక మమ్మును దేవుని సంరక్షణములో నుంచి విందుకు వెళ్లవలసినద
ని అన్నది, అందు పైని మిమ్ము వొంటరిగా వదిలి [illegible]డమునకు మనసొప్పదు, అయితే
సెలవు ఆలాగైనది గనక విధిలేక వెళ్లుతున్నానని చెప్పి ఆ సౌదాగరు దుకాణము వద్దికి వె
ళ్లినాను, అతను కురిచీమీద కూచుండి నాకెదురు చూచుచుండెను, నన్ను చూడగానే
రండీ నాయందు అనుగ్రహించి గొప్ప మార్గము కనపరచినారని అన్నాడు, అప్పు
డే నా చెయ్యి పట్టుకొని వొక ఆనందకరమైన తోటలోకి తీసుకొని వెళ్లి వొక చలువ కా
లువ యొద్దను బంగాళాలో మంచిస్థలమందు కూచుండబెట్టెను, వొత్కానాలు
మొగురుతున్నవి, కాలువలు పారుతున్నవి తరహాతరహా ఫలములు ఆ వసములో క
లిగియున్నవి ప్రతివృక్షములున్ను ఫలభారము చేత వొంగులాడుతూనుండెను వింతవిం

తగలపత్తులుకూయుచుపాటమీద కూచుండినిమొగురుచుండెను కొంతసేపటికి ఆ ...నలోపలికివెళ్లివెలగలమరియొకడ్రెస్సుతొడుగుకొని వచ్చినందున. నేనుచూచి భగవంతునితలచి మీకుదృష్టిదోషప్రహారమవుగాక అనియన్నాను, ఆమాటవిం టూనే చిరినవ్వునవ్వితమరున్నవేరేముస్తాబుకావలసినదని కోరినందున ఆలాగు జరిగించినాను, ఆయనమెచ్చగాభోజనపదార్థములున్ను సంతోషసామాగ్రి న్ని యేలాగుకోరితే ఆలాగుజాగ్రతచేసి ఈఫకీరుతోమిక్కిలి స్నేహముచేసిచ మత్కారమైనమాటలుఆడుతూవుండెను, ఇంతలోవొకమనుష్యుడు సారా బుడ్డి న్ని బల్లాహుఝారిగిన్నెపట్టుకొనిహాజరై అనేకతరహాలవాచవులున్ను తెచ్చియుం చిలవణపాత్రముకూడానుంచెను అప్పుడు ఆసవముపంచడమారంభమై సదినా లుగుపర్యాయములు గిన్నెతిరిగినతరువాత నలుగురు సుందరులైనచిన్నవాండ్లు జనపాలువిప్పియున్న వారు సభలోకివచ్చి పాడడమున్ను వాయించడము న్ను ఆరంభించినారు అప్పుడు ఎటువంటివార్కైనాట్టునదంటే (౧౩) తాన్సేన్ అ నేసంగీతపాఠకుడు ఆక్షణమందుంటె తనయొక్కతానమును మరిచి పోవును (౧౪)బీజోభావురా అనేసంగీతపాఠకుడువింటెవెర్రి వాడైపోవును అప్పుడుఆయ నకుకండ్లనిండ్లానీరుగ్రమ్మి అంతలోనాలుగుచుక్కలుడడదడమని క్రిందపడ్డందు న ఈఫకీరుతో ఆయనమీకున్నూనాకున్ను ప్రాణస్నేహమైనది ఇటువంటి సమయ లోమనస్సులోనున్నమాట స్నేహితులకు తెలియచేయకుండావాచడమేమతము లోనున్నమంచిదికాదని స్నేహధర్మమునుపట్టియొకరహస్యముమీతో తెలియచే సెదనని చెప్పితమసెలవైతేనాయొక్కప్రియురాలినిపిలిపించియీసభలోమనస్సం తుష్టిపొందుతాననిన్ని ఆబిడనెడబాసి యుండడముచేత ఏపత్తున్ని మనస్సునపట్టు కుండానున్నదనేను చూడకుండా చెందకుండానున్న ఈఫకరుమనస్సుకు సరదా పుట్టేటంతప్రేమచేత ఈమాటలన్నందున తమసంతోషమేకావలసినది అంతక న్నమరిమంచి యేమియున్నది ఆలస్యముచేయవద్దని అన్నాను అప్పుడు ఆయన చూపుచాపలవైపుసంజ్ఞచేయగానేభూతమువలెనల్లనికాటుకరంగు కలిగినటు వంటిన్నిమాడగానే మృత్యువుసంప్రాప్తమైనట్టుతోచేటటువంటిన్నియొకకురూ పియైనస్త్రీ ఆయనయొద్దకువచ్చికూచున్నదిదాన్నిచూస్తూనే ఈఫకీరుభయప డిమనస్సులోఇటువంటిమృదువైనప్రియునికి ఇంత ఆపదవంటిప్రియురాలాదీన్ని గురించేనాఇంతమూరముస్తోత్రముచేసితనకుకలిగియున్నప్రేమనుఆయనతెలియ

---

(౧౩)తాన్సేన్ అనేఆయనతురకలలో తుంబురుడువంటివాడు. (౧౪) బీజోబావురా అనేఆయన తురకలలో నారదుడివంటివాడు.

చేసినాడని నేను చాలా అసహ్యపడి తద్దోష పరిహారార్థము (౧౫) లాహౌల్ అనే మంత్రము చదివి యూరకున్నాను ఆ ప్రకారము మూడు రాత్రులు జరిగినది నాలుగో రోజున సిపాహి చేత నేను వాళ్లు తెలియకుండా నిద్రపోయినాను ఉదయముకాగానే ఆయన నన్ను లేపి కైఫు విరుగుడుకు వాషథమిచ్చి తన ప్రియురాలితో విందుకు వచ్చిన పెద్దమనుష్యునికి ఇంత కష్టనెక్కువ శ్రమ నివ్వకూడదని ప్రశంసించి ఉభయులు చేతులు పట్టుకొని లేచినారు నేను సెలవు యడిగితే సంతోషముగా నిచ్చినారు అప్పుడు నాకాసా బట్టలు తొడుగుకొని నా ప్రియురాలి వద్దికి వచ్చినాను ఆమెను వొంటరిగా రాత్రిళ్లు వదలిపెట్టి నేనుండడ మెప్పుడున్ను తటస్థముకానందున ఈ మూడు దినములు గైర్ హాజరైనందుకు లజ్జపడుతూ అక్కడ జరిగిన స్థితియావత్తున్ను వేరు వేరుగా వినివి చేసినాను ఆబిడ ప్రపంచములో నొక బుద్ధిమంతురాలైనందున చిన్నవ్వు నవ్వి అందుకేమి పరవా వొక స్నేహితుని కొరకు వినోదముగా వున్నందుకు నేను సంతోషించినాను యిందులో నీ తప్పేతమేమున్నది ఏమనుష్యుడయినా వొకరి యింటికి వెళ్లితే వారి సెలవు ప్రకారము తిరిగి రావలసియున్నది, అయినా ఆ పన్యాయపు మెతుకులు తిని యూరకేయుంటావా లేక అందుకు బదిలీ రెట్టిగా విందు చేస్తావా అనిన్ని యిప్పుడు నీవు వెళ్లి అయనను తీసుకొని రావలసినదనిన్ని విందును గురించి గాని ఉత్సవమును గురించి గాని నీకు ఏవిధమైన తొందర ఉండదనిన్ని చెప్పినందున ఆ సౌదాగరు వద్దికి వెళ్లి ప్రార్థించి తీసుకుని వస్తూ మార్గములో అందును గురించి యేలాగుండునో అని ఆలోచిస్తూ యింటి వద్దికి వచ్చే వరకు గుమ్మములో ధూమ్ ధామని యెగిరి పడుతూ వుండెను, ముందర శుభ్రము చేసి కళ్లాపిచల్లబడేయును, నకీబులు చోపుదారులు నిలువబడియుండిరి, నేను తొందరపడి చూచినాను గాని నా యిల్లని గ్రహించి లోపల కాలుంచి పరీక్షిస్తే హావేలీలో ప్రతిస్థలమునకు తగిన ఫరుషులు పరవబడి మసలందులు వేసి యుంచబడి యుండెను, పాందాన్ అత్తరుదాన్ పన్నీరు బుడ్లు పీకుదాన్ పుష్ప ఘుతబుకులు మొదలైన విక్రమము చొప్పున నుంచబడియుండెను గూళ్లలో కమలా నారంజి మొదలైన ఫలములున్ను తరహా తరహా రంగులుగల శీసాలున్ను ఉంచబడియుండెను, వొకవైపు అభ్రకపు తడకలలో నుంచి దీపపు కాంతి ప్రకాశిస్తూ నుండెను, మరియొకవైపు కమలా సరువు మొదలైన చెట్లు తరహాగా దీపములు వెలుగుతూ నుండెను అన్ని హాలలో నున్న బంగారపు సెమ్మెలతో కర్పూరపు దీపము లుంచబడియుండెను మరిన్ని రత్న స్థగితమైన పేడ్లు ఆయా స్థలములలో యుక్తముగా నుంచబడియుండెను

(౧౫) లాహౌల నే మంత్రము అసహ్య సదార్థము నుచూచినప్పుడు చదవడము.

అందరుమనుష్యులు వారివారి హోదాలలో సిద్ధపడియుండిరి, వంటయింటిలోదే
శాలుకణకణమ్రోగుతూనుండెను, చలివేంద్రమున్ను అందుకుతగినట్టు సిద్ధపరి
చియుండెను కొత్తకొత్తనీళ్ళచట్లు తడిగుడ్డలుచుట్టిమూతలతో వెండిగడమంచా
లమీదనుంచబడియుండెను, ఆయెదట బల్లలమీద డోకులున్ను గిన్నెలున్ను మంచు
ఆఫుకోతాలతోతగిలించబడి సీదిమూతకంద ఆస్తరణముకలదై యుండెను సురా
కారఫుకీళ్లలోసీసాలుంచబడియుండెను తుదకుపాదుషాసంబంధమైన వస్తు సా
మాగ్రిలుసిద్ధమైయుండెను వేశ్యలు భత్రాజులు భాగవతులు సంగీత పాఠకు
లుమొదలైనవారుమంచిమంచివస్త్రాబులుతొడుగుకొని వాద్యపుసజ్జులతోతమత
మకంఠస్వరములు సరిచూచుకొనివినికిచేయుచుండిరి అప్పుడీఫకీరు ఆయననుతీసు
కొనివెళ్లినుసలందుమీదకూచుండబెట్టి ఓభగవంతుడా ఇంతశీఘ్రకాలములో
ఇదియావత్తు ఏలాగుసిద్ధమైనదని ఆశ్చర్యపడుతూ ఆసౌందర్యవతియొక్కజాడ
యొక్కడాకనపడనందున వెతుకుతూవంటయింటివైపునవెళ్లగా చంద్రుడలంకా
రములేనప్పటికీ ఏలాగుసంతోషకరుడుగా యగపడునో ఆలాగుననే భగవంతు
డుసుందరముసిచ్చినవారికినగలు [illegible] లోనేమిన్ని ఉండదన్న శాస్త్రముగా
నేవాంటికిబొబ్బా కాలికిజోడు తలమీదతెల్లగుడ్డల ముసుకుమాత్రమువేసు
కొని అలంకారములేమిధరించకుండాసాదాగాచేసినపెండ్లికూతురివలెకూచుండి
నిభోజనపదార్థములలో ప్రతిదానికిరుచిగానుండవలెను, ఉప్పున్ను నీళ్లున్ను
సరిగావేయవలెనుపరిమళముకలిగియుండవలెననియాజ్ఞాపించుచుండెను ఈఆయా
సముచేతగులాబిపుష్పమువంటి శరీరము చిరిచెమటపట్టియుండెను, అప్పుడునేను
దగ్గరకువెళ్లిప్రదక్షిణముచేసియాజాగ్రతబుద్ధికిమెచ్చుకొని స్తోత్రము సేయడాన
కుపక్రమించితిని ఆమాటలవిని కనుబొమలుముడివేసిమనుష్యునివల్ల దేవతలకు
సాధ్యముకానిపనులవుతున్నది, నేనుయిట్టిపనుల నేనేమిజరిగించినానని నీవు యా
శ్చర్యపడెతివి అట్టిమాటలుపేచిరి యిచ్చకాలాడినందువల్ల నాకుసంతోషము
కలగదు విందుకువచ్చినపెద్దమనుష్యునివొంటరిగాకూచుండబెట్టి తిరుగుతున్నా
వునీవు యెటువంటివాడవు నీవుత్వరగావెళ్లిమతన్నుపరామర్శపుచ్చుకొనియతె
నిప్రియురాలినికూడాపిలిపించి అతనివద్దకూచుండబెట్టుమనిచెప్పినందున నేను
అతనివద్దికివెళ్లిమాటలాడుచుంటిని ఇంతలోనమంచి సౌందర్యవతులైన ఇద్దరుగు
లాములు సీసాలున్ను రత్నఖచితమైనగిన్నెపట్టుకొనియెదటికివచ్చి ఆసవపానము
చేయించడమునకుపక్రమించినారు ఆసమయమందు యతనితో నేనుతమకన్నివి
ధములనున్ను స్నేహితుడై సేవకుడైయున్నాను తమయంతఃకరణ ఎవరియందు

లగ్నమైయున్నదో వారినికూడాయిక్కడికపిలిపించడము గొప్ప కార్యమైయున్నది
సెలవైతే పిలవడమునకుమనుష్యుని పంపిస్తానసగానే ఆయనసంతోషించి మీరు
నాకునన్నులోవున్నకోరిక నెరవేర్చితిరనిచెప్పినందున నేను వొక (౧౬) ఖోజ్జాను
పంపిస్తేఆదెయ్యమువొక అందలములో సవారీ అయిఅర్ధరాత్రివేళ అవశా
త్తుగా సంభవించిన ఆపదవలెప్రవేశించినది, ఈఫకీరు అతిధిని సంతోషపెట్టేని
మిత్తమువిధిలేక ఆమెకుఎదురుగావెళ్లిమిక్కిలిస్నేహముతోతీసుకొనివచ్చియతని
కిసమముగాకూర్చుండబెట్టినాను అతడుదాన్నిచూడగానే యీప్రపంచములో
నున్నపదార్ధములయావత్తున్ను తనకుదొరికినట్లు సంతోషించెనుఆభూతముగం
ధర్వునివంటిజవానుతో కంఠాలింగనముచేసుకొన్నందున పున్నమనాటిచంద్రు
నికగ్రహణముపట్టినట్లుయగుపడ్డది, అప్పుడుసభలోనున్న మనుష్యులందరు ఈచి
న్నవానికేమిఆపదసంభవించినదని ఆశ్చర్యపడుతూనుండిరి యింతలోనొకమను
ష్యుడువొకవైపునుంచి ఓస్నేహితులారా మోహమునకున్ను బుద్ధికిన్ని సంబం
ధముకలిగియుండదనిన్ని బుద్ధికి హేయమైనపనికిమాలినమోహముచేయించికన
పరుస్తున్నదనిన్ని (౧౭) లేయిల్ అనే స్త్రీనిమజనూఅనేపురుషునినేత్రములతోచూ
డుమన్నందున అందరుఇదె వాస్తవమన్నారుపిమ్మట ఆజవాను తనతోనన్నుభో
జనము, పానముచేయవలసినదనిమిక్కిలి ప్రార్ధించగాప్రియురాలియొక్క
భయముచేత నానునన్ను ఎంతమాత్రము అంగీకరించినదికాదు, ఈవిధముగా
మూడురాత్రిపగళ్లుగడిచినవి, నాలుగోరాత్రి ఆయననన్నుపిలిచి యికమేము
న్నుసెలవుపుచ్చుకోవలసియున్నది,మీనిమిత్తము మాపనిపాటలువదులుకొనిమూ
డురోజులనుంచి మీసన్నిధికనిపెట్టియున్నాను ఇకమీరు వొకనిమిషముమావద్ద
కూచుండిమామనస్సు సంతోషపెట్టవలసినదని మిక్కిలియుత్సాహముతో అ
న్నందున ఈయనమాట నేనుచెల్లించకపోయినపక్షమందు ఈయనమనస్సు చిన్న
పోతుందని అతిధి అభ్యాగతులయొక్కపరామర్శచేయడముముఖ్యమయినప
నిగా ఆలోచించి ..రనిమర్యాదచేయడముకన్న వారియాజ్ఞనున్నించడమేవిశే
షమనిచెప్పగానే నాచేతికఆసవముగిన్నె అందిచ్చినందున నేనుపుచ్చుకొన్నాను
తరువాత అసభికులందరునిషాచేత ఒళ్లుతెలియకుండానుండేటంత వేగముగా
గిన్నెమీదగిన్నె యివ్వడమునకుఆరంభించినారు నేనున్నుమతిలేనివానివలెపడిపో
తిని తెల్లవారి రెండుబారలప్రొద్దెక్కినతరువాతకండ్లువిచ్చిచూస్తేఆసామానులు

---

(౧౬) ఖోజ్జాలనగా షండపురుషులై పెనక నపుంసకులై స్త్రీలకు పరిచారకులు.
(౧౭) లేయిల్ అనేస్త్రీనిమజనూఅనేఫకీరు మోహించినాడు.

ఆసభ ఆగంధర్వస్త్రీలేక పట్టిసావేలిమాత్రముండెను వొకమూల ఆజవాను
యొక్కనున్ను అతనితోత్తుయొక్కనున్ను తెగగొట్టినరెండుతలలుకంబళీ
లోచుట్టిన్నంచబడియుండెను ఈస్థితి చూస్తున్నే నాపంచప్రాణములు ఎగిరిపో
యెను ఈలాగునయెందుకైనదో గ్రహించడముబుద్ధికి సాధ్యముకాక ఆశ్చర్య
పడుతూవుండగా ఇంతలోఆవిందుపనిపాటలలో తిరుగతుండె పెద్దఖోజ్జాకనప
డందున ఈఫకీరుకు మనస్సుస్థిమితపడ్డదియీజరిగినస్థితియేమనియడిగితె ఇది తెలు
సుకున్నందుననీకేమిలాభము కలుగునన్నాడు, అందుకు నేనున్ను అతనుచెప్పినమా
టనిజమని మనస్సాలోచించి పోనియ్యి అదికాకపోతేపోయెను ఆప్రియురాలు
యేస్థలమందున్నదో అదైనా కనపరచవలసినదనియంటే, ముఖ్యముగానేను ఎరి
గినమట్టుకుచెప్పెదనుగాని మీవంటిబుద్ధిమంతులు ఏలినవారితాత్పర్యమునకువ్యతి
రేకముగా రెండురోజులస్నేహమునకులోనై నిరాంతకముగానున్నసభయ
ముగానున్న వారులతోకలిసి ఆసవపానముసేయుడమువుంచిదా అనిసున్న అ
డిగినాడు, అందుమీద ఈఫకీరు తనతప్పితమున్ను అతనుచేసినభోధనన్ను తెలిసి
యూపిరిలేకుండానుండడమేగాక వాస్తవముగా నేనుచేసినాను క్షమించవల
సినదనేమాట తప్ప రెండోమాట నానోటివెంబడె వెళ్లకుండాయుండెను ఏలాగై
తేనేమి ఆఖోజ్జాఅను గ్రహించి ఆగంధర్వస్త్రీయొక్క ఇంటిఆనవాలుకనపర
చినాడు సెలవిచ్చితాను ఆచనిపోయినయిద్దరినిభూస్థాపితముచేసేప్రయత్నములో
నుండెను, నేను ఆకుత్రసంగతిలోఇలాకానున్నట్టునిందనుపొందకుండాదైవాను
గ్రహముచేతవేదైనందునసంతోషించి ఆగంధర్వస్త్రీనికలుసుకోవాలనే కోరికచే
తతొందరపడివెతుకుతూ సాయంకాలమునకి జాడలమీదవీధిలో గుమ్మముదగ్గర
వొకమూలరాత్రియావత్తువిరహవేదనచేతసుంటినినన్ను ఎవరుఏమనియడగలేదు
ఇంతలోతెల్లవారి సూర్యోదయముకాగానే ఆచంద్రవదనమేడమీదనుంచికిటికీగుం
డా నావైపుచూడడమునకుపక్రమించినది; అప్పుడునాకుకలిగినసంతోషము నా
మనస్సుకే తెలుసునుగాని వివరముచెప్పచాలను, ఇంతలోవక ఖోజ్జా నావద్దికివచ్చి
(౧౮) యీమసీదులోమీరుకూచుండండి, ఇక్కడనేభగవంతుడుమీకోరికెలభిం
పచేసుననగా నేనాప్రకారముజరిగించినానుగాని ఆమ యపరహాఅవతలయేమి
జరుగునో తెలుసుకోవడమునకు ఆగుమ్మమువైపునచూచుచుంటిని, ఉపవాస
ముచేసినమనుష్యుడు భోజననిమిత్తమేలాగు నపేక్షించియుండునో ఆలాగునే నేను
న్ను పగలంతా స్థిమితములేకుండాజరిపినాను, ఏలాగైతేనేమికొండవంటిపగటి

(౧౮) మసీదుఅనగా తురకలలో దేవతాప్రార్థనచేసేస్థలము.

యొక్క భారమునాగుండెలమీదనుంచిదిగిపోయినది, సాయంకాలమప్పుడు పూ
ర్వమాగంధర్వస్త్రీఇంటి ఆనవాలుచెప్పినటువంటిన్ని యావత్తు వృత్తాంతములు
తెలిసినటువంటి పెద్దఖోజ్జానావద్దికివచ్చి సాయంకాలపుకైవ ప్రార్థన చేసు
కొనినాయందుఅనుగ్రహించి నాచెయ్యిపట్టుకొని కూడాతీసుకొనివెళ్లి తోకచి
న్నతోటలోనన్నుకూచుండబెట్టిమీకోర్కె ఫలించేమట్టుకు ఇక్కడనుండుమని
నాస్థిని ఆమెకొఱకుపగచడమునకు వెళ్లినాడు నేను ఆతోటలో నున్న పుష్పముల
యొక్కసౌందర్యమున్ను వెన్నెలయొక్క సొగసున్ను శ్రావణభాద్రపద
మాసములలో వర్షిస్తున్నవిధముగానే యెగురుతూఉన్న వాత్ఖానాలయొక్క
కాలువలవిచిత్రములను చూచుచుండగా పువ్వులుచూచినప్పుడు ఆగంధర్వస్త్రీ
యొక్క శరీరమున్ను చంద్రునిచూచినప్పుడు ఆబిడముఖవిలాసమున్ను జ్ఞాపకము
వచ్చుచుండేను, అప్పుడు ఆమెనావద్దలేకపోవడముచేత ఈవిలాసము యావ
త్తుకండ్లలో ముండ్లుగుచ్చుకున్నట్టుండేను, ఇంతలో భగవదనుగ్రహముచేతఆగం
ధర్వస్త్రీకి నాయందుకనికరముపుట్టి మేఘపురంగువంటి గోటువేసికుట్టినముత్యా
లజాలరుతగిలించిన అంగతొడుగుకొని అంచులయందును చెంగులయందును చ
మత్కారమైన జల్తారుకిసీదాపనియున్న యొకముసుకువేసుకొని ఆపాదమస్తక
మువరకుముత్యములచేత స్థాపింపబడి పున్నమనాటి చంద్రునివలె శృంగారించు
కొని ఆపువ్వులతోటయొక్క మార్గములో నిలువబడియుండినది ఆమెరావడము
చేత ఆతోటకున్ను ఈఫకీరుయొక్కమనస్సుకున్ను తిరిగివికాసముపుట్టెను అప్పుడ
డప్పుడు ఆబిడయిటుఅటుకొంతసేపు విహరించి మహలులోజలతారుమసలందు
మైనిబాలీసునాను కొనికూర్చుండేను, నేనుపరుగెత్తిఆమె వద్దకిపోయిదీపముచుట్టు
తిరిగేవట్ల చిలకవలెను ప్రదక్షిణముచేసి, చేతులుజోడించుకొని యెదుటనిలిచితిని
ఇంతలో ఆఖోజ్జానావిషయము మైసిఫారసుగామనవిచేయడమునకు నుపక్రమించి
నంతలోనేనతనితో అపరాధని నాకుతగినశిక్ష చేయవలసినదంటే, ఆగంధర్వ
స్త్రీఅయిష్టముగా నూరుసంచుల మొహరీలు ఇతనికిచ్చితనసామాను బాగుచే
సుకొనితిరిగికాపురస్థలమునకువెళ్లిపొయ్యేలాగు సేయడమే ఇతనికిశిక్షయనికోపము
తోఅన్నందున ఆమాటవినగానే కట్టెలాగునయిండిపోయిని, అప్పుడునిజముగామె
వరైనానాశరీరముకోస్తేరక్తముచుక్కయినా బయలువెళ్లదు, ఈప్రపంచమునా
కండ్లకుచీకటిగాకనబడ్డది, నిరాశచేత,గుండెలలోనుంచితెనంతటనేయొకఆహాకా
రముపుట్టినది, కండ్లువెంటనీళ్లుకారడమునకుఆరంభించినవి, భగవంతునికన్నఅప్పు
డువేరె ప్రాపకమేమిన్నిలేకుండానుండేను, నేనుబొత్తిగానిరాశనుపొందిఆమెను

చ్చూచిచిత్తమునన్నులోకొంచెమాలోచించండి వొకవేళనీదురదృష్టవంతుడు మీ
కున్నీప్రపంచమును ఎక్కువగాతలచియున్నట్టయితే తన అర్థప్రాణములు స
మ్ముఖమందే వినియోగపరచకపోవును, నాతో తమరు ఇంత అనాదరణగా సె
లవివ్వడము నేనుచేసిన సేవకున్ను మీవిషయమై యిచ్చిన ప్రాణమునకున్ను ఫల
మ్ము ప్రపంచములోనుంచియెగిరిపొయ్యేటంత కఠినముగా సెలవిస్తూ ఉన్నారు మం
చిది ఇప్పుడు నాకు బ్రతుకుతో కార్యము లేదనిన్ని ప్రియురాలియొక్క విశ్వాసలో
పముచేత సగప్రాణముతో నున్న ప్రియులు నిభాయించలేరని అన్నాను. ఆమా
టవింటున్నే కోపగించి కనుబొమలు ముడివేసి వహ్వా బాగానున్నది మీరుమా
కు ప్రియులై నారాకప్పకున్ను శైత్యము చేసినట్టున్నది. ఓబుద్ధితక్కువవాడా నీస్థితి
కిమించి నమాటలాడడము మంచిదికాదు, పిట్టకొంచెము కూతఘనము చాలుచాలు
ను ఇటువంటి హద్దుతప్పిన ప్రసంగము చేయవద్దు మరియెవరైనా నీలాగున నిరర్థ
కమైన మాటలాడినట్టయితే నానియొంటిమాంసము కోయించి గద్దలకు వేయిం
తును అయితే నీవుచేసిన సేవ మాకు జ్ఞాపకమున్నదని ఆగంధర్వస్త్రీ అనడమే కా
కుండా నీయొక్క అనాథకబుద్ధానుబంధము ఇంతమట్టుకే మా సర్కారులో
నున్నది, ముందు నీవారి చూసుకోవడమే మంచిదని చెప్పినందున నేనుయేడుస్తూ
నాయొక్క కోరికె చేకూడదని అడవులలోను కొండలమీదను తల బుట్టి బద్దలుగా
కొట్టుకొంటూ తిరుగుతానని నాలలాటలిఖితమైయున్న ప్రకారము నడవకవి
ధిలేదనియన్నాను. ఈమాట అన్నపైనికూడా ఆగ్రహపటి నాకు ఈవుసలా
యింపులుకందువమాటలు ఎన్నిక లోకరావు ఈలాటిసంభాషణము తగినవారి
తో చేయవచ్చునని తిరిగి ఆకోపముతోనే తనఐశ్వర్యగృహమునకు వెళ్లిపోయెను
నేను అనేకవిధములుగా మొఱబెట్టుకొన్నాను కాని ఆమె ఇటుతిరిగి చూడలేదు విధి
లేక కేవలము నిరాశనుపొంది అక్కడనుంచి బైలుదేరి నలుబది దినములపర్యంత
ముచాకలివానికున్ను రేవుకున్ను ఇంటికెన్ని తిరిగిన సామితగా పగలు భోజనము
న్ను రాత్రినిద్ర లేక వెర్రియెత్తి పట్టణములోనుంచి అడివికి అక్కడినుంచి పూరికి తి
రుగుతూనుంటిని, మనుష్యునికి అన్న గతప్రాణమై సందున శక్తిహీనమై బొత్తి
గా జవసత్వములు లేక తిరిగి ఆమసీదుగోడదగ్గరకే వెళ్లి పరుండియున్నందున వొక
రోజున శుక్రవారపు దైవప్రార్థననిమిత్తము ఆఖోజ్జా వెళ్లుతూవుండగా నేను
మెల్లిగా ఓభగవంతుడా నాకు మరణముగాని లేక దుఃఖోపశమనముగాని యీ
రెంటిలో యొకటి యీశ్వరగా జరిగించవలసినదని యర్థముగల యొక శ్లోకము నేను చ
దవడము వినినన్ను చూడగా నారూపము బొత్తిగా బదలాయించి మునుపు చూసి

సమనుష్యుఁడీతఁడేయని పోల్చుడమునకు శక్యముకాకుండా ముఖవర్చస్సుతేజస్వియై యు
న్నందున అతఁడు నాధ్వనిని మాత్రము పట్టిగ్రహించినాఁడై తిరిగి బాగా చూసె వి
చారించి తుదకు నీవని ఈమట్లుకు వచ్చినదా అని అన్నాఁడు నేనతనితో సొమ్మున్న
ప్రాణమున్న విడచినాను వారి సంతోషము ఈలాగై యుండే ఏమిచేస్తామనిజ
వాబు చెప్పినాను అదివింటున్నే వాక పరిచారకుని నావద్దనుంచి మసీదులోకి వెళ్లి దై
వప్రార్థన చేసుకొని తిరిగివచ్చి ఈఫకీరును వాక మేనా సవారిలో పడవేసి
యెవ్వారి లక్ష్యమున్న లేని ఆగంధర్వ స్త్రీ సముఖమునకు తీసుకొని వెళ్లి చూపుచాపల
అవతలకు గ్గుండబెట్టినాఁడు నేను ప్రాణావశిష్టుఁడనై యున్నప్పటికిని చాలాకాల
ము రాత్రి పగళ్లు ఆమె సన్నిధిని ఉన్నవాఁడ్ని అయినందున నన్ను తెలుసుకొనిన్ని
ఎరగనట్టు ఆఖోజ్జాతో ఇతను ఎవరని అడిగినది, ఆఖోజ్జా యీమనుష్యుఁడు ఏలినవా
రిఆగ్రహమునకు పాత్రుఁడై యెవఁడున్నాఁడో వాఁడనిన్ని ఆ హేతువు చేతనే ఇతనికి
ఇటువంటి విరూపము సంప్రాప్తమైనదనిన్ని విరహాగ్ని చేత దహింపబడుతూ మా
టిమాటికి కన్నీళ్లతో తడిపి చల్లారుస్తున్నాఁడుగాని అంతకంతకు అది రెట్టిస్తున్న
దేమిన్ని విని గోగించకున్నందున విశేషించి తాను చేసిన తప్పితమునకు సిగ్గు చేత జీ
వితాశను విడిచియున్నాఁడనిన్ని అంటే అబద్ధము చెప్పుతావేమి చాలారోజులకుము
నుపే అతఁడు స్వస్థలమునకు ప్రవేశించినట్టు విన్నాను యితఁడెవరు నీవు యెవరి సంగతి
చెప్పుచున్నావని వెక్కిరింతగా ఆగంధర్వ స్త్రీ అన్నది, అప్పుడా ఖోజ్జా చేతులు
జోడించుకొని ప్రాణసంరక్షణము చేస్తామని అన్నపక్షమందు వాక మనవి చేస్తానని
అంటే అందుకు అంగీకరించినందున తమయొక్క జన్మను ఎదటివారి మంచి చెడ్డలను
గ్రహించెదనిన్ని భగవంతుని నిమిత్తము ఇతని యందు కనికరించి మధ్యనున్న చూ
పుచాపయెత్తించి తగ్గించినంతలో విశదమవుతున్నదనిన్ని వ్యర్థముగా వాకరికి
శ్రమయివ్వడము మంచిది కాదనిన్ని ఇతని యందు దయచేయడము మిక్కిలి పుణ్య
మనిన్ని ఈ పైని మరి నేమిన్ని నేను చెప్పతగినది లేదు గనక తమచిత్తము ఇతని భా
గ్యమని అన్నాఁడు. అందుపైని ఆమె మందహాసము చేసి ఎవరైతేనేమి వైద్యశాల
లో నుంపించు ఆరోగ్యమును పొందిన తరువాత నితని సంగతి కనుకొందామని అంటె
ఆఖోజ్జా తనరు ఇతని పైని పన్నీరు చల్లి యేమైనా ఆజ్ఞాపించిన పక్షమునకు బ్రతికే
ట్టు కనపడతాఁడనిన్ని నిరాశత్వము పనికిమాలిన వస్తువనిన్ని ప్రపంచము ఆశ చేత
నే నిలచియున్నదని అన్నప్పటికిన్ని ఆమె యేమిన్ని అనక ఊరకుండనందున ఈ ప్రశ్నో
త్తరములు నేను వినియుప్పుడు ఈలాగు జీవించడమునకు నామనసొప్పదు, కాటికి
కాళ్లు చాచుకొని యున్నాను, ఇందుకు చేయవలసిన సాధనము ఆమె చేతిలోనున్న

నాను నాకు జ్ఞానము రాగానే సౌందర్యముగల స్త్రీలయందు నాకు తాత్పర్యము పుట్టినందున గంధర్వ స్త్రీలవంటి పరిశుభ్రములయిన రాచకొమార్తైలనున్ను ఘంమంచి బాగైనటువంటి దాసీలనున్ను చెలికత్తైలనున్ను సమ్ముఖమందుంచి సందునవారి వల్ల నృత్య గీతవాద్యముల యొక్క చమత్కారము నెల్లప్పుడు వింటూ ప్రపంచముతో అక్కర లేకుండా నిర్విచారస్థితి కలుగ చేసుకుని భగవంతుని ప్రార్థింస్తూనుంటిని, ఇంతలో అకాస్తుగా నా దేహతత్వము బిగడాయించి యెవరియందు ఉత్సాహము లేకుండా విరక్తి పుట్టి యేమిన్ని తోచక యెవరిని చూచి మాటలాడడమునకు సహ్యముగాక వెట్టిదాని వలె వున్న నాస్థితిని జూచినన్ను ఆడించి పాడించి వుగ్గు బెట్టి రక్షించిన దాసీలు యావత్తున్ను చారగ్రస్తులై యుండగా నా గట్టు గుణములు యావత్తు తెలిసినటువంటి యీ పెద్దఖోజ్జా అప్పుడు నా ఆయాసను చూచి తమరు కొంచం మత్తు చేసే పానకము అనగా (౨౧) భంగు సేవించిన యెడల దేహము యెప్పటి లాగు ఖులాసాగా వుండును అనగా, నేనంగీకరించి తెప్పించుమన్నాను అప్పుడే ఆ ఖోజ్జా పైకి వెళ్లి కూజాలో పానకము అనుకూలముగా తయారు చేసి మంచులోనుంచి తొలుక చిన్నవాని చేత పట్టించుకొని వచ్చినందున నేను పుచ్చుకొన్నాను, అందువల్ల గుణమున్నందున మంచి వెలగల బట్టలు దుస్తు వానికి బహుమతి చేసి ప్రతిరోజున్ను తప్పకుండా నొక కూజా పంపించవలసినదని యాజ్ఞాపించినాను ఆలాగననే జరిగిస్తూ వచ్చినాడు అనిపానాకు యెక్కువ కొద్ది ఆ చిన్నవానితో హాస్యము, పరియాచకము లాడుతూ ఉంటిని, యీ చిన్నవాడు అంతకంతకు ధైర్యపడి వింతవింతగాముచ్చటలు చెప్పడమున్ను ఆశ్చర్యపడడమున్ను యెక్కువ యేడవడమునకు ఆరంభించినాడు వాడు నాకు తగిన రూపవంతుడై యున్నందున ప్రతిరోజున వానికి యినాములు యిస్తూ వున్నప్పటికిన్ని ఆ పనికి మాలినవాడు పాతబట్టలే తొడుగుకొని వస్తూవుండెను, అందుకు కారణమేమని యడిగితే కండ్లవెంట నీళ్లు తెచ్చుకొని తాము దయచేసిన బహుమతీలలో నొకటైనా నాకివ్వక అయ్యవారు పుచ్చుకొంటూవున్నాడు నేను యెక్కడనుంచి వేరే బట్టలు తెచ్చుకొందునని చెప్పగా నాకు కనికరము పుట్టి పెద్దఖోజ్జాతో ఈ రోజునుంచి యీ చిన్నవాణ్ని నీ యొద్ద నుంచుకొని మంచి బట్టలు తొడిగి చిన్నవాండ్లతో తిరగకుండా మా సముఖానకు రాతగిన మర్యాదలు నేర్పి హాజరుగా నుండేలాగు చేయవలసినదని యాజ్ఞాపించినాను, నా తాత్పర్యము తెలుసుకొని ఆ ఖోజ్జా అతని పరామర్శ బాగా పుచ్చుకొన్నందున కొన్ని దినములలోనే వానికి సౌఖ్య భోజనము చేత పాము పొర విడిచినట్టు మను పటి రంగు

(౨౧) ఉత్తర దేశస్థులు మత్తుకు గాను భంగు పుచ్చుకోవడము మామూలై యున్నది.

పోలు ప్రశస్తమైన రెండోరంగు వచ్చినది, నామనస్సును వాడిపై ప్రతిరగకుండా
చాలానిలుప పట్టినాను గాని ఆదుర్మార్గునియొక్క ముఖవిలాసము వొకనిమిష
మైనను నాకండ్లయెదుటనుంచి వెళ్లకుండా నాసన్నిధిని ప్రవేశపెట్టి తరహా బట్టలు
న్ని చిత్రవిచిత్రములైన నగలున్ను ముస్తాబుచేయించి చూస్తూ నుంటిని. వాడు
నానేత్రములకు సుఖముగానున్ను అంతఃకరణమునకు చల్లదనముగానున్ను ఉ
న్నందున యెల్లప్పుడు వానిపరామర్శ పుచ్చుకొంటూ వాడు యేదైనా జరూ
రుపనిమీద నాయెదుటనుంచి వెళ్లితే స్థిమితములేకుండా నుండేటంత స్థితి నాకుసం
ప్రాప్తమయియుండెను, తరువాతకొన్ని సంవత్సరములకు యీడువచ్చి నూగు
నూగు మీసము రావడమున కుపక్రమించి తయ్యారైనందున పారాసిపాయీలు
మొదలయినవారు (౨౨) అంతఃపురానకు రాకుండా ఆటంకపరచినందున వాణ్ని
యెడబాయడమువల్ల మిన్ను విరిగిమీదపడ్డట్టు నుండడమేగాక వానిచూడని వేదన
తోకుందినాయొక్క మర్మమెరిగిన పెద్దఖోజాను పిలుపించి ఆచిన్నవానియొక్క
శ్రేయాభివృద్ధి నాకు కావలసియున్నది గనక ప్రస్తుతము వెయ్యి మొహరుల మట్టు
కు వానికిచ్చి నడిబజారులో రత్నపునగలదుకాణము వేయించినయెడల వ్యవహార
ము చేసుకొని అందువలన [illegible] కాలక్షేపము చేస్తూనుండేలాగున
నున్ను యిక్కడికి సమీపముగా మంచి మోస్తరుగల వొక హవేలి కట్టించి కావలసిన
దాసీలు, గులాములు, నౌకరులు, చాకరులు మొదలయినవారిని వుంచి వారికి జీత
ములు నిష్కర్షయించి వానికి యేవిధమయిన శ్రమలులేకుండా జాగ్రతపెట్టించ
వలసినదని యాజ్ఞాపించినందున ఆపెద్దఖోజ్జా ఆప్రకారము జరిగించెను కొద్ది
కాలములోనే ఆదుకాణము పాదుషాహజాదలైనవారికి కావలసిన ప్రశస్తమయి
న బట్టలున్ను వెలగల నగలున్ను సమస్తదేశములయొక్క వింతవస్తువులున్ను దొరు
కునని పేరున్ను యేదేశములలోనున్ను వానికి సమానముగా మరియెవరున్ను
లేకుండా లక్షలకొలది ధనము సంపాదించినాడు, వాణ్ణిచూచి మనస్సును సమా
ధానపరుచుకోవడమునకు యేమార్గము కనపడనందున నేను రోజుకురోజు నీర
సపడుతూవుంటిని, వొకరోజున ఆపెద్దఖోజ్జానుపిలిపించికొంచెము వానిముఖ
ము చూచి ప్రాణము నిలువపెట్టుకోవడమునకు యేరూపకమున్ను కనపడకనున్నం
దున నాహవేలిలోనుంచి యిక్కడికి వొక సొరంగము తొవ్వించవలసినదని ఆ
జ్ఞాపించగా కొన్నిరోజులలోనే సొరంగము తయారైనందున ఆపెద్దఖోజ్జా
దానిగుండా వెళ్లి వా[illegible]మంత్రము తీసుకొనివస్తూ వచ్చినందున రాత్రియా

(౨౨) అంతఃపురములోకి మొ[illegible]ండ్లనెవరిని తురకలు వెళ్లనివ్వరు.

వత్తువాసతో అన్యోన్యసంతోష భోగరాగములతో నుండెడి, శుక్రోదయము కాగానే దేవాలయములలో మేలుకొలుపులు పాడేటప్పుడు ఆఖోజ్జావాణ్ని వాడియింటికి ప్రవేశపెట్టేవాడు, యీసంగతి ఆఖోజ్జాకున్ను నాకున్ను పాలుబోసి పెంచినటువంటి యిద్దరుదాదులకున్ను తప్ప యితరులకు తెలియకుండా చాలాదినములు యీప్రకారము జరిగినది, వొకరోజున మామూలుప్రకారము ఆపెద్దఖోజ్జావెళ్లేవరకు ఆజవానువిచారగ్రస్తుడై చూస్తూ వూరికే వున్నందున యీరోజున క్షేమమా నీవున్ను వొకలాగున వున్నావేమి అనాయకిత్వరగా జ్ఞాపకము చేమన్నదంటే, వాడుజవాబుచెప్పక పూరకే వున్నందున ఆపెద్దఖోజ్జావెళ్లినట్టే తిరిగివచ్చి వాణ్ని స్థీనిమనివిచేసినాడు, నాకర్మమీలాగుననుండవలసియున్నందున వాడియందు స్నేహము తరగకుండానుండేను ఇటువంటి విశ్వాసఘాతకుని విషయమై మోహించడముతుదకు అపకీర్తిపాలుచేసెను పిసుహాసికిరుడని తెలిస్తేవాని పేర్లు యెత్తకుండానేయుండి ఆసిగ్గును తెలిసినవానికి మనస్సుయివ్వకనే పోదును, అయితేయీలాగుజరగవలసియున్నందున వానివిషయమై యేదిన్ని జరిగించక వాడురాకపోవడము ప్రియులు చేసే విలయములకు ముద్దుముచ్చెములుగా భావించి యీఫలమనుభవించినాను, ఈస్థితి కున్న తెలియనైనది, ఆజవాను అంతగర్వపడ్డప్పటికిన్ని ఆలోచించక వానికి ఖోజ్జావల్ల ఇప్పుడునీవురాకపోతే యేమాయోపాయముచేతనైనా అక్కడికివస్తాను ఆందువల్ల బహుఉపద్రవముసంభవించుననిన్ని యిదిబయలుపడితే నీకుమిక్కిలిచెడ్డననిన్ని నీవురాకపోతే అల్లరిచేయుడమునకన్న నీకుకలిగేఫలముయేమిన్ని లేదుగనుక త్వరగారావలసినదనిన్ని లేకుంటే నేనువచ్చినట్టుగ్రహించవలసినదనిన్ని వర్తమానముపంపించినందునవాడు నాసరదా బాగాతెలుసుకొని ముఖముమాడుచుకొని గుసుస్తూవచ్చి నావద్దకూచుండగా నేమారుమాట ఆడకుండా యెల్లప్పుడున్ను నిరాటంకముగావచ్చేవాడవుకదా యీరోజున అడ్డాలుచెప్పడమునకు కారణమేమని అడిగితే యీబిదవాడైన అనాథకు మేలినవారి కటాక్షముచేతను ఐశ్వర్యము యొక్క ఛాయవలయుంటేమట్టుకు సుఖముగాదినములు వెళ్లపుస్తూమీ అథఃప్రాణములయొక్క అభివృద్ధినికోరి యున్నాడనిన్ని యీతక్సీరు యేలినవారు మాఫుచేతురనే నమ్మకముచేత యీపాపాత్మునివల్లజరిగినదిగనుక క్షమించవలసినదాత్వ వాడుజవాబుచెప్పినందున వాణ్ని నేను మోహించియున్నందున్నందున కొన్నిదివొప్పుకొని వాడుచేసిన దుర్మార్గమునుదృష్టియుంచక వడచినట్టు మునుపటి రంగుడేకొరకు నీకుయిటువంటియాపద యేమిసంభ______

*మామూలులై యున్నవి.

సాధనముచేస్తాననిఅన్నాను, అందుకువాడు చేతులుజోడించుకొని సలాముచేసి యున్నగొప్పలోగలన్ని హౌత్కానాకొలనునూతులుగలిగియున్నటువంటిన్ని మి క్కిలిసుందరమైనటువంటిన్ని వొకతోటయున్ను సంగీతవిద్యయందు మిక్కిలి ప్రవీణతకలిగినటువంటివొక స్త్రీయున్ను లోటిపిటమెడలోకట్టనపిల్లవలెరెండున్ను కలిసిపట్టణమధ్యమందునాయింటికి సమీపముగాఅమ్మకమునకు వచ్చియున్నదని న్ని ఆతోటకొనేవారు ఆదాసికికూడా ఖరీదుయివ్వవలసినదనిన్ని తోటఖరీదులక్ష రూపాయలున్ను దాసియొక్క ఖరీదు అయిదులక్షలని చెప్పిరి ఆతోటకొనడాన కునాకుమిక్కిలికోరికెకలిగియున్నదిగాని ప్రస్తుతము అంతసొమ్ము జాగ్రతపె ట్టడానకు అవకాశములేనందుసమిక్కిలివిచారమునుపొందియున్నానని చెప్పడమే కాకనావెనుకనుచూచున్నప్పటికిని వానిముఖము వికవికలాడుతూమనస్సునవిచా రమునుపొందినందున ప్రసన్నముఖము వానియొక్కపరామర్శ నాకు యిష్టమైనం దున అప్పుడే పెద్దఖోజ్జానుపిలుపించి రేపుప్రొద్దున ఆదాసీతోకూడా ఆతోట ఖరీదుఫరిష్కరించుకొని సొమ్ముయిచ్చివ్రాయించిపుచ్చుకొని వీనికివ్వవలసినద నియాజ్ఞాపించగానే వాడుముఖానకుయెప్పటివలెతెలివితెచ్చుకొని నాకుసలా ముచేసియథాప్రకారము సంచరించినాడు, ఆప్రకారమే ఖోజ్జా ఆతోటకొని ఇచ్చినందునవాడు మామూలుప్రకారము వస్తూపోతూవుండెను, వసంతఋ తువులోనొకరోజున మేఘముకమ్మితుషారములురాలుతూ మెరుపులుమెరుస్తూ చల్ల గాలివేస్తూ మనోహరమైయున్నందున ఆనిమిషమందొకవింతగానున్న గూండ్ల లోనున్న బుడ్డలోతరహాతరహాగల ఆసవముకనపడ్డందున వొకగుక్కెడుపుచ్చు కోవలెనని మనస్సుకోరినది అంతలో రెండుమూడుగిన్నెల ఆసవపానము చె య్యగానే కొత్తగాఖరీదుచేసినతోటజ్ఞాపకమువచ్చి యిప్పుడే అక్కడికివెళ్లివిహ రింతామనిననునాదుష్టగ్రహచారముచాలకపోతే లోటిపిటలనెక్కినకుక్కకరుస్తు న్నదనేసామితగాచక్కగాకూచుండియుండక వొకదాసినికూడా తీసుకొని బిలముగుండాఆ[illegible] నుబసనువెళ్లిఅక్కడనుంచివనవిహారమునకు బయలుదేరినా ను, చూడగానేఅదిస్వర్గతుల్యముగాకనపడ్డది, వర్షబిందువులుచెట్లయొక్క పచ్చని ఆకులపైనిపడుతూ నుండడమువలన లక్ష్మీధరించిన పచ్చల పట్టెడలో మని [illegible]ల్లుదాపినట్లుండెను, మరిన్నివృక్షములయొక్క రక్తిమమేఘమండలములో జ్ఞాపించగా[illegible]లె ప్రకాశిస్తూనుండెను, వడ్లనిండాపారుతూన్న ప్రవాహ దానిగుండావెళ్లి వా[illegible]నపడుతూనుండెను అప్పుడాతోటలో సంచరిస్తూనుం

(౨౨) అంతఃపురములోకి మొ[illegible] శక్కి [illegible]లో ఆజవానువొకమార్గములోకనపడినం

దున చూస్తూ నేనిక్కడివినయముగానున్న స్నేహముగానున్న యెదురుగావ చ్చి నాచెయ్యి తనచేతిలోనుంచుకొని మేడపైకితీసుకొనివెళ్లినాడు, నేనక్క డికివెళ్లిచూస్తే ఆశృంగారము ఆవనముయొక్క యావద్విలాసమునుమరిచిపొయ్యే లాగునచేసినది మరిన్ని వాలు షేడ్లు, మగ్గిల షేడ్లు, గ్లోబులులస్థలుల్ల, తిరుగుడుది పములబుట్టలు మొదలైన తరహాతరహా కలిగినటువంటిదీపాలయొక్క సొగసువె న్నెలవెలుగుగాకనబడ్డది వొకవైపు నాకరపువ్వువత్తులు చిచ్చుబుడ్లు అవాయిగొట్ట ములు పువ్వువత్తులుసిసింద్రీలుచక్రాలు మహతాబులు వెన్నముద్దలు పటాకీలు తారాజువ్వలుమొదలయినబాణములు కాలుతూనున్నవి ఇంతలోచంద్రోదయ ములయినందున ఆజవానుతోటలో బాలాఖానామీద కూచుండామని అన్నా డు నేనుబుద్ధితక్కువదాన్ని అయినందున మఆడించినట్టుగా ఆడుతూనున్నాం దున్నైపైకితీసుకొనివెళ్లినాడు ఆమేడపట్టణముయావత్తుపుష్పాలచేనులాగు నగుబడే టంతయెత్తుగలదైయుండెను నేను వానిమీద చెయ్యివేసుకొని సంతోషముగా కూచుండియుండగానొక స్త్రీ ముక్కాలి కుర్చీపై అప్పుడే పొయిలోనుంచి తీసిన కొరివిలాటిదిసారాబుడ్డిచేతిలోనుంచుకొనివచ్చినది దాన్నిచూస్తూనే గాభరా పడియింతవిచిత్రమయినస్త్రీమెవ్వరు యెక్కడసంపాద్యమయినదని యడిగితే యీతోటతోకూడా యేలినవారు ఖరీదుచేయించిన దాసీయిదేనని చేతులు జోడించిమనవిచేసినాడు బహుసంతోషముగా ఖరీదుచేయించినందున దీన్నివీ డువలచియున్నట్టుగ్రహించి పశ్చాత్తాపాలనైన అస్వస్థ్యముకలిగియుండిన్ని అ ప్పుడా గుడిసేటునేవడ్డించేదాన్నిగా నిర్ణయించినందున తనసరక్తముతానుపానము చేసేటంతకోపముకలిగి కాకిన్నిరామచిలుకను వొకపంజరములోవేసిబిగించిన ట్టుఅక్కడఉంచినిప్పిమ్మటయెదిపానముసేయడముచేత మనుష్యులకు మృగత్వము సంభవిస్తున్నదో అటువంటిపొంగు సారాగిన్నెమీదగిన్నెనాలుగుగిన్నెలమట్టుకు ఆజవాముపుచ్చుకొనినన్నుబతిమాలితేనేనున్నుసగముగిన్నెవిషపానము చేసినట్టు చేసినానుతుదకు ఆదుమారుగుర్రాలుతాగినమత్తుతో మద్దుతప్పిప్రసంగించడము నకారంభించినదిభూమిదారిచ్చినపతకమందు అందుబ్బోనినిండియుండి యుందును వానితో నాకుకలిగియుండేస్నేహముచేతపల్లిదనూరకుంటిని ఈసంగతి[illegible]తై లుసుకొకమరి రెండుమూడుగిన్నెలుతాగినాడుయెదుటనే దాసితోనిర్భయముగా క్రీ డించడమునకునుపక్రమించినాడు అప్పుడు నాస్థితి అపస్వరమ్ముగా ఆపలేయు తోనున్న వినికిచేసే భోగము దానివలె యిక్కడికి వచ్చి చుకు తగినశిక్ష అ యినదిగదాయనిమనస్సులో విసుక్కొనియుండ్గా మా అక్కడనుంచివిచారము

తో వెళ్లిపోయినయెడల రేపటిదినము తనపనియేమవునోయని భయపడి పిల్లనైనా తే
దీనిపనియిప్పుడేకాచేతామని మనస్సునయోచించుకొని ఆదుర్మార్గుడు కూత
న్నిముత్తము నేనుఅక్కడనుండేకొరకు మెడకుబట్టచుట్టుకొనిపాగాతీసి నేనివాళ్ళ
మీదపడియేమమస్తూబతిమాలుతూ అనేకమాయోపాయములు చేసినాడు అందు
పైని నేనుబాంగరములాగుమెటుతిప్పితే అటుతిరుగుతున్నతిరగలివలెవానిదుస్సా
ధీనములోనుండి చెప్పినట్టల్లావింటూఉంటిని మొదటికోపముచేతనే వాళ్లుయుడికె
యుండగా రెండోటిసారాకూడాతాగడము తటస్థమైనందున బొత్తిగా నాశరీ
రస్మృతిలేకుండాఉండెను అప్పుడు నిర్దాక్షిణ్యము కలిగినటువంటిన్ని విశ్వాస
ఘాతకుడైనటువంటిన్ని రాతిగుండెగల ఆదుర్మార్గుడు పిరంగికత్తితో నాకుగా
యములుచేసి చచ్చిపోయినదనుకొనెను ఇంతలో నాకండ్లుకొంచెము విడ్డందు
న నేనుచేసినదేదో అదిఅనుభవించినాను నిర్హేతుకముగానన్ను చంపిననేరము
తప్పించుకోవలసినదన్ని యెవరితోనున్ను యీభేదము చెప్పవద్దన్ని తుదకునా
ప్రాణముకూడానీకేయిచ్చితినని చెప్పి నాణ్ని దేవునికియొప్పగించి నేనుస్మృతిలేక
పడియున్నందున ఆకసాయీవాడు నేనుచనిపోయినట్టు ఆలోచించి పెట్టెలో న
న్నుంచికోటవెలపటకు జారవిడిచెను దైవానుగ్రహముచేత నేను నీకుదొరికినం
దున నేనుజీవించడమునకు కారణమైనది నీమేలు నేనెన్నటికిన్ని మరువను నేను తెలి
యచేసినచిన్నవాడేయీ(సఫ్ సౌదాగరు) అతడుకొన్న స్త్రీయే) ఆదాసీ)వీరిద్దరు
నన్నుయీప్రకారముజరిగించి నవ్వుతూతుళ్లుతూ వున్నందున నేనుసహించలేక
విందనేమిషమీదనీద్వారా వాండ్లను పిలుపించిను మత్తుగాసారాతాగి యున్నసమ
యములో చంపించినాను నీపరముగాఅంతసొమ్ముయిచ్చిన (సిద్దీబహారే)మాఖ
జాన్సీనీవువిందునిమిత్తము చనిపోయినవాణ్ని పిలువగలందులకువెళ్లియున్నసమ
యములోనేనుమాళ్లివద్దికెళ్లి అదివరకుజరిగినస్థితియావత్తు తెలియ చేసినంత
లోనన్నుగర్భమందుకని పెంచినప్రేమచేతనా ప్రత్యామ్నాయముగా నాతప్పి
తములనుకడుపులో నిముడుచుకొని వాండ్లవిషయమై నాహక్కును తీర్చుకొనే
కొరకుఆదింపువర్గి రాసరఫరాకు సెలవుదయచేసినందున అంతశీఘ్రకాలము
లోసిద్దసడ్డదసిగ్గి నీవువాండ్లతోకలిసి ఆసవపానముచేసివాళ్లు తెలియక పడియుం
డడము చేతమాతోకూడాయిక్కడికినిన్ను తీసుకొనిరావడానకు ... డక పోవ
డమేకాకనీయందుఆగ్రహముపుట్టడానకు కారణమైనది అయితే నీవు జరిగించిన
నుపకృతి యెప్పటికిన్ని మరువశక్యమైనదికానందున నిన్ను మేముతిరిగి అనుగ్రహిం
చివివాహముచేసుకోవడమన్ను సహస చెప్పియుంకానీకు తెలియవలసినది యేమై

నాయున్నవాలనిఅన్నందునయీఫకీరు మిక్కిలీసంతోషించి ఆమెతో కలుసుకొ
న్నట్టులానాగాకాలక్షేపముచేస్తూనుంటిని ఆమెనీమాట నేనుయేలాగున విశ్వసిం
చినానోఆలాగుననే నామాటజరపవలసినదనిన్ని యీపట్టణములోని వసించి
యుండడముమంచిదికాదనిన్ని యీపై నినీయిష్టమని తెలియచేసియూరకేయున్న
యీఫకీరు ఆమెఆజ్ఞకుబద్ధుడై స్నేహము సేవలలోచిక్కియున్నందున తామునెల
విచ్చినప్రకారమనిన్ని ఈసేవకుడునిరాంతకముగాజరిగిస్తాడని మనవిచేసినందు
కు ఆమెతనఆజ్ఞను నేనుమన్నించేవాణ్నిగానున్ను సేవకుణ్నిగానున్ను బాగా తెలు
సుకొనిమ్ముంచిచురుకై యినటువంటిన్ని కార్యమందు ప్రాణము యివ్వతగినటువం
టిన్నిగానితో మాట్లాడుతూవెళ్లేటందుకు శీఘ్రగమనముగల రెండుగుఱ్ఱములు పాదు
షాయుక్క ఖానాతబేలాలోనుంచి తెప్పించి సిద్ధపరచియుంచవలసినదని నాతోచె
ప్పినందునమంచిశుభలక్షణములుగలగుఱ్ఱములను తెప్పించిహాజరు చేయించినా
ను కొంచెమురాత్రియుండగానే ఆమెపురుషవేషము వేసుకొని అయిదు ఆయు
ధములుధరియించి యొక గుఱ్ఱముపైని సవారయినది నేనున్ను ఆయుధ హస్తుడనై
రెండోగుఱ్ఱముమీద నెక్కికూచున్నాను బలబలతెల్లవారేసరికి ఒకతోటయొ
ద్దనప్రవేశించిగుఱ్ఱముదిగి దంతధావనాదికృత్యములుజరిగించి ఫలహారముచే
సితిరిగి బయలుదేరడమయినది అప్పుడు ఆమెనాతో ఏమేమోమాటలు ఆడుతూ
నేనునీకొరకు సిగ్గుబిడియము దేశము ధనములతల్లిదండ్రినివదలిపెట్టినాననిన్ని నీవు
న్నుఆవిశ్వాసహీనునివలె జరిగింపకుమని యంటూనుండేదినేను ఆఫాజీక్రమమ
యినబీజానకుపుట్టినవాడు కాడుగనుక అటువంటిపనిజరిగించను నాయర్ధప్రా
ణములనుమీపయినిదిగదుడిచిపారవేసినందునమీరునన్నుమన్నించినారనిన్ని నేనుతమ
కుష్టాష్టుయివ్వకుండాకొనియుంచిననౌకరునుగనుక నాచర్మముకోసి జోళ్లుకు
ట్టించితొడుగుకొన్నా నేనువద్దనిచెప్పననిఇటువంటిమాటలు ఆడుతూరాత్రిపగలు
ప్రయాణముచేయడమేపనిగానుండెను ఎప్పుడైనా బడలికముచేత దిగినడిచేటప్పు
డు అడివిలోన్ని గనులనున్ను పక్షులనున్ను వేటాడుచు వాటిని భక్షిస్తూనుంటిమి
అప్పటిలోగుఱ్ఱములనువదిలితే అవి కడుపునిండామేసితిరిగి వచ్చుచుండును వొక
గోజునవొకమైదానములో టెంటుస్థాపించినందున అక్కడ పూరిపేరున్ను మనిషిరూప
మున్ను లేకుండానుండెను అయితేచక్రవర్తికొమార్తెతో నేను కలిసియున్నందున
నాకుపగలుపండుగ రాత్రి దీపావళిఅయియుండెను ఆమైదానములో వెళ్లగా
వెళ్లగా ఆచిటచివరను మనుష్యులకుభయంకరమైనవొకసముద్రము మార్గములో
లోకనపడ్డదివొడ్డుకువెళ్లిచూస్తే దృష్టికిన్నీ ఆగినంత దూరము నీరేగానిమరిఏమీను

జాడకనడపలేదు అప్పుడు యీసముద్రము నేలాగు దాటుదమనినిలువబడి ఆతో
లియొడ్డుకు వెళ్లడమునకు సాధనము దొరికేమట్టుకు ఈమె ఇక్కడసుఖించ వచ్చునని
నిర్ణయించి ఆమెనక్కడ కూర్చుండబెట్టి నావలనిమిత్తము వెళ్లవలెనని ఆమెతో తెలి
యచేస్తే మంచిది నేను అలసటపొంది ఆకలిదప్పికతో నున్నానకొంచెమిక్కడ వి
శ్రమిస్తానన్నందున అక్కడయెండవానలయొక్క తక్కులేకుండా సుఖింపడ
మునకు తగినవొక పెద్ద రావిచెట్టు ఉన్నందున ఆమెను అక్కడ కూర్చుండబెట్టి భూ
మిమీదనయినా సముద్రములో నయినా మనుష్యులజాడ కనపడునేమో యని
నాలుగువైపుల వెతుకుతూనుంటిని అనేకవిధములుగా తలకొట్టుకున్నా యేమి
దొరకలేదు తుదకు నిరాశచేసుకొని అక్కడనుంచి తిరిగివస్తే ఆ చెట్టుమొదట ఆగం
ధర్వస్త్రీ కనపడలేదు అప్పటియవస్థ నేనేమిచెప్పుదును బొత్తిగా మారురూపై వె
ర్రివాడనైయొకప్పుడు చెట్టెక్కి కొమ్మకొమ్మకున్న ఆకు ఆకు తిరిగి చూచేవాణ్ణి
ఒకప్పుడు కాళ్లుచేతులువదలిపెట్టి భూమిమీద పడవేళ్లచుట్టూతిరుగుతూనుండేవా
ణ్ని మరియొకప్పుడు నోరుకొట్టుకొని యొంటరిగా నేడుస్తూపడమటనుంచి తూర్పు
కున్న ఉత్తరమునుంచి దక్షిణమునకున్న పరుగెత్తితిరుగుతూ ఇసుకనుగాలించి
చూచినప్పటికిని దొరకరాని ముత్యమునుయొక్క ఆనవాలు యెక్కడాకనపడనం
దున నేమీతోచక యేడుస్తూ బుగ్గినెత్తినచల్లుకొంటూ వెతుకుతూనుంటిని ఆగంధ
ర్వస్త్రీని నాగలోకవాసులు యెవరైనా తీసుకొని వెళ్లినారో లేక ఆమె దేశమునుంచి ఏ
వరైనా వెనకవచ్చి ఆమె యొంటరిగానుండడము కనుక్కొని బోధించి స్వదేశమున
కు తిరిగి తీసుకొని వెళ్లినారో అనిమనస్సున ఆలోచించి నేను ఉదయము మొదలు
కొని సాయంత్రమువరకు పరుగెత్తితిరుగుతూ రాత్రియెక్కడనైనా వుంటూ ప్ర
పంచముయావత్తూ చరించినాను గాని ఆమె పోబడి యెవరివల్లనున్ను వినలేదు ఆమె
యేలాగు మాయమైనదిన్ని తెలియదు ఇకయేమి బ్రతుకని ఆలోచించి యొకకొం
డమీదనెక్కి పడిచ పోవడమునకు నిశ్చయించుకొని పడుతూవుండగా నెవరో
వచ్చినాచెయ్యి పట్టుకొన్నారు యింతలో తెలివివచ్చిచూస్తే ఒకమనుష్యుడు
ఆకుపచ్చరంగుబట్టలు తొడుగుకొని యున్నాడు ముఖముపయిని తెరవేసియున్న
ది ఆయన నన్ను చూచి నీవెందుకు చావను ఆయత్తపడుతావనిన్ని యేదిన్ని భగవంతు
డు దయచేయడనుకోవడము మంచిది కాదనిన్ని ఆవిషయమై యూపిరి యున్నంత
మట్టుకు ఆశించేయుండవలసినదని యాజ్ఞాపించడమేకాకుండా కొన్నిరోజులలో
రూమ్‌దేశమందు ముగ్గురు ఫకీరులు నీవలె యాపదనుపొంది యిటువంటి చమ
త్కారమే చూస్తూ నీతోకలుసుకోనున్నారనిన్ని అక్కడపాదుషా (అజాద్

డుకు అన్నిటికి ఇది శ్రేష్ఠమైనదిఫరసీదేశభూభాగోత్పన్నము సంతోషకరమైనందు
న ఆస్థలజ్ఞులుసుందరులై మర్యాదలను గురుతెరిగినవారై యున్నారు మామంత్రి
గారు బాల్యమునుంచి రాజ్యపరిపాలనయొక్క పద్ధతులువారు అభ్యసించి
గలందులకు సమస్తవిద్యలున్ను శాస్త్రములున్ను తెలిసిన గొప్పపండితులను
రావించి ప్రోత్సాహింపచేసినందున దైవానుగ్రహముచేత పదునాలుగు సంవ
త్సరములవయస్సులోగానే సమస్తశాస్త్రములు గ్రహించి మృదుసంభాషణ
లున్ను యుక్తమైనమర్యాదలున్ను ఇంకా రాజులకు తగినటువంటిసంగతులను నే
ర్చుకొని రాత్రిపగలు పండితగోష్ఠిలోనే యుండి ప్రతిరాజ్యములయొక్క
చరిత్రలను రాజులయొక్క స్థితిన్ని వినవలెనంటే సరదా కలిగియుండెనని వొకరో
జునఅన్నిపూర్వోత్తరములు తెలిసినట్టువంటిన్ని బహుకాలప్రవర్తకుడై నటువం
టివొకబుద్ధిమంతుడైనవాడునాతో మనుష్యుడు చిరకాలము జీవించియుండడు వాని
సాగిగుణాతిశయమువల్లనే పేరు బ్రహ్మప్రళయపర్యంతము నిలుపుకుంటాడని
తెలియచేసినందున అట్టివాడువినిపిస్తేనేనున్ను ఆప్రకారమే నడుస్తానని అ
న్నాను అప్పుడుఆయన (౧) (హాతేమ్‌తాయీ, అనే ఆయనయొక్క వృత్తాంత
మువివరముగా చెప్పడమునకుప్రక్రమించెను హాతేందినములలో అరబ్బీదేశ
మునకు (నవ్షఫల్) అనే పేరుగలపాదుషా అధికారియైయుండెను ఆపాడుహాతేం
విశేషప్రతిష్ఠావంతుడైయున్నాడన్న హేతువుచేతవిరోధముపుట్టి విస్తారముగా
బలములుతీసుకొని యుద్ధానికిహాతెంపైకివచ్చెను హాతేంభగవద్భక్తుడున్ను పు
ణ్యాత్ముడున్నుఅయినందున నేనుయుద్ధసన్నద్ధుడనయితే ప్రజలుచెడిపోదురని ఆ
లోచించి తాను వొంటరిగావెళ్లివొకకొండగుహలోదాగియుండెను అది (నవ్షఫల్ కు)
తెలియగానే హాతెంయొక్క చరస్థిరములైనఆస్తితీసుకొనిహాతేమును ఎవరై
నాపట్టుకొనివస్తేవారికి అయిదువేలమొహర్లు ఇనామిప్పించెదమని ప్రకటనచేసి
యిస్తేయారునామాకూడా కట్టించినందున అతణ్ని వెతకడమునకు అందరుఆరం
భించినారు వొకరో నవొకముసలివాడు వాడిముసలిది యిద్దరున్ను ముగ్గురు
చిన్నవాండ్లనుకూడాతీసుకొనియడవిలోకట్టెలుకొట్టితెచ్చుకొనేనిమిత్తముహాతేం
దాగియున్నస్థలముదగ్గరికిప్రవేశించికట్టెలువిరుచుతూనుండిరి అప్పుడుఆముసలిది
మనది నాలుబాగా ఉంటేహాతేంమనకు ఎక్కడనైనాకనుపడుతాడు అతణ్ని
మనమునవ్షఫల్ దగ్గరకితీసుకొనివెళ్లితే ఆయన అయిదువేలమొహర్లు యినాము
యిచ్చును ఆధనముతీసుకొని ఇబ్బందిలేకసుఖముగావుండవచ్చుననగానే ముసలి

(౧) ఒకటోభక్తిసుకథలోకెం కోరిమాకుకా చూడవలెను.

వాడువినియేమిసేలుతావు మనసుదుటు ప్రతిరోజ కట్టెలుతెచ్చుకొని బాజారులో అమ్మిజీవించవలసినదన్నిన్ని లేదా అడవిలోపులియెత్తుకొనిపోవలసినదనివుండగా మనచేతికి హాతేం ఎందుకువారుకనుపాదుషా ఎందుకుయిచ్చుననగానే ముసలిదివిచారపడి కసూరుమనిఊరకున్నది ఈయిద్దరిప్రసంగము హాతేంవిని తానుదాగియుండిప్రాణమునుసంరంక్షించుకోవడము వ్రిధా యీ అదృష్టహీనులకోరికలభింపచేయకపోవడము తనపౌరుషమునకును ఔదార్యమునకు ద్వారమైయున్నదని కనికరములేనివాడు మనుష్యుడేకాడని వారులుకష్టమెరుగనివాడు కటకవాడనిన్ని నౌకరిఆయాసమునుపోగొట్టడమునకుభగవంతుడు మనుష్యునిసృజించేనుగాని తనపూజార్థమైపుట్టించినయెడల దేవదూతలు ఆయనకు ఏమితక్కువగానున్నారనియెంచి పైకివచ్చి నేనే హాతేమును నన్నునవ్ఫల్ దగ్గిరికి తీసుకొనివెళ్లితె ఆయనకరారుచేసినప్రకారము నీకుసొమ్ముయిచ్చుననగానే ఆముసలివాడుఇప్పట్లో ఈలాగుజరిగించడమువల్ల తనకు సదుపాయమున్ను క్షేమమున్ను కలుగును అయితే అతడు ఏమిఆలోచించి ఏమిచేసునో నిన్నొకవేళ చంపివేస్తే ఏమిచేతును నీవంటియోగ్యుణ్ని ఆశచేతవిరోధికిఒప్పగించుటనావల్ల అయ్యేపనికాదుఆసొమ్ముఎంతకాలముతిని జీవిస్తాను చచ్చినతరువాతభగవంతునికి ఏమిజవాబుచెప్పననగానే హాతేంబహుశా ప్రార్థించినాయొక్క ప్రాణమున్ను ధనమున్ను ఎవరికైనా అక్కరకురావడమేమంచిదనిఆలోచించియున్నాను నన్నుతీసుకొని వెళ్లవలసినదనినేను యెల్లప్పుడు ఇటువంటితాత్పర్యముకలిగేవున్నాననిసంతోషముగానన్నాడుగాని అతణ్నితీసుకొనివెళ్లి ఒప్పగించి ఆలాభమునుపొందడమునకు ఆముసలివాడు ఏవిధముగానున్నువొప్పినవాడుకాడు తుదకు హాతేంముసలివానిచూచినీవు తీసుకొనిపోనియెడల ఖుద్దునపాదుషాదగ్గిరికి వెళ్లిఈముసలివాడునన్నుఅడవిదగ్గిర కొండగుహలో దాచినట్టు చెప్పకమాననని అన్నందునవాడునవ్వి మంచికిబదులు గాచెడ్డవి సంప్రాప్తమైతేనా గ్రహచారమని వొకరికొకరుమాటలాడేసందడిని యనేకులువిని పోగైయితడే హాతేమనిపట్టి తీసుకొనినవ్ఫల్వద్దికివెళ్లిరి ఆముసలివాడున్ను విచారపడుతూ వెంటపడ్డాడు నవ్ఫల్ యెదుటపడగానే యితణ్నియెవరుపట్టుకొన్నారని అడిగితే వొకరాతిగుండెగల అబద్ధీకుడు ఇటువంటిపని తనకన్న మరియెవరుచేయగలరనిన్ని ఈజయముతనకేకలిగినందున ఆకాశముమీదజెండాపాతినాననిన్నియన్నాడుమరియొకడుతానుచాలారోజులనుంచి బహుప్రయత్నముచేసి అడవిలోనుంచి తీసుకొనివచ్చినాననిన్ని చిత్తగించికరారు ప్రకారము బహుమతీ చేయవలసినదనిన్ని

కొందఱుసొమ్ము కాశపడి అనేకవిధములుగాతమవల్లఅయినట్టు ప్రజ్ఞలుచెప్పి
ముసలివాడు ఒకమూలనుండెను అప్పుడుహాతేం అందరుచెప్పినఅబద్ధములు వి
నినవ్షఫల్ నుచూచి నీకునిజము తెలియవలసియుంటే కోటూగా నిలువబడియున్న
ఆముసలివాడు నన్నుపట్టితీసుకొనివచ్చినాడు వానికేమికరారుప్రకారము ఇవ్వ
వలసినదనిఅవయవములలో మనుష్యునికి నాలుకముఖ్యమై నడగనుక అన్నమా
టతప్పకూడదులేకుంటే ఆనాలుక నోరుమెరగని పశువుకున్ను కలిగియున్నందు
నమనుష్యునికిన్ని పశువుకున్ను భేదమేలేదని హాతేం పాదుషాతోచెప్పెను.

ఆపాదుషాఆముసలివాణ్ని పిలిచియిందులనిజముయేమని అడగగానేవా
డుయావత్సంగతులున్ను తెలియచేసినందున (నవ్షఫల్) (హాతేం)యొక్కధైర్య
మునకుఆశ్చర్యపడి చహంబాష్ నీయొక్కదాతృత్వము ప్రాణానకుసహితముల
క్ష్యపెట్టలేదని అన్నాడు తరువాత అబద్ధపుదానాలుతెచ్చినమనుష్యులను విరిచి
కట్టి ప్రాణముపోవ్యేలాగున అయిదువేల మొహరులకు బదిలీగా ప్రతివారికి
అన్నేసిపైజారు దెబ్బలుకొట్టించి తోలివెయ్యడమే కాకుండా అనేకమందికి
ఉపకర్తయున్ను యాచకులవిషయమైప్రాణమునిచ్చే మనుష్యుడున్ను దైవ
కార్యమందు ఎల్లప్పుడునిలిచియుండేవాడున్ను అయిన(హాతేముతో) ఈవ్యతి
గానుండడముధర్మముకాదని (నవ్షఫల్) ఆలోచించిహాతేంచెయ్యిపట్టుకొని అం
దుకుఇందుకునీవేతగుదువనితాజీమిచ్చి తనయొద్దకూర్చుండబెట్టుకొని ఆయనయొ
క్కదేశమున్ను ఆస్త్రిన్నిధనమున్నతత్క్షణమే ఆయనయధీనముచేసి అతనికికలిగి
యున్నకొలపెత్తనముతిరిగీఇచ్చి ఆముసలివానికి అయిదువేలమొహరులుఇప్పిం
చినందునవాడు దీవిస్తూపోయెను ఈసంగతి ఆసమావాస్తునివలన నేనువినగా
నే (హాతేం) తనజాతిమట్టుకుమాత్రమేపెద్దైయున్నప్పటికిని ఈరోజువరకువా
డికకలిగియుండేపేరుదాతృత్వముచేత సంపాదించినాడనిన్ని ఇకనేనైతే భగవ
దనుగ్రహమువల్ల (ఇరాన్) దేశమునకు (పాదుషానై) యుండిఅటువంటిపే
రుసంపాదించకపోవడము మిక్కిలివిచారమైయుంటున్నది ప్రపంచమందు దా
నధర్మములకన్నమెక్కువకార్యమేదీ లేదనిన్ని మనుష్యుడు యిహమందుయిస్తే
అందువల్లవచ్చేఫలము వొకవిత్తనమువేస్తే అందువల్లనంటేదినుస్సువలె పరమం
దువిస్తారముగా అనుభవిస్తాడనియాలోచించి పెద్దమేస్త్రీనిపిలిపించి ఊరుబయి
టనలుబైద్వారములుకలిగినటువంటిన్ని మిక్కిలి ఉన్నతవిశాలముగలవొకగొప్ప
లోగిలికట్టించవలసినదని యాజ్ఞాపించినాను కొంచకాలములోనే కోరినప్రకా

రహమతయారుఅయినదిఅరబ్బులో నేనుకరాచ్చీఅడితుదకునలుబై ద్వారములగుండా ప్రతిరోజునున్న అన్నివేళలయందు ఉదయ ప్రభృతి సాయంకాలపర్యంతము సోచ్చేయాచకులకుదీనులకుసంచులకొద్దిరూపాయిలు మొహరులు యిచ్చుచును న్నా ఎవరుఏమికోరితే అదిజాగ్రతపెట్టడమున్ను జరిగిస్తూనుంటిని వొకరోజున వొకఫకీరుఎదుటిదర్వాజాగుండావచ్చి అడిగితేవొకమొహరుయిచ్చినాను తిరిగీ అతడే రెండోదర్వాజగుండావచ్చిఅడగగానే యెరిగియెరగనట్టుతిరిగి రెండుమొహరులుయిచ్చినాను ఇదేతరహాగా ప్రతిగుమ్మముగుండావచ్చి వొక్కొక్క మొహరుచొప్పున ఇజాఫాఅడుగుతూఉంటే నేనున్ను అందుకు ఆమోదించి యిస్తూనుంటిని తుదకునలుబైయి ద్వారముతెన్నునున్నువచ్చి నలుబై మొహరులుఅడిగితే అవికూడాయిచ్చినప్పటికిన్ని సంతుష్టిని పొందకతిరిగి మొదటిద్వారముగుండామారివచ్చిఅడిగితె అదినాకుమిక్కిలి అక్రమముగాతోచివినుము ఓఅశాషోతా? నీవు ఎటువంటిఫకీరవు ఫకీరనేమాటయొక్క (౧) మూడక్షరములఅర్థమునుగుర్తెరగవుఫకీరు ఆవిధముగానడవలసియున్నదనగానే వాడుచిత్తముమహాప్రభో అదిఏమిటో సెలవివ్వండన్నాడు అందుపైనినేను (ఫే)అనేఅక్షరము ఉపవాసమున్నున్ను (ఖాఫ్) అనేదిసంతుష్టిన్ని (రే) పైవభక్తిన్ని తెలియచేస్తున్నవి ఎవడైతేఈప్రకారముగానడవడో వాడుఫకీరేకాడు ఇప్పుడునీవుపుచ్చుకొన్న ధ్యాయముచేసుకొనిసాగివచ్చి కావలసినది అడిగిపట్టుకొనిపెళ్లుము ధర్మమున్నది వొకళ్లకికలిగిన దారిద్ర్యమును పోగొట్టడమునకేగాని సొమ్ము నిలవచేసుకోవడమునకుఇచ్చేదికాదు నీవునలుబైగుమ్మముల ద్వారా వొకటమొదల్కొని నలుబై మొహరుల పర్యంతముపుచ్చుకొన్నావు నాటిని రెట్టిగాలెక్కిస్తే ఎన్ని మొహరులు అవుతవో చూడుమా అందుపైనినీఆశతీరిగ మొదటి దర్వాజా తెన్నుతీసుకొనివచ్చినది ఇంతసొమ్మున్ను జమచేసినీవు ఏమిచేస్తావు ఫకీరువొకరోజు జీవనోపాధికిమాత్రమే ఆలోచించవలసినది రెండోరోజున ఇవ్వడమునకు భగవంతుడుసిద్ధముగానేఉన్నాడు యికనైనానీసిగ్గుతెచ్చుకొని శాంతినిపొందుము యిదియెటువంటిఫకీరుతనము యీలాగుననేనాం గురువునీకు ఉపదేశించినాడని నేను అనగానే అతడు ఈమాటలువిని నిర్లక్ష్యముగా కోపపడి ఆసొమ్మునుయావత్తున్ను కిందపారబోసిచాలును నాయినా అంతకోపపడవద్దు నీవు ఇచ్చినది నేచ్చుకొని దాచుకొందాతనన్న పేరు ఎంతమాత్రమున్ను వహించవద్దు దాతఅనిపించుకోవడము బహుకష్టము దాతృత్వము అనేబిరుదుయొక్క భారమునీవు

(౧) పారసీభాషలో (ఫే) (ఖాఫ్) (రే) అనేదికలిస్తేఫకీరనేశబ్దము.

సహించలేవు యింతను ఆస్థానమునకునీవు ఎట్లుగా చేరగలవు ఉక్కెకెగరలేనిది స్వ
ర్గాణకెగరకర్తా (సఖీ) అనగాదాత అనేపేరునున్న (శె) షారాదఖురములు కలి
గియున్నదిముందుగా ఆప్రకారమునదిస్తే దాత అనిపించుకుంటాడని ఆఫకీరు
అనగానే నేభయపడిఅందలి అర్థమునాకు చెప్పవలసినదని అన్నాను అందు
కాఫకీరతడు (సీన్) అనేఅక్షరమునకున్న (శై) అనేఅక్షరము దేనికి
జతచేస్తేనుండుమున్న (యే) అనేఅక్షరము తనయొక్క జననమరణములను జ్ఞాప
కముంచుకోవడమున్న తెలియచేస్తున్నదనిన్ని ఎంతపర్యంతము ఇది తెలియ
కుండా నుంటాడో అంతవట్టుకు దాత అన్న పేరు పెట్టుకోకూడదనిన్ని దాత
యోగ్యుడైయున్నప్పటికిన్ని భగవంతునికి స్నేహితుడై యుంటాడనిన్ని ఈ
ఫకీరు అనేక దేశసంచారము చేసినాడు గాని (బసరా * దేశపు * రాజు) కోహా
త్రైవంటిదాతయొక్కడున్నూ కనపడలేదనిన్ని దాతృత్వముయొక్క స్వరూపము
నుభగవంతుడుఆమెనుగా ఘటించినాడనిన్ని అందరుదాతకావలెనంటారుగాని
ఆలాటిపనిసేయలేరనిన్ని అన్నాడు ఈమాటవింటూనే నేనుభయపడి నాతప్పు
క్షమించవలసినది ఏమికావలెనో అదిపుచ్చుకోవలసినదని బహువినయముగా నను
న్నప్రమాణముగానున్న [illegible] యచేసినానుగాని నేనుయిచ్చినదేమిన్ని పుచ్చు
కోకఇష్టపువాకవేళనియొక్క రాజ్యముయావత్తు ఇచ్చినప్పటికిన్ని ఆందుపై
నిటమ్మివేయను అల్పాచమనముకూడా చేయనని అంటూవెళ్లిపోయినాడు అదితలం
దలుకొని నామనస్సు వైకల్యమునుపొంది బసరాదేశపు రాచకొత్తైను ఏవిధము
గానైనా వెళ్లిచూడవలెనని కోరికయుదయించినది ఇంతలో నాతండ్రిగారు కా
లముచేసినందున సింహాసనమెక్కినాను ఐశ్వర్యముపట్టినదిగాని ఆధ్యానమువూ
త్రముపదలలేదు వజీరులు అమీరులు ఉమరావులు మొదలైనవారితో ఆలోచి
స్తే నేనుబసరాదేశమునకు వెళ్లడానకు ఎవరున్ను అంగీకరించలేదు విధిలేక ఒకరో
జునవరికిన్ని తెలియకుండా పెద్దవజీరునుపిలిపించి అతన్ని రాజ్యాధికారినిచేసి
నేను జేగురుబట్టలతో ఫకీరువేషమువేసుకొని ఒంటరిగా బసరాదేశపు పోవ
గణమునుపట్టినాను కొన్నిదినములకు బసరాదేశపు సరిహద్దుకువెళ్లి ప్రవేశించి
నానుఅదిమొదలుకొనిన్ని యీచిత్రమునుచూచుచుంటిని యేలాగంటె రాత్రి
కివెళ్లిబసచేసినస్థలమందుయీరాచకొమాతె నౌకరులుచాకరులు యెదురుగుం
డావచ్చి అనుకూలమైన సబసలో దింపి విందుకు కావలసినపదార్థములు యావ
త్తున్ను సిద్ధపరచి సమ్ముఖమందు రాత్రియావత్తు కనిపెట్టియుండేవారు మరుచ

(౩) ఫారసీభాషలో (సీన్) (ఖై) (యే) అనేదికలిస్తే సఖీశబ్దము.

దినము రెండవ మజిలీలోనున్న ఈవిధముతటస్థమవుతూవున్నందున యీలాగు సుఖముగా నెలలకొద్ది ప్రయాణముజరిపి తుదకు బసరాపట్టణములో ప్రవేశించినానుఅకొత్తపట్టణమేవొకసుందరమైనజవానుసంతోషకరమైనముస్తాబైయున్నాడు సౌందర్యమింతగలవాడు బహుస్నేహపాత్రుడు చూడగానే బహుబుద్ధిమంతుడనితోచేతరహాగలమనుష్యుడు నావద్దికివచ్చి నేను ఫకీరులయొక్క సేవకుణ్ని విల్లప్పుడున్ను ఆపనిలోనే ఉంటూఉన్నాను ఎవరైనా ఫకీరులుగాని గృహస్థులుగాని ఈపట్టణములోకివచ్చినయెడల నాయింటిమట్టుకే పాదములకు శ్రమయిస్తూవుంటానన్ని విదేశస్థులు ఉండడమునకు ఇంతకన్న ఇక్కడవరేస్థలముమరియేదీ లేదనిన్ని తమరువిజయముచేసి గృహపావనముచేసిరక్షించవలసినదని మిక్కిలి మధురవాక్యములతోసంభాషించడమునకుపక్రమించినాడు అప్పుడు యీఫకీరు తమనామధేయమేమని అడిగినందుకు ఈ అనామకుని పేరు (జేదారుబఖ్తు) అంటారనిఅన్నాడు ఆయనయొక్క వినయ విధేయత్వములనుచూచి ఈవీనుడుఅతనితో కనుకవెళ్లి చూస్తేబహుగొప్పలోగిలి (చక్రవర్తులు) వాడికసేయతగిన సమస్తవస్తుపదార్థములతోనున్న సిద్ధమైయున్నది అక్కడవొకగదిలోకి తీసుకొనివెళ్లి ఉష్ణోదకముతో పాదప్రక్షాళనము చేయించి కూర్చుండబెట్టి నాలుగుపాత్రలతోపులిహోర దధ్యోదనము శర్కరపొంగలి చిత్రాన్నములు వివిధభక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీయములున్ను ఊరగాయలున్నుయనేకరుచులుగల రొట్టెలున్ను పులావులున్ను కబాబులున్ను హల్వాలున్ను పరమాన్నమున్ను కోవాపెరుగున్ను ఆసవముమొదలైనవి తెప్పించి యెదుటవుంచినాడు అవి ప్రతిపదార్థమున్ను నొక్కొక్కకబళముపుచ్చుకోగానే కడుపునిండినందున భోజనముచాలించినాను ఆయననన్నుచూచి అప్పుడేయేమిభోజనముచేసినారుఅన్న మొయ్యావత్తుఅలాగుననేయున్నది ఇంకాభోజనముచేయుమని అన్నాడుదేవుడు మీకుమేలుచేయవలెను నాకడుపుపట్టినంత భోజనముచేసినాను ఇవిఅన్నితీయించివేయుండనిఅన్నాను నాటిరుచులు నేను ఏమనిచెప్పుదునుయిదివరకున్ను నాలుకమీద్పైరిస్తూనేఉన్నాను తేపువచ్చినప్పుడల్లాపరిమళముకలిగేయుంటున్నది భోజనముకాగానే జలతారుబుటేదారిపనిచేసిఉన్నటువంటి కాషానీకేశవు మొఖమల్ ఆస్తరణముచేసిఅందుపైనిబంగారపుజారీచెంబుతో వేడినీళ్లునాచేతిమీదపోయుంచిబుక్కాతో చెయికడిగించినాడు తరువాతరత్నఖచితమైన పాందానుతో బంగారపువరఖుచేసి ఉన్న తమలపాకుపట్టీలున్ను చౌగడాలో వెండివరఖుచేసియున్న పోకచెక్కలు లవంగాలు ఏలకులుమొదలయినవితెచ్చి ఇచ్చినాడు

ఖానానకు కావలసినప్పుడు మంచములోనుంచిన నీళ్లు తెచ్చియిచ్చెను సాయంకాల
ముకాగానే మేడ్లలోకర్పూరపువత్తులువెలిగించియుంచిఆపెద్దమనుష్యుడునాత
గ్గనూర్చునిమాట్లాడుతూవుండెను జామురాత్రి కాగానే దోమతెరకలిగియున్న
ఈపంద్రిమహాలులోశయనించవలసినదని ఆయనతెలియచేస్తే ఫకీరులకుతేడితో
లుపక్కవేసుకోవడానకుచాలును ఇటువంటిదన్ని మీవంటిగృహస్థుల నిమిత్తము
భగవంతుడునిర్మాయించినాడంటే ఆయనఈసామాగ్రియాపత్తుఫకీరులనిమిత్త
మైయుంచినదికానితననొత్తుకాదనినిరోధించడముచేత పూలపాన్పుకన్నప్పుదు
వైనపక్కమీదపరున్నాను ఉభయపార్శ్వములయందుపుష్పలతబుటలున్న వె
లుగుతున్నఊదువత్తులున్న ఇంకాపరిమళద్రవ్యములునిండియున్నవి ఎటుఒత్తి
గిలితే అటుపరిమళములో మునిగినిద్రించుచుంటిని తెల్లవారగానే బాదంపప్పు
అంగూరుపండ్లు అంజూరుపండ్లు దానిమ్మపండ్లు కెసిమిసిపండ్లు ఖర్జూరపుపం
డ్లు ఇంకాఅనేకఫలములుఫలహారములు తీసుకొనివచ్చియిచ్చి రాత్రిపగలువెడ
లెగకనావద్దనేవుంటూవుండెను ఆపిమ్మట నేను సెలవు అడగగానే ఆయనచేతు
లుజోడించుకొని ఈపాపాత్మునివల్లతమకుఏమైనాసేవలోలోపముజరిగినదేమో
అందుచేత అప్పుడు సెలవుపుచ్చుకొంటామని అన్నాడు అందుకు నేనాశ్చర్యపడి
యెంతమాట అతిథిమూడురోజులవట్టుకు ఉండడమువిధి అలాగననే ఉన్నాను
యింతకన్నవిశేషముగా ఉండడమునుంచిదికాదు విశేషించి ఈఫకీరు దేశసం
చారనిమిత్తముబయలుదేరినందున నాకొకస్థలమందే ఉండడము మంచిదికాదుగనుక
అట్లాకాకపోతేవెళ్లడమునకుమనస్సురాదన్నాను అతడుతమచిత్తమన్నాడుగాని
రాచకొండమాతేటవద్దికితాను వెళ్లెమనివిచేసేపర్యంతము వొకనిమిషమయినా యి
క్కడవిశ్రమించండి ఈలోగాతమకువిజయముచేయవలెననే పత్రమందు ఈప
త్రములోనున్నయావద్వస్తుసామాగ్రి తమదిగనుకకూడాపట్టించుకొని వెళ్లడాన
కుఆజ్ఞాపించినప్రకారము జాగ్రతచేస్తానని అన్నాడు నేనందుకు వెక్కసపడి
నేఫకీరును కానాభత్రాజునా ఇటువంటిఆశనాకు కలిగినపక్షమందు గృహస్థ
ధర్మమువదులుకొని ఎందుకు ఫకీరునౌతానని అన్నాను ఆస్నేహితుడు యీస్థితి
రాచకొండమాస్తైకు తెలిసినపక్షమందు తన్ను యీపనిలోనుంచి తప్పించియేమి
జరిగించునోయనకు ఇటువంటినిలక్ష్యబుద్ధికలిగినయెడల ఇవన్నివొకకొట్టులోనుం
చితలుపువేసిసీలుచేసుకొని మీయిష్టముచొప్పునజరిగించవచ్చునని యన్నాడుగా
నినేనువొప్పలేదుఅతడు నామాటనులక్ష్యపెట్టనందున విధిలేకఆప్రకారమే వొ
కకొట్టులోనుంచితాళము వేసిసెలవుపుచ్చుకొని ఉండగానే ఇంతలోనొక పెద్ద

కొజ్జాబాగా ముస్తాబై నడుమున ఆయుధములు కట్టుకొని రత్నస్థగితమైన బంగా రపు ఆసరాకఱ్ఱ చేతిలో పట్టుకొని వెంటబడిన గొప్ప హూదాలలో కొందరు పరిచా రకులను తీసుకొని గొప్ప వైభవముతో నావద్దకు వచ్చి అనుగ్రహపూర్వకమైనటు వంటిన్ని మృదువైనటువంటి సంభాషణము జరిగించినాడు అందలి వివరము నే ను చెప్పజాలను అప్పుడు నాతో అయ్యా తమరు కటాక్షించి యీ ప్రార్థకుని యొక్క బీదయిల్లు తమ యొక్క పాదధూళి చేత నలంకరించిన పక్షమందు ముఖ్య ముగా ఈ దీనసంరక్షణము జరిగించినట్టు ఉంటున్నదనిన్ని ఎవరో పరదేశి వచ్చి ఆ లాగున నే వెళ్లిపోయినట్టు రాచకొమారైకు తెలిసిన యెడల నాకు యేమి ఉపద్ర వము కలుగునో అని శంకించి నా ప్రాణము మీదికే వచ్చునేమో అని అన్నాడు అందు కు నేను వాని స్వప్నటీకని బలవంతముగా అంతకన్నను ప్రశస్తమైన వొక హవేలి లోకి నన్ను తీసుకొని వెళ్లి మూడు రోజులపర్యంతము రెండుపూటల భోజనమున్ను శరీరపుష్టి నిమిత్తము పానకము ఫలరసము నిప్పించి అందలి సామానులు యావ త్తున్ను తమరు ఖామందులనిన్ని ఇవి తమ చిత్తము వచ్చినట్టు జరిగించవచ్చుననగా నే నే ను వింతపడి ఏలాగున్నానైనా అక్కడనుంచి పారిపోవలెనని ఆలోచించినాను గా ని అతడు ఆజాడ తెలుసుకొని వో స్వామీ మీకోరిక యేమిటో సెలవిస్తే రాచకొ మారై తమతో మనవిచేస్తాననగా నేను ఫకీరు వేషము వేసుకొని ఉన్నప్పుడు ప్ర పంచపదార్థములలో ఏమడగను మీరు అడగకుండా నే ఇస్తూ ఉన్నారని అన్నా ను అందుకు అతడు ప్రపంచములో ఆశ ఎవరికిని వృత్తిగా లేదుగాని అనేక వేషధా రులను చూచినాము ఈలాగు ఎవరున్ను అనలేదని చెప్పడమే కాకుండా యీ యర్థము గల వొక శ్లోకము కూడా చదివినందున నా తాత్పర్యము వొక చీటిలో వ్రాసి సిక్కా చేసి మీపరముగా ఇవ్వడము అవుతున్నదని అది రాచకొమారైకు అందచేసినట్టయితే తాము నాయందు అనుగ్రహించి ఈ ప్రపంచములో నున్న ధనము యావత్తున్ను నాకు ఇచ్చినట్టు సంతోషిస్తానని అన్నాను అందుకు అతడంగీకరించినందున సుందా గా భగవత్ప్రార్థన చేసి తరువాత నాయొక్క స్థితి వారివల్ల పొందిన ఖనాలు యావత్తు ఉదహరించి తాను పాదుషాహైనా గుండడము చేత ముఖ్యమన్నది భామవి షయమై యే వచ్చినాను గాని యితర వాంఛలేమి లేదనిన్ని నాకోరిక తమరు ఫలింప చేయనియెడల మోహము చేత ప్రాణమును (౧) మజునువలెనున్ను (౨) ఫరహాద్ వలెనున్ను అడవులలోను కొండలమీదను సంచరిస్తూ విడిచెదనని వ్రాసిన చీటీను అతని పరముగానిస్తే అది ఆమెకు అందచేసి తిరిగి వెంటనే వచ్చి నన్ను మహల్ దే

పడివద్దకితీసుకొనివెళ్లెను అక్కడవొకముసలినగలు అలంకరించుకొని బంగారుపుకుర్చీమీదకూర్చుండియుండెను మరిన్ని ఆమెవద్ద అనుకూలమైనపోషక్కులతో ఖొజ్జాలుచేతులుకట్టుకొని యెదుటనిలువబడియుండిరినేను ఆమెను పెద్దనియెంచిసాష్టాంగపడ్డాను ఆమెనన్నుమిక్కిలి అనుగ్రహపూర్వకముగా సలాముచేసిమీరువచ్చినపనిబాగుపడ్డది కూచుండుడని సెలవివ్వడమేకాక మీరేనారాచకొనాతేజనుగురించి చీటివ్రాసినారని కూడా అన్నందుననేనుసిగ్గుపడి తలకిందికిదించుకొని యూరకెయుంటిని వొక్కనిమిషమైన తరువాత ఓచిన్నవాడా ఆమెమీకు సలాముచెప్పినారనిన్ని ఆమెకు వివాహముచేసుకోవడమువల్లతప్పితమేమిన్నిలేనందునమీరు ఆమె మనస్సులోనున్నదేకోరినారనిన్ని అయితే మీయొక్క రాజ్యపుస్థితిచెప్పడమున్ను ఈవేషముతోనుండి తాను పాదుషాననిగర్వపడడము పనికిమాలినపని ఎట్లనిన అందరుమనుష్యులేకాని వొకరితో నొకరుసమానులైయున్నప్పటికిని మహమ్మదుమతస్థులుమాత్రమువిశేషజ్ఞులైవున్నందునఆమెకుచాలాకాలమునుంచి తగినవారినివివాహముచేసుకోవడముకోరిక కలిగియున్నదిఅయితే ఆమెకుభగవంతుడుహద్దులేనిభాగ్యము కలుగచేసినందున ఇతరులఐశ్వర్యము ఆమెకుఒరూరులేనందునమీచేతనైతేవొకపనిచేసే షరతుమీదముందుగాప్రమాణముపత్రముచేసుకోవలసినదని ఆముసలిది చెప్పినందున నేను ప్రాణముకూడా లక్ష్యపెట్టనుఅన్నిటికిసిద్ధమైయున్నానుగనుక ఆసంగతి చెప్పవలసినదంటే ఆమె ఈరోజునమీరుఉంటే రేపటిదినముమీకు తెలియచేస్తానని అన్నది అందుకునేనుసంతోషముగా అంగీకరించిసెలవు పుచ్చుకొని వచ్చినాను ఇంతలోఅస్తమయమైనది అప్పుడువొక పెద్దఖొజ్జానన్నుపిలిచి మహలులోకితీసుకొనివెళ్లెను అక్కడపెద్దలుపండితులుధర్మశాస్త్రవేత్తలు ఉన్నందున నేనున్ను వెళ్లిఆసభలోకూర్చుండగానేగుడ్డ (౧) పరచితరహాతరహాగా ఉప్పుతీపిగల సమస్తభోజనపదార్థములనువారుభక్షించుచు ప్రార్థించినన్నున్ను వారితో కూడాకలుపుకొన్నారు భోజనము అయ్యేటప్పటికివొకడు ఈలోగిటలోనుంచివచ్చి (బహరోజు) అనేనవుఖరు ఎక్కడనున్నాడో వానితీసుకొని రావలసినదని అన్నది చోపుదారులు తక్షణమే అతణ్నిహాజరుచేసినారు అతడుమహాపురుషత్వముగలమనుష్యునిలాగునుండడమేగాక వెండిబంగారములతో చేసిన అనేకములయినతాళపుచెవులుమొలనుకట్టుకొనివచ్చిసలాముచేసి నావద్దకూర్చుండెను అప్పుడుఆదా ఈ అతనితోనీవుచూచినదియావత్తు ఈయనతో తెలియచేయుమని

(౧) తురకలుగుడ్డపరచి దానిపైన పాత్రలుంచుకొని భోజనముచేయుదురు.

ఉన్నందుననావైపుతిరిగి ఈకథనారంభించెను ఏమంటే ఓస్నేహితుడా యీనస
ర్కారులోవర్తకపువ్యాపారముమీద సంచరించేటటువంటిగులాములు అనేకు
లున్నందున వారిలోనేనొకదీనుణ్ని మూరాచకోమా తేఱలక్షలకొలదిరూపా
యీలు ఇచ్చి ప్రతిదేశమునకు సరంజామునిమిత్తమునన్ను పంపించేవారు తిరుగా
వచ్చినట్టుగానే ఆదేశపుభోగాట్టామూవల్ల తెలుసుకొంటూనుండేది వొకపర్యా
యము (౭) (సీమ్రాజులనే) పట్టణమునకు ఈయన్పుడు వర్తకనిమిత్తమువెళ్లి
యుండెను అక్కడప్రజలంతానల్లబట్టలతోడుగుకొని ఆపదనుపొందియున్న
ట్టుఎల్లప్పుడు మొఖముపెట్టేవేసుస్తూనుండేవారు అందుకుకారణమేమని నేను ఎవరిని
అడిగినాజవాబుచెప్పనందున ఆశ్చర్యపడుతూ కొన్నిరోజులుంటిని నెలపొడుపు
రోజునఅక్కడిప్రజలంతా పాదుషాతో ఊరుబయిటికివచ్చిలయనుదిచిఱ మై
దానముమీదనిలువబడియుండిరి నేనున్నువారితోవెళ్లియుంటిని ఐతేవారంతా ఎ
వరినిమిత్తమో ఎదురుచూస్తూఉన్నట్టుపోనిపడ్డదిగనేను కాగానే గంధర్వ్వ
నివంటిసుందరమైన పదినెనుబదియారుసంవత్సరములవయస్సుగలవొకచిన్నవా
డువడిగా కేకలువేస్తూనొకవెంటనురుగులుకక్కుకొంటూవొకయెద్దపీఁనవా
రిఅను ప్రజలకెదురుగుండావచ్చివాద్దనునుంచినిసవొకచేతిలోనదీసినక్షరంగి
కత్తిన్నిరెండోచేతిలోయెద్దుముక్కుతాడున్నన్నట్టునిమండవేసుకొనికార్యం
గెను అతనితోకూడాగులాంపిప్పమువంటి రంగుగలసుందరమైన వొకగులాము
వున్నందునవానిచేతికయేమోయిస్తేఅదివాడుప్రతిమనిషికి చూపిస్తూవచ్చినాడు
గాని ఎంపుచేతనో అందరునెత్తికొట్టుకొనియేడిచిరి తరువాతవాడుతనప్రభు
వుదగ్గరికితిరిగివెళ్లగానే ఆయనలేచి వానితలనరికిపేసి తిరిగివచ్చిన దారివెళ్లిపోయె
ను ఆయనకనపడేసంతవరకు అందరునిలువబడిచూచితరువాత విచారపడుతూ
పట్టణమునకువచ్చినారు నేనుప్రతివారితో ఈస్థితిచెప్పవలసినదని బతిమాలినప్పటి
కిని యెవరున్ను చెప్పనూలేదు నాఉత్సాహము ఏమిన్నితగ్గలేదు ఈయాశ్చర్య
కథను నేనుతిరుగావచ్చిరాచకొమారితతో అగపరచినది మొదలుకొని ఆమెయది
తెలుసుకోవడమునకు వాంచకలదై యీవివరముఎవరైనాచూచివచ్చి తెలియచే
యుడమేతన్నువివాహాముచేసుకోవడమునకుప్రదానకార్యమనిన్ని అతడే దేశము
నకును ద్రవ్యమునకును తనకుకూడాయజమానుడని ఆమెనిర్ణయించియున్నది
గనుకమీరు బాగా ఆలోచించి ఈపనిమీవల్ల అయ్యేటట్టయితే తయారుపడండి
లేకుంటేతిన్నగాయింటిదారిపట్టుడమేమంచిదని తెలియచేయగానే భగవంతునితె

(౭) సీమ్రాజులనేది పారసీదేశములో ఒక భాగమైయున్నది.

లభింపకపక్షమునకే ఆవివరము తెలుసుకొని రాచకొమార్తె సన్నిధికివచ్చి కా
మితఫలమునుపొందుతాను లేకుంటే అందుకువేరేసాధనమేయుండదనిచెప్పితి
మేకాక రాచకుమార్తె చేసియున్నప్రతిజ్ఞతప్పకూడదనిన్ని ఆమెదీనసంరక్షణ
బుద్ధిచేతనన్నుసముఖమునకుపిలిపించి పరదాయివతలకూచుండబెట్టి ఆమెము
ఖతః ఆఖరారు నాతో ప్రమాణముగాచేసినపక్షమందునామనస్సుస్తిమితపడిన
కలకార్యదిగ్విజయమునుపొందగలనని చెప్పినాను ఈమాటలన్ను ఆముసలదివెళ్లిఆ
రాచకొమార్తెతో మనవిచేసినది ఏలాగైతేనేమితుదకుదయచేసినన్నుపిలువనం
సినదనియాజ్ఞాపించినందున దాయివచ్చి రాచకొమార్తె నివసించియున్నమహ
లులోకినన్నుతీసుకొనివెళ్లెను అక్కడ రెండువరసలుగా బారుకట్టిచేతులుజోడించు
కొనియున్నచెలికత్తెలున్ను దాసీలున్ను హబుసీ అరబ్బీ తుర్కీ ఫారసీ కాస్మీ
రు మొదలైనదేశములయొక్క సౌందర్యముగలస్త్రీలున్ను జవాహీరుధరించి
ఆయాహద్దుచొప్పున నిలువబడియుండిరి యిదియింద్రభవనమో లేక గంధర్వ
విమానమో యనిభ్రమపడిచూడగానే ఆశ్చర్యముచేత వాక్పర్యాయము హా
అన్నశబ్దము నానోటివెంటబయలుదేరి గుండెలుకొట్టుకోవడమును ప్రారంభించి
నవిగాని నేనుధైర్యము తెచ్చుకొనివాండ్లను చూస్తూయెదుటికివెళ్లినాను అక్కడ
వొకవైపున తెరవేసిరత్న ఖచితమయినకుర్చీపీటయును వొక్కచందనపుపీటయు
న్ను ఆముందువేసియుండెను దాయినన్నుకూర్చుండవలసినదని సంజ్ఞచేసినందున
ఆకుర్చీపీటమీదనేనుకూర్చుండగానే ఆచందనపుపీటమీద ఆమెకూర్చుండి ఇకమీరు
అడగవలసినదేమయినా ఉంటే తెలియచేయుడనియనగానే నేను ఆరాచకొమా
ర్తెయొక్క సుగుణసంస్తుతినిన్ని ధర్మపరిపాలనమున్ను దానధర్మములన్ను
ముందుగాకొనియాడి ఈదేశపుపొలిమేరకుతానువచ్చినదిమొదలు ఇదివరకుదా
రిపొడుగునతనవిషయమయిజరిగిన ఉపచారఘనతను వివరముగా చెప్పడమేగాక
తనవంటివొక్క ఫకీరుకే ఇంతసదుపాయముఉన్నప్పుడు ఇటువంటిపేదలు వేల
కొలదిమీదేశానకువచ్చుచుందురు యెంతఖర్చు అవుతూవుండునో అదియెక్కడ
నుంచివచ్చునోయదిబోధపడక ఆశ్చర్యపడి (౧) ఖారూన్ యొక్క ధనమయినా
ఈఖర్చుకు ఓపలేదనిన్ని పైనివిచారించిచూస్తే ఈమెకువచ్చే ఆదాయము భోజ
నమునకైనాచాలినంతకనపడనందున ఇతరవ్యయములకుమూలమేమో తెలియక
రాచకొమార్తె ముఖవచనములవల్లవిన్నట్టయితే నేను స్తిమితపడి (శ్రీ [illegible]
యనేపట్టణమునకుసంతోషముగావెళ్లి అక్కడిస్థితి తెలుసుకొని అయ్యుదారా

(౧) మొదటిఫకీరుకథలో ౧ రిమార్కు చూడవలెను.

మున్న మొదలతిరుగావచ్చి కోరినకోరికె యీడేర్చుకొంటానని మనివిచేసినాను యుదివింటున్నే ఆరాచకోమాలేఃఓచిన్నవాడ ఈహద్దులేని భాగ్యముయొక్క భోగటాయేమిటు తెలియవలసియున్న యెడల ఈరోజునకూడా ఇక్కడనిలిచి సాయంత్రమువిజయముచేసినయెడలయక్కించితు లోపములేకుండావిశదపరచబడుచున్నదనగానే నేనుబసకువెళ్లి యెప్పుడుసాయంత్రమవును వేగమేయీస్థితితెలుసుకోవలెననికోరికకలిగినిరీక్షించుచుంటిని ఇంతలో వాకభోజ్జా మూతలువేసిఉన్న కొన్నితబుకులలో రాచకోమాలేఃపుచ్చుకోపడ్డపదార్థములు నాకరులచేతపట్టించుకొనివచ్చి యెదుటనుంచి ఇవిభక్షించవలసినదని తెలియచేసెనువాటిమూతలుతీసిచూడగానే పరిమళము బ్రహ్మరంధ్రమునకంటికపుఫు నిండినదియయినప్పటికిని ఓపిక ఉన్నంతమట్టుకుభక్షించి మిగిలినవిఅయించి ఇందుకు చాలాసంతోషించినానని వర్తమానము పంపించినాను సూర్యుడు పగలంతా ప్రయాణముచేసి అలిసితనయింటికిచేరగానే చంద్రోదయమాయను యప్పుడు వొకదాయివచ్చిరాచకోమాలేఃమిమ్మున పన్నెండుగంటకత్వరగా విజయముచేయవలసినదనియన్నది నేనుదానితోకూడాఏకాంతస్థలమునకు వెళ్లితిని అక్కడివైభవమునకు యేదిన్ని సమానము కాకుండానుండడమే కాక యనేకదీపకాంతులు ప్రకాశిస్తున్న చక్రవర్తులయొక్క ఘరషానుజలతారుమసలందు రత్నస్థగితమయినబాలీసువేసియున్నవి అందుపైనిముత్యాలజాలరుతోవకమన్యానానపరత్నస్థాపితమయినకట్లలమీదనిలవపెట్టియున్నది మసలందు ఎదుటవుష్పపత్రఫలములు ఉన్నతరహాతరహాగల జవాహీరుచెట్లుబంగారపుమళ్లలోనుంచియున్నవి అవియావత్తుదేవునియొక్క మహిమచేత ఆవిర్భవించినట్టుగానుండెనుగాని కల్పితములుగాకనపడలేదుకుడియెడమరెండువైపులసుందరులయిన చెలికత్తెలు దాసీలు మిక్కిలివినయముతో చేతులుకట్టుకొనిముఖమెత్తకుండా కిందచూస్తూనుండిరి పాడేటటువంటిస్త్రీలు శ్రుతిస్వరమేళనముచేసుకొని నిరీక్షించుచుండిరి అ అస్థితినిచూచినాబుద్ధిస్థానము తప్పిపోయి దాయితోపగలు ఆసొగసున్నరాత్రి ఈఅలంకారమున్నచూస్తే ప్రపంచములో సప్తద్వీపములు యేలే ప్రభువునకైనాయిటువంటిభోగము ఉండదు ఎల్లప్పుడు ఈలాగున నేజరుగుతున్నదాయని యడిగినాను మారాచకోమాలేఃయొక్క విభవముమీరుచూచిన విధముగానే యెల్లప్పుడు దినేదినేలోపము లేకుండా విశేషిస్తున్నదని చెప్పిమీరు ఇక్కడకూర్చుండండి ఆమె రెండోగదిలోవిజయముచేసియున్నదనిలోపల ప్రవేశించి అప్పటేవచ్చినదిదానితో నేనున్న ఆగదిలోకిపోగా నాలుగువైపులతగిలించినటువంటి

స్నిఘ్రాప్యయుగపురుషప్రమాణముతో దగినటువంటిచట్టములయందు ముత్య
ముయొక్కపచ్చలయొక్క కుందనపుపనిచేసియున్నటువంటిదళసరి అద్దములను
చూచినేనుదారితప్పిగుమ్మమెక్కడనో గోడయేదోయని తెలియకుండా నుంటిని
ఒకఅద్దముయొక్కకాంతి రెండోదానిలో ప్రతిబింబించినందున అన్నిగదులర
త్నమయములైయున్నట్టుఅగపడ్డది. అక్కడవొకవైపున పరదాకట్టిదానివెనక
ఆబిడకూచున్నది ఆదాయీపరదా దగ్గిరగూర్చుండినన్ను కూచుండుమన్న
ది అప్పుడుఆరాచకొమాతెయొక్క సెలవుప్రకారము ఈతరహాగానాతో
చెప్పడమునకుప్రక్రమించెను ఈదేశపురాజు గొప్పవారైయుండిరి ఆయనగర్భ
వాసమందు ఏడుగురుకుమార్తెలుజననమయినారు వొకరోజునఆయనఉత్సవ
ముచేయించినందున ఆయేడుగురుకుమార్తెలున్ను సర్వాభరణభూషితలై యె
దుటనిలువబడియుండిరి రాజుకుమనస్సులోనేమయినాతోస్తేకుమార్తెలవైపు
చూచిసెలవిస్తూనుండెవాడు అలాగుననే వొక పర్యాయము మీతండ్రి రాజు
గాకపోయి మీరుబీదవానిఇంటపుట్టినయెడలమిమ్మును రాచకుమార్తెలని యె
వరందరుఅనిమీగొప్పయావత్తునేను జీవించియున్నంతవట్టుకే గనుకఈస్థితిమీకు
కలిగినందుకుభగవత్ప్రార్థనచేయవలసినదని అనగానే మిగిలినఆరుగురు కుమా
ర్తెలుఏకవాక్యముగా అవునుతమరునురక్షితులుగానున్నంతవట్టుకే మాభాగ్య
మనియన్నారుగాని అందరిలోచిన్నదియైన నప్పటికిని బుద్ధిచేతనుజ్ఞానముచేతనుఅం
దరికన్నధీరమయియున్నందున అదిఆజ్ఞానవాక్యగానెంచి ఊరకేనిలువబడి ఆ
ప్రసంగములోనేమియోగాకా కలగచేసుకోకుండా నుండెను రాజు కోపదృష్టి
తోనీవేవైపుచూచి యేమన్నావునీవేమిచెప్పకుండుటకుకారణమేమనగా అప్పుడు
ఈమెతనరెండుచేతులుజోడించుకొని ప్రాణరక్షణము చేస్తానన్ని తప్పుక్షమి
స్తానన్ని వరమిచ్చినయెడల ఈచిన్నదిమనస్సులోతోచినమాటమనవిచేస్తున్నదని
అన్నది ఆప్రకారనే సెలవైనది అప్పుడు ఈరాచకొమాతెనిజమాడితేనిష్ఠు
రమువస్తున్నదన్నసామితెతమరున్నువినేఉందురు ఆహేతువున ఇప్పుడునాబ్ర
తుకుమీద ఆశవదులుకొని నానుదుటవ్రాసినవ్రాతను ఏవిధముగాను తప్పించ
నేరనినెంచుకొనివచ్చేదేదో అదిరాకమానదని నిశ్చయించిమనవిచేసెదను మి
మ్మునరాజుగాపుట్టించినభగవంతుడునన్నురాచకొమాతెగాచేసినాడనిన్ని ఇం
దులోయొకరిపెత్తనములేదనిన్ని అయితేతమరు అన్నోదకములిచ్చి మమ్మునసంర
క్షించినవారౌటచేతతమయొక్కపవిత్రమయినపాదధూళి కాటుకచేసి ధరించ
డానకుతగియున్నదిగాని యెవరిపుణ్యమువారిదేయనిమనవిచేసెను ఈమాటవిన

గానారాజాయమాటలకతినోక్తిగానెంచి కోపముతెచ్చుకొని అన్నపెట్టకొం డము కృతఘ్నమని సెలవివ్వడమేకాకదీనినుమటపనిమిత్రాసియున్నదో చూతా మని యెంటనున్నసగలుయూవత్తులాగుకొని దీన్నివొకమేనాసవారిలో నెక్కించి మనుష్యసంచారములేనియడవిలోతీసుకొనివెళ్లి అక్కడవదిలిపెట్టి రావలసినదని ఆజ్ఞాపించినందున ఆప్రకారము అర్థరాత్రివేళచీకటిలో ముద్దుమోహము లచేతపెరిగినటువంటిన్ని తనగదికన్నరెండోస్థలమెరుగనటువంటిన్ని ఆచిన్నదా న్నిబోయీలుతీసుకొనివెళ్లివొకకీకారణ్యములోవదిలిపెట్టివచ్చినారు యిప్పుడేరా చకొమాత్రేమనస్సువొక్కనిమిషములో ఆలాటిస్థితియిలాగైనందుకు యా శ్చర్యపడి భగవంతునికి వందనముచేసి వో భగవంతుడా నీవుయెట్టిస్వతంత్రుడ వంటేపనిసంకల్పించినావో అదిచేసినావునుక్కనఊపిరియున్నంతమట్టుకు నీవి షయమయివిరామమునుపొందదని అనుకుంటూనుండగా నిద్రపట్టినది తెల్లవార గానేకండ్లరెప్పలువిప్పేయేమిస్వప్నమునకనుపడెను ఎవనైనా తేపడముకద్దాలేదా అనినవుకరులనుచ్ఛేదించిపిల్చెనుగాని అంతలోనేగడచినరాత్రిజరిగినప్రసంగము జ్ఞాపకమువచ్చి అయ్యోనేనుయెక్కడనున్నాను ఈమాయెక్కడిదని లేచి మం త్రస్నానముచేసిభగవత్ప్రార్థనచేసెను ఓస్నేహితుడా ఈరాచకొమాత్రే యొక్కకష్టమువినడముచేతగుండెలుబద్దలవుతున్నవి ఆమెకుమళ్ళీయేడిగితే ఇం కాయేమిచెప్పునోతెలియదుతుదకుఆమె ఆసవారీలోనేకూర్చుండిభగవద్ధ్యాన ముచేస్తూతనలోతానుభగవంతుడుపండ్లురాకుండానన్నుపవాసముచేసిజీవిం చడమునకు పాలుకల్పించెను పండ్లువచ్చినతరువాత అన్నముకలగచేసెనుయి దిగాకపశుపక్షిమృగాదులకు జీవనోపాయముకల్పించినవాడు యితరులనుమా త్రము రక్షించడా మిగిలినపనికి నీవేలఖేదపడియెదవు చరాచరాత్మకమయిన ప్రపంచమునుసంరక్షించె భగవంతుడునిన్నురక్షించునని అర్థముగల శ్లోక ములుచదువుతూనుండెను మనుష్యునివల్లయేకార్యము సమకూడకనున్నప్పుడుభగ వంతుడేజ్ఞాపకముచేస్తాడుఆలాగేకాకపోతేతమతమమట్టుకు (౯) (లుఖుమాన్ ఖోఆకేసీనా) అనేవాండ్లమని అనుకొంటూరు అప్పట్లోభగవంతుడుచేసిన చమ త్కారమునువినుడి ఈవిధముగా మూడురాత్రిపగళ్లురాజకొమాత్రెనోటికి వొకకణమయినా దొరకకుండాజరిగినవి పుష్పమువంటిశరీరము ఎండికట్టయిపో యినదిబంగారమువలెమెరుస్తూఉన్నదేహకాంతిచెడినోటితడియారినిలువుకండ్లు పడ్డదిగాని ఊపిరిమాత్రముతగులుకొని ఉన్నందున కొంచముగావస్తూనుండెను

(౯) [illegible]

తుదకునాలుగోరోజుఉదయమందు(౧౦)ఖాజాఖిబురనేదీర్ఘదర్శనవంటిరూపము
కలిగితేజశ్శాలియైనటువంటినిష్కపటముగలవొకఫకీరుఎదుట ప్రత్యక్షమయ్యెఆ
మెనుచూచి ఓకూతురా నీతండ్రిపాదుషా అయినప్పటికిని నీ అదృష్టము వంకర
గానున్నదనిన్ని అయితే ఇప్పుడుయీముసలిఫకీరునునీకుపరిచారకుణ్నిగా నెంచు
కొనిసృష్టికర్తనుగురించిరాత్రిపగళ్లుధ్యానిస్తేమేలుకలుగుననిన్ని ఉపదేశించితా
నుభిక్షమెత్తితెచ్చుకున్నతాలూకుజోలెలోనున్న రొట్టెముక్కలుతీసి ఎదుటనుం
చినీళ్లకోసరము ప్రయత్నముచేస్తేనుయ్యి ఉన్నదిగానినీళ్లతోడడమునకు చేదుతా
డులేనందున చెట్టుఆకులుకొన్ని కోసిదొన్నెకట్టితనకంఠసూత్రముకట్టితోడి రా
చకొమారెకుకొంచమాహారముపెట్టెను యప్పుడామెకు ప్రాణమునిలువబడ్డ
ది ఆభగవద్భక్తుడు ఆమెవొంటరిగా ఉండడముచూచి చాలా ధైర్యము చెప్పి
నాడుగాని అతడున్ను దుఃఖపడ్డాడు ఆయనచేసిన అపరిమితమయినపరామర్శ
చేత ఆమె స్తిమితపడ్డందున ఆరోజుమొదలుకొని తప్పకుండా ఆయనపట్టణము
లోకివెళ్లి భిక్షాటనమువల్ల దొరికినదియావత్తు ఆమెయెదుట పెట్టడమునకున్ను
ఆమెకు తినిపించడమునకున్ను నిశ్చయించినాడు ఈలాగుకొన్నిరోజులుజరగ
గా వొకరోజున రాచకొమారె తలదువ్వి జటవేసుకోవడమునకుకోరికకలి
గితలవిప్పగానే ఒకఅణిముత్యము అందులోనుంచికిందపడ్డది ఆముత్యము ఆఫకీరు
చేతికిచ్చిపట్టణములో అమ్మమనిచెప్పినందున ఆఫకీరుఅమ్మిఆందలికిమ్మత్తుఆమెకు
తెచ్చియిచ్చెను అప్పుడామెకాలము వెళ్లపుచ్చడానకు ఇక్కడవొకచిన్నయిల్లు
కట్టించుమనియన్నది అందుకాఫకీరు అంగీకరించి ఓచిన్నదానా నీవుమట్టితోవ్వి
పోగుచేయుము వొకరోజుననేను నీళ్లుతెచ్చి మట్టిపిసికి వాయగట్టిఫట్టిగోడువేస్తా
ననెను అప్పుడామె గజములోతుతవ్వగానే భూమిలో వొకగుమ్మముకనపడ్డది
అదితెరిచిచూడగా మొహరులు రత్నములునిండియుండెను ఆమె అందులోనుం
చినాలుగైదుదోసిళ్లమొహరులు తీసుకొనితిరిగి నిక్షేపము మూసివేసినది ఇంత
లోఫకీరువచ్చినందు.. నుంచి కాసీ[illegible]వాండ్లనున్ను వడ్లపనివాండ్లనున్ను కూలి
వాండ్లనున్ను పిలిపించవలసినదనిచెప్పి రేసిగాపున్న (బసరాదేశముయొక్క రాజ
ందిరముతోసరి అయ్యేటటువంటిన్ని (ఖురాసాన్) దేశములో ఉన్నదానికం
విశేషమైనటువంటిదిన్ని (వొకగొప్పరాజమందిరము) ప్రాకారముతోకూ
డులుసత్రము మొదలైనవిన్ని యిగా ఈస్థలమందే తయారుచేయించవలసి
న్నదిగనక ముందుగానానిప్లాను వొకకాగితముమీద క్రమముగావ్రాయిం

(౧౧) ఈయనతురకలలో సాగంగఘరునివంటిసిద్ధుడు.

చితీసుకొనిరావలసినదని తెలియచేయగానే ఫకీరు ఆప్రకారముజరిగించినందు
న లోగిలి తయారుకావడమునకు ఆరంభమైనది మరిన్ని నానాతరహామనుష్యు
లలోనున్న ప్రశస్తమైననవుకరులు చాకరులుకూడాప్రవేశించినారు ఆలోగిలి
తయారుఅవుతూ ఉన్నవార్తక్రమక్రమముగా ఈమెతంత్రిగారికికూడా తెలి
సిమిక్కిలీఆశ్చర్యపడి అదియెవరు తయారుచేయించడమున కారంభించినారని
ప్రతివాదిని అడిగితే ఆస్థితిఏవరికిన్ని తెలియనందున అందరుతమకేమిన్ని తెలియ
దనిచెప్పిరి అప్పుడారాజు వొకపెద్దమనుష్యునిద్వారాతాను ఆలోగిలి చూడడ
మునకువస్తామనిన్ని నీవు ఏదేశపురాచకొమార్తెవో ఏకుటుంబస్థురాల
వో తెలియవలసియున్నదని వర్తమానముపంపించినందున ఆమెచాలాసంతో
షించి ఏలినవారు యీపేదదానియింటికివిజయముచేస్తారన్నవార్త తెలిసిమి
క్కిలిఆనందమైనదనిన్ని అందువల్లనాకుపరువు ప్రతిష్ఠలుకూడాసంప్రాప్తమవు
తున్నదనిన్ని ఈయింటియొక్క అదృష్టమువల్లతమయొక్క పాదరజస్సుసోకడ
ముచేత యిందులోనుండేవారుకూడా కృతార్థులవుదురనిన్ని రేపటిదినముల
క్ష్మీప్రదమైనదికానున్నది విశేషించినావిషయమయి సంవత్సరాది పండుగకం
టేసంతోషకరమయినదిగానున్నందున తమరుసూర్యునివంటివారు గనుక యి
క్కడికివిజయముచేసినయెడలతమకిరణప్రసాదమువల్లఇసుకరేణువువంటినేనున్న
సత్తకలిగిప్రకాశిస్తాననిన్ని నాకుసంభవించినమట్టుకు తమకు నేనుసత్కరించడ
మున్ను అందుకు తమరంగీకరించడమున్ను ఈదీనురాలైననాయొక్కసంరక్ష
ణజరిగించినట్టుఉంటున్నదిగనుక యింతకన్న తెలియచేయవలసినదిఏమిలేదని ఆ
యనతోతెలియచేసి ఆపెద్దమనుష్యునికి బహుమతిచేసి తిరిగిపంపించినది ఆసం
గతివింటున్నే (పాదుషా) విందుకుఅంగీకరించిముఖ్యముగావస్తానని తిరుగావ
ర్తమానముపంపించినాడు అప్పుడు ఆమెతనయావన్మంది నవుకరులకు రాజు
గారుమిక్కిలిసంతోషించేలాగు విందుతయారుచేయవలసినదనిన్ని ఆయనతో
వచ్చేపిన్నపెద్దలందరుకూడా భోజనభాజనమువల్ల సంతోషమును పొందివెళ్ల
వలసినదనియాజ్ఞాపించినందున రుచిగాసమస్తపదార్థములుసిద్ధమయినవి సా
యంత్రముకాగానే రాజు అవుడామీద సవారీ అయివిజయము చేసెను రాచ
కొమార్తెతనస్వతంత్రపుపరివారమునుకూడాతీసుకొనియెదురుగావెళ్లి రాజు
కనపడగానే ఆయనఆశ్చర్యపడేటంత వినయముగావందనముచేసి ఉత్సవము
తోతీసుకొనివచ్చి రత్నసింహాసనముమీదకూర్చుండబెట్టినది మరిన్ని లక్షయిరువై
అయిదువేలరూపాయీలతోకట్టించిన అరుగున్ను నూటవొక్కసంచితోజవా

హీరాలున్ను మొహరులున్ను షాలూలు సెల్లాలు పట్టుబట్టలు ఇంకా తరహాతరహా జలతారుపనిచేసియున్న అనేకవస్త్రములున్ను రత్నఖచితములైన అలంకార ములతో రెండుఏనుగలనున్ను పదిఅరబ్బీగుఱ్ఱములనున్ను నజరుదాఖలుచేసి తాను రెండుచేతులుకట్టుకొని ఎదుటనిలువబడ్డది అందుకుపాదుషా చాలాసంతోషించినీవు ఏదేశపురాచకొమార్తెవు ఏహేతువుచేతఇక్కడికి వచ్చినావనియ యడిగితేరాజకొమార్తెమిక్కిలివినయముగా ఈచిన్నది మేలినవారియొక్క ఆగ్రహముచేత ఈఅడవిలో ప్రవేశపెట్టబడిన పాపాత్మురాలనన్ని ఇప్పుడుత మరుచిత్తగిస్తూ ఆశ్చర్యకరమైనయావద్వైభవముఈశ్వరవిలాసమనిన్ని మనివి చేసినది ఆమాటవింటున్నే రాజుతనయొక్క రక్తము పుత్రికాప్రేమచేత ఉప్పొంగినందున తానులేచి అనుగ్రహముచేతకొమార్తెను కౌగిలించిచెయ్యిపట్టుకొనిసింహాసనముదగ్గరకుర్చీవేయించి కూచుండబెట్టినాడుగానిఆయనవింత పడుతూకుమార్తెలనుకూడాతీసుకొనిత్వరగా రావలసినదని రాణివద్దికివర్తమానముపంపించెను వారువచ్చినతరువాత తోడపుట్టువులుపోల్చి కౌగలించుకొనియేడ్చి భగవత్ప్రార్థనచేసినారు ఈరాచకొమార్తెతల్లికిన్ని ఆరుగురు అప్పచెల్లెండ్లకున్ను ఎంతనగమున్ను జవాహీరున్ను ఇచ్చినదంటే ఈప్రపంచములోనున్న యావద్భాగ్యముదానితాళాకుసహితముచాలదు ఆపింమ్మటపాదుషా అందరినికూడాపిలుచుకొని భోజనముచేయడమేకాకుండా ఆయనజీవించియున్నంతమట్టుకు ఈవిధముగానే యప్పుడప్పుడు తానురావడమున్ను ఆమెనుకూడా వెంటపెట్టుకొని వెళ్లుతూవుండడమున్ను జరిగిస్తూనుండెను ఆయనకాలముచేయగానే రాజ్యభారమునకుమరియెవ్వరు తగినవారులేనందున ఈమెకు దఖలుపడ్డది ఓస్నేహితుడా జరిగినస్థితి ఇదినీవువిన్నావుకదా భగవదనుగ్రహముపల్లకలిగినసంపత్తుకు ఎంతమాత్రమున్ను షోకాలేదుగాని మనుష్యునియొక్కప్రవర్తనబాగుగానుండవలెను విశేషించియెంతఖర్చుచేస్తే అంత అభివృద్ధిఅవుతూవున్నది దేవునియొక్కప్రభావము అశ్చర్యకరమని ఆదాఈనాతో చెప్పిఇకమీరుఎక్కడికివెళ్లి ఆవార్తతేవడమునకు మనస్సునిశ్చయము కలిగిన పక్షమందుత్వరగా వెళ్లవలసినదనిచెప్పెను ఆతత్క్షణమేసెలవుపుచ్చుకొని దేవునియందుభారమువేసిసంవత్సర ప్రయాణముచేసిప్రయాసమీదనీమ్రోజు అనే పట్టణము చేరిచూస్తేగొప్పవాండ్లుకొద్దివాండ్లంతానల్లబట్టలుతొడుగుకొని యుండడమేకాకఅదివరకునేనువిన్నస్థితియావత్తుకూడా చూచినాను కొన్నిదినములు అయినవెనుకచంద్రదర్శనమురోజున ఆపట్టణపుప్రజలందరుస్త్రీలు పురుషులు

న్ను రాజుమంత్రులుయావత్తువొకమైదానముమీద పోగై సారం ఆశ్చర్యపడుతూ తీర్థయాత్రా పరునివలె ఫకీరు వేషము వేసుకొని నేనున్ను ఆసమూహముతో వెంటబడి వెళ్లినిలువబడి ఈమాయయేమిటో కనుక్కొందామని చూస్తూవుంటిని ఇంతలో చిన్నవాడు ఎద్దుమీదనెక్కి కేకలువడిగా వేస్తూనురుగులుకక్కుకొంటూ అడవిలో వొకసుంచివచ్చినాడు నేను ఆయనయొక్క స్థితికనుక్కోవడమునకు చాలా ప్రయాసపడి వెళ్లినప్పటికిన్ని చూస్తున్నె ఆశ్చర్యముచేత నిశ్చేష్టితుడనై ఆపట్టుననే నిలువబడితిని ఆయనమామూలు ప్రకారము అక్కడజరిగించవలసినకార్యములు చేసి వేసితిరిగి వెళ్లిపోయినందున ప్రజలుపట్టణపువైపుతిరిగినాకు తెలివిరాగానే అయ్యోయికవొకనెలపర్యంతముతిరిగి ఎదురుచూస్తూఉండవలెనుగదా అనిపశ్చాత్తాపపడుతూవిధిలేక అందరితోకూడావచ్చినాను ఆనెలంతా (౧౧) (రంజాన్)వలెను ప్రతిరోజున్ను లెక్కపెట్టుకొంటూజరిపినాను మెల్లిగాపండుగవలె రెండోసాలపొడుపువచ్చినందున ఈదఫాఏమైతేకానిబాగాధైర్యము తెచ్చుకొనినిలవబడి ఉండి ఆసంగతికనుక్కొందామని. నిశ్చయించినాను ఇంతలోఆయనవచ్చి మామూలుప్రకారము అందరినిన్ని ఏడిపించి అడవివైపుమళ్లగానే అతనివెనకవడిగా నడుస్తూవెళ్లడమునకుపక్రమించినాను ఆపట్టణపుమనుష్యులు నాచెయ్యి పట్టుకొనియిదియేమిపనిఎరిగివుండిచచ్చిపోతావేమనిన్ని ఊపిరిముక్కుననున్న పక్షమునకుచనిపోవడమునకు అనేకమార్గములున్నవనిన్ని అన్నారు చాలాపర్యాయములు నేను - బతిమాలి దులపరించుకొని వెళ్లడమునకు ప్రయత్నపడ్డాను కాని వాండ్లునన్నువదలక అందులోనలుగురుమనుష్యులుపట్టుకొని ఊళ్లోకిలాగకొనివచ్చిరితిరిగిన్ని నెలరోజులవట్టుకువింతతరహాగలదుఃఖమునసుభవించినాను అంతటకొత్తనెలవచ్చినందున ప్రొద్దునలేచిఅందరికన్నాముందువెళ్లి అడవిలోముఖ్యముగాఅతడువచ్చేదారి కాచిచాటుగానిలువబడియుంటిని ఆయనయథాప్రకారముగావెళ్లికార్యముచేసుకొనితిరిగిపోతూవుండగా నేను వెంటపడ్డాను కాళ్లచప్పుడుచేత ఎవరోవస్తూఉన్నట్టుగ్రహించివొకపర్యాయముఎద్దున్ను మళ్లించి వొక్కకేక వేసినరికివేయవలెననికత్తితీసుకొనినామీదపడ్డాడు నేనుభూమిమీదపడి వినయముగాతలవంచిసలాముచేసి రెండుచేతులుకట్టుకొనినిలువపడ్డాను ఆయననన్నుచూచి ఓఫకీరు నీవువ్యర్థముగాచచ్చిపోదువు అయితే నీకుకొంచమాయుర్దాయమున్నది కాబోలువెళ్లుము ఎక్కడికివస్తావని రత్నఖచితమైనటువంటిన్ని ముత్యాలకుచ్చులుకట్టియున్నటువంటి వొకకయిజారుకత్తితనమొలలోనుంచితీసినా

(౧౧) తురకలురమ్జాన్ నెలలోసాయంత్రంవరకుఉపవాసముచేతురు.

యెదుటపారవేసి ఇప్పుడుతనవద్దనగదుయేమీహాజరులేదనిన్ని అయితే ఇదిరాజువద్దికితీసుకొనివెళ్లియిస్తేనీవుకోరినది సంభవిస్తున్నదనిన్ని అన్నాడు అప్పట్లోభయముచేతకదలడమునకుగాని మెదలడమునకుగాని సంభాషించడమునకుగాని శక్యములేకుండానోరు ఎండిపోయికాళ్లుబలునై అక్కడనేను ఉండిపోయినందున ఆ శూరుడుచూస్తూవెళ్లిపాయను నేనున్ను ఇక నెలపర్యంతము నిరీక్షించిఉండడము మంచిదికాదని తిరిగియిటువంటి సమయముదొరకదని నిశ్చయించుకొని వెళ్లినాను ఆయనతిరిగికోపముతో నావైపుమళ్లినన్ను నిశ్చయముగా చంపివేయడమునకునిర్ణయించినందున(౧౨)ఒకరుస్తుంవంటివీరుడాసాఫుగాతెగిపొయ్యేలాగువాక్కనరుకు నరకవలసినదనిన్ని అందువల్లతనశ్రమనివారణమవుతున్నదనిన్ని ఆ దోషమునీకేమిలేదనిన్ని ఒట్టువేసితలచాచినాను అందుకు ఆయనవొప్పనందుననేనులక్ష్యపెట్టకముందు అడుగువేసినాను ఆయనచూచిచూడనట్టువెళ్లిపోతూ ఉండేటకూడానడిచినానువెళ్లగా రెండుక్రోసులుఅడివిదాటగానే వొకప్రాకారముకనపడ్డది ఆగుమ్మములోకి ఆయనవెళ్లివొకకేకవేయగానే తలుపులు వాటియంతటవీడిపోయినవి అతడు లోపలికివెళ్లికూర్చున్నాడునేను ఇవతల నిలువపడి ఓభగవంతుడా నేనేమిచేతునని విచారిస్తూఉంటేని ఏలాగైతేనేమి కొంతసేపటికివొకగులాముచచ్చి యెదుటికిరమ్మన్నారు నడువుము నీకుమృత్యువు సంప్రాప్తమైనదికాబోలు నీకర్మము యీలాగునునున్నదా అన్నాడు నాఅదృష్టము బాగానేయున్నదని నిర్భయముగా అతనితోకూడా తోటలోకివెళ్లితేతుదకు ఆయనబంగారపుపనిసరుకులు ఎదుటనుంచుకొనివొంటరిగా మసలందుమీద కూచుండిఉన్నవొకలోగిటిలోకితీసుకొనివెళ్లినాడు నేను ఆయనకుచూస్తూనేవంగిసలాముచేసినానునన్ను కూచుండుమనిసంజ్ఞచేసినందున వినయముగా మండివేసుకొనికూర్చుండినాను అప్పుడుఆయనపచ్చలతోచెట్టువొకటితయారుచేసినాడు తీరాలేవపొయ్యేటప్పుడు ఆగదిచుట్టూఉన్నగులాములంతా లోగిటిలోదాగున్నారు నేనున్ను వొకపంచాదితోదూరిపోయినాను తరువాత ఆయనలేచిఅన్నిగదులకుతాళములువేసితోటలోవొకమూలకువెళ్లి తనసవారియెద్దును కొట్టడమునకు మొదలుపెట్టినాడు దానిధ్వనినాకువినపడినందునగుండెలుకొట్టుకొన్నదిగాని ఆ స్థితికనుక్కోవడమునకుకష్టానకైనావొప్పుకొనిజడుస్తూతలుపుతీసివొకచెట్టుచాటుననిలువబడిచూస్తూవుంటేని అప్పుడుఆయెద్దునుకొట్టేకట్టకిందపడవేసిఅన్నితలుపులుతాళాలుతీసిలోపలికివెళ్లితిరిగివెంటనేవచ్చి ఆయెద్దుయొక్క వెన్నుమీద చె

---

(౧౨) రుస్తుంఆనేవాడు తురకలలోభీముడువంటివాడు.

య్యూవేసిదుప్పి మొగముముద్దుపెట్టుకొని గడ్డెడలవలుతీసిపించి యువతిలికివచ్చినా డు నేను అదిచూస్తున్నే వేగముగాపరుగెత్తితిరిగికోట్లోదాగుకొన్నాను అంతట ఆయనరాగానే గులాములు కొందరు చెంబులతో నీళ్లుదీసుకొనిరాగానే ఆయ నకాళ్లుచేతులుకడుక్కొని దైవప్రార్థనచేసి ఆపకీరుయెక్కడనున్నాడని కేక వేసినందున నాపేరువింటున్నే పరుగెత్తిఎదుటనిలువగానే సెలవుఇచ్చినందునసలా ముచేసికూచున్నాను వంటకాలువచ్చినవి ఆయన భోజనముచేసి నాకున్ను ద యచేసినందున పుచ్చుకొన్నాను ఆపిమ్మటఅవితీసివేయగానే చెయ్యికడుక్కొ ని నిమ్మళించుమని ఆయనగులాములకు సెలవుయిచ్చినారు అప్పుడు ఎవరున్ను దగ్గిరలేనందుననన్నుచూచి ఓస్నేహితుడా నీచావునునీవువెతుకుకొంటూతిరుగు తున్నావు అంతవుపద్రవమునీకేమి సంభవించినదని అడిగినాడు నేనునాస్థితిని యావత్తుతెలియచేసి యికమీకటాక్షమువల్ల నాకోరికెకొనసాగించుకోవడము నకుకనిపెట్టియున్నానని అన్నానుఇదివింటున్నే ఆయననిట్టూర్పునిగుడించిపరవశ మైఓదేవుడా మోహముయొక్కబాధనీకన్న ఎరిగినవారుఎవరున్ను లేరని అనడమే కాకుండాఒకనికిపుట్టిననొప్పి రెండోవానికి తెలియనివిధముగా మోహమువల్లసం భవించేఆపదఅనుభవించేవానికితప్ప యితరులకు తెలియదనిన్ని అర్థముగ లరెండుశ్లోకములుచదివితరువాత మరియొకనిమిషమునకు తెలివితెచ్చుకొని గుం డెకాలి వొక్కకేకగనులలో ప్రతిధ్వని యిచ్చేలాగువేసెను అతడున్నునావలె నే మోహముచేబాధపడుతూఉన్నట్టునాకుతోచినా స్థితియావత్తుతమతోమనవి చేసినాను అనుగ్రహించితమయొక్కవృత్తాంతముతెలియచేసిన పక్షమందుశక్తి వున్నమట్టుకు ముందుగా మీనిమిత్తమైశ్రమపడి మీకోరికసిద్ధింప చేస్తాననగానే అతడు తనరహస్యమును ఆయాసమునుగురుతెరిగినవాణ్నిగా నన్నుగ్రహించి తనస్థితి ఈవిధముగాచెప్పడమునకుపక్రమించెను ఏమంటే ఓస్నేహితుడా ఈ మోహవేదనతోనున్ననేను ఈ (సీమోర్జు దేశపురాజుకొమారుణ్ని) నేనుపుట్టి నతరువాతమాతండ్రిగారు జ్యోతిషకులనుమాంత్రికులను పండితులను పోగుచే సినాయొక్కగ్రహచారమెలాగుననున్నదోచూచికోటీతయారుచేసి ప్రతినిమిష మునకు ఏమేమిజరుగునో ఆవివరము తెలియచేయవలసినదని యాజ్ఞాపించినం దున వారుశాస్త్రదృష్టిచేనాలోచించి భగవదనుగ్రహముచేత నేను జననమైన లగ్నఫల మెటువంటిదంటే (౧౩) సెకెందరుపాదుషావలె రాజ్యమున్ను

---

(౧౩) ఈ సెకెందరుపాదుషా చక్రవర్తియని పేరునుపొందెను - ఈయననుయింగ్లీషు వాండ్లుఅలగ్జాండరని-యందురు.

(౧౪)నవ్షేరవాన్‌వలె న్యాయపరిపాలనమున్ను జరిగిస్తాననిన్ని అన్నిశాస్త్రములుగ్రహిస్తాననిన్ని తలచినకార్యము చేస్తాననిన్ని ధర్మమందును ధైర్యమందును (౧౫) హాతేమునున్ను (౧౬) రుస్తుమునున్ను ప్రజలుమిగిచేలాగుకీర్తి ప్రతిష్టలను పొందుతానన్ని అయితేపదునాలుగుసంవత్సరములలోగారవిచంద్రదర్శనమయితే వెట్టియెత్తి అనేకులనుచంపుతాననిన్ని గ్రామమువిడిచి అడవిలో ప్రవేశించిమృగపక్షిజాలములతో కాలక్షేపముచేస్తానని తెలియచేయగానే మాతండ్రిగారునానిమిత్తము ఈతోటకుపునాదివేయించి అనేకతరహాలుగలలోగిళ్లు అందులోకట్టించినన్ను నేలమాళిగలోనుంచి పెంచవలసినదని యాజ్ఞాపించి యెంతమాత్రమున్ను ఎండవెన్నెలతగలకుండా డాబాకూడాకట్టించినారున్ను అందులో ఉంచిపాలదాయీలుమొదలైనవారినిసంరక్షించడమునకు ఉంచినారునాకుసమస్తశాస్త్రములను ఉపదేశించడమునకై తెలిసిన అయ్యవారినినిర్ణయించితండ్రిగారు ఎల్లప్పుడునాభోగట్టాలోఉంటూవచ్చినందున ఏనిమిషముజరిగినస్థితి అప్పుడేమనివిచేస్తూనుండిరి నేను ఆయిల్లేప్రపంచమనుకొని లక్క-పిడతలు తరహాతరహా పువ్వులుపెట్టుకొని ఆడుకొంటూనుండేవాణ్ని మరిన్ని ప్రపంచములోరుచిగలవస్తువలుయేదికోరితేఅదియిచ్చుచుండిరి పదిసంవత్సరముల వయస్సుకాగానేసమస్తశాస్త్రములుగ్రహించినానువొకరోజునఆడాబాకిందికిటికీలోనుంచి వింతైనవొకపుష్పను అగుపడిచూచినట్లొద్దిపెద్దదైనదిదాన్ని నేను అందుకోవలెనని చెయ్యిచాస్తేమరింతపొడుగైనది నేను ఆశ్చర్యపడిచూస్తూవుండగా అక్షణమేపకపకనవ్వినధ్వనివినపడ్డదిమెడయెత్తిచూస్తే ఆడాబాబద్దలుచేసుకొనిచంద్రునివంటిముఖము బయలుదేరినది చూడగానే నాయొక్కబుద్ధిన్ని తెలివిన్ని స్థానముతప్పిపోయినవి తిరిగీస్మృతితెచ్చుకొనిచూస్తే వొకరత్నసింహాసనమును (గంధర్వులు) భుజములమీదతగలకుండా అర్థాంతరముగానిలువబడిఉన్నది అందులోవొక (స్త్రీ) రత్నఖచితమైనకిరీటముధరించివెలగలజలతారుపోషకుశరీరందుధరించి చేతులో కెంపులగిన్నెపట్టుకొని సురాపానముచేస్తూకూచుండియున్నది ఆసింహాసనముమెల్లిమెల్లిగా కిందికిదిగి డాబామీదికివచ్చినవి అప్పుడుఆగంధర్వస్త్రీనన్నుపిలిచితనదగ్గిరకూచుండపెట్టుకొనిముద్దుముద్దుమాటలాడుతూ ముఖానముఖము తగిలించుచు గులాబీపన్నీరుతో చేసిన ఆసవముగిన్నెడు నాకుతాగించి మనుష్యజాతివిశ్వాసహీనులుగాని తనమనస్సు

(౧౪) వొకటోఫకీరుకతలో- వొకటోరిమాకుచూడవలెను. (౧౫)(౧౬) ఈఫకీరుకతలో ౧- ౧౧ రిమాకులుచూడవలెను(౧౭)ఫకీరుకతలో ౭ రిమాకుచూడవలెను.

నీయందులగ్నమైఉన్నదనగానేమరిన్నిదాన్ని మోహింపచేటంతమృదువైన చమత్కారపుమాటలుమాట్లాడినందున యాగంధర్వస్త్రీకిమిక్కిలి మోహకరమైనది అప్పుడేనాకు అత్యానందము కలిగిప్రపంచమునకు వచ్చినట్టు తలంచినాను అప్పుడుఆస్థితియెవరుచూడడమునకు వినడమునకు అవకాశము కలగనందున ఆ సంతోషముతోమనస్సును స్థిమితపరుచుకొని ఉభయులమూమాటలాడుతూనుంటిమి ఇంతలో (రామాయణములో) పిడకలవేట్లాటవలె ఆపద సంభవించినది యేమన్నంటే నలుగురుగంధర్వులు ఆకాశముమీదనుంచి దిగియేమిటోఆప్రియురాలి చెవిలోచెప్పిరివింటున్నదానియొక్క ముఖవర్చస్సుతప్పి ఓప్రియుడా కొంతసేపునీదగ్గరకూర్చుండి కాలక్షేపము చేతామనిన్ని ఈవిధముగానే యెప్పుడు రావడమైనాలేకనిన్నుకూడాతీసుకొని వెళ్లడమైనాజరిగింతామని కోరికకలిగియున్నదిగాని ఇద్దరిని ఒకచోటసంతోషముగా నుండనీయదు యిప్పుడు నేనువెళ్లిపోతానుగనుక నిన్ను భగవంతుడురక్షించవలెననియన్నది ఆమాటవినగానే ప్రాణములునిలవకచేతులోనున్నచిలుక ఎగిరిపోయెనుగదాయని ఆమెనుచూచిఓప్రియురాలాతిరిగిమనముఎప్పుడుకలుసుకోవడమనిన్ని ఎంత ఉపద్రవకరమైనమాట చెప్పినావనిన్ని త్వరగావచ్చినట్టయితే నేను జీవించుటచూస్తావనిన్ని లేకుంటే పశ్చాత్తాపమునుపొందుతావనిన్ని నీవుండేస్థలమున్ను పేరున్ను ఆనవాలైనా చెప్పితే ఆజాడలమీదవెతుకుకొంటూవచ్చినీవద్దప్రవేశిస్తాననిన్ని అన్నానుఅదివింటున్నఈమాట (౧౨) సైతాన్ చెవినిపడకపోవలెను అనిన్ని దేవుడునీకు నూటయిరువైయేండ్లు ఆయుర్దాయమునివ్వవలెననిన్ని తానున్ను జీవించిఉన్నపత్తుమందుతిరిగికలుసుకొంటాననిన్ని నేనుకాసీఅనేగంధర్వరాజకన్యకను హిమవత్పర్వతప్రాంత్యమందునుంటాననిన్ని చెప్పి ఆసింహాసనముపైకితీసుకొని వచ్చినట్టుగానేయెగిరిపోయినదికనపడ్డంతమట్టుకు ఒకరినొకరు చూస్తూనుంటిమి కనపడకపోగానేస్మృతిజ్ఞానములు రెండున్ను తప్పిప్రపంచము యావత్తున్ను కండ్లకుచీకటిగాకనపడ్డది దుఃఖముచేతపలుమారుఏడ్వడము నెత్తిమీదబుగ్గిచల్లుకోవడము బట్టలుచించివేయడము భోజనమందుఆసక్తిలేకుండానుండడము మొదలైన ఈ మోహముయొక్క తొందరలు కలిగియున్నందున ఈస్థితినాదాయీలు మొదలైనవాండ్లుకనుక్కొనియేడుస్తూపాదుషాఎదటికివెళ్లి యేమో తెలియదు మన చిన్నవానికితనంతటతానే ఉపద్రవముసంభవించి భోజనములేకుండాపోయినదనిమనవిచేసినారు అదివింటున్నరాజువిశేషజ్ఞానులైనపకీరులనున్ను ప్రాజ్ఞులైన పెద్దలనున్ను బుద్ధిమంతులైనవైద్యులనున్ను నిజమైనజోస్యులనున్ను పవిత్రులైన

ఫకీరులనుకూడా తీసుకొని నేనునివసించియున్నతోటలోకె విజయముచేసి సాక్షా
ముచూచి ఆయనమనస్సున వైకల్యమునుపొంది కంటతడిపెట్టినన్ను కౌగిలించుకొ
ని ఇందుకుసాధనముచేయవలసినదని వారితో సెలవిచ్చినందున వైద్యులువొౌష
ధములు ప్రయోగించడమున్ను మాంత్రికులు మంత్రించి విభూతి చల్లడమున్ను
జ్యోతిష్కులుగ్రహశాంతిదానములు చేయించడమున్ను ఉపక్రమించడమేకా
క ప్రతివారు తమతమశాస్త్రసంబంధమైన విధులుకూడా చెప్పుతూవచ్చిరిగాని
నాకుసంభవించిన హింసనామనస్సుకుమాత్రమే తెలుసును ఎవరుచేసిన ప్రయ
త్నము నాదురదృష్టముచేత కార్యకారికాలేదురోజుకురోజు వెఱ్ఱియెక్కువై అన్న
పానములులేకశరీరము నీరసించిరాత్రిపగలు ఏడవడముపనియైఉండేది ఈవిధ
ముగామూడు సంవత్సరములుజరిగెను నాలుగోసంవత్సరమునందు ఒకసాధా
గరుదేశముతిరుగుతూ తరహాతరహాకలిగినటువంటి చమత్కారమైన అనేకవ
స్తువులుమాతండ్రిగారిసన్నిధికి తీసుకొనివచ్చియిచ్చి దర్శనముచేసినాడు రా
జుమిక్కిలికటాక్షించి అతనితో మీరుచాలాదేశములు చూచినారుగదా ఎక్క
డనైనా శాస్త్రజ్ఞానముగల వైద్యుడుమీకు కనపడ్డాడా లేదామీరువినియైనా ఉ
న్నారా అనిఅడిగినారు అందుకుఅతడు ఓమహారాజా హిందుస్తాన్ దేశములో
సముద్రతీరమందు వొకకొండపక్కగొప్ప దేవాలయమున్ను విశాలమైన లోగిలి
న్నిప్రశస్తమైనతోటఉన్నది అందులోవొకబైరాగీ సమస్తరోగములు బాగు
చేస్తున్నాడు ఆయనఇప్పటికాలములో (౧౮)అఫ్లాతూన్ అనిచెప్పవచ్చును
భగవంతుడు అతడికిఅమృతహస్తమునిచ్చినాడు వొౌషధముపుచ్చుకోగానే రో
గముని శ్శేషమవుతున్నదనేస్థితినేను స్వయముగాకండ్లచూచినానని మనివిచేసి
నందునఆగోసాయివల్లనాకు ఆరోగ్యముకలగవచ్చునని మాతండ్రిగారు నిశ్చ
యించిబుద్ధిమంతుడైనవొక అమీరునున్ను కావలసినసంభారములతో నాకుత
యనాతుచేసివాడలమీదరవానాచేసినారు క్రమముగా అక్కడికి ప్రవేశించినా
ముఘాతత్వముతప్పించడముచేతను గాలితగలడముచేతను కొంచెంమనస్సు స్థి
మితపడ్డదిగానిమాటలులేకవుండడము తలతిప్పడముమాత్రమువదలలేదు మరి
న్ని ప్రతినిమిషముఆగంధర్వస్త్రీధ్యానమేకాని వేరేలేదు ఎప్పుడైనా నోరువి
ప్పితేతనకుతెలియదు ఏగంధర్వస్త్రీదృష్టితనమీదపారగానేబాగా ఉన్నమన
స్సుఇంతలోచెడ్డదనిఅర్థముగలశ్లోకముబయలుసేరినది ఏలాగైతేనేమి రెండు
మూడునెలలుఆకొండమీదఅయ్యేసరికినాలుగు వేలమందిమట్టుకు రోగులుజమా

---

(౧౮) అఫ్లాతూన్ అనే అతడు తుంటకలలో క్రియలుయిచ్చేసిద్ధుడు.

యుంచినారుభగవంతుడుదయచేసినపక్షమందు ఆసన్యాసి శివరాత్రికిమామూ
లుగామఠములోనుంచి బయలుదేరిఇవతలకివచ్చి సెలవివ్వడముతోనే నిమ్మళము
గానుంటున్నదని వారందరుకాచియుండిరి ఆరోజున్నువచ్చినది ఉదయాననే ఆ
యనసూర్యునివతేబయలుదేరి సముద్రములోస్నానముచేసి యీదుతూ అవతలి
వొడ్డుకువెళ్లితిరిగివచ్చిశరీరాపాదమస్తకపర్యంతము విభూతిధారణ చేసుకోవ
డముచేతఎఱ్ఱనిదేహకాంతినిగురుకప్పిన నిప్పువలెదాగినది నుదటచందనపుబొట్టు
పెట్టిగోచికట్టిఅంగవస్త్రము భుజముమీదవేసుకొని గెడ్డముమువ్వకొంచుజడ
లువిరియపోసుకొని పాదకులుతోకొంచు రత్నఖచితమైన కలందాను చంక
లోనుంచుకొనిబయలుదేరివస్తూ ప్రతివారివైపుచూస్తూమాత్రనాడి మొదలై
నపరీక్షచేస్తూవౌషధమునిస్తూ నావద్దికివచ్చినన్నుచూస్తూనే ఆలోచనబలమై
తనతోనన్నురమ్మనందునకూడావెళ్లినాను అంగరికార్యములు స్రుష్టచేసి పంపిం
చినన్నుతోటలోకితీసుకొనివెళ్లివొకగదిలోనన్ను ఉండమనిచెప్పి తానులోపలికివెళ్లి
నలభైరోజులు అయినతరువాతతిరిగివచ్చినాకు కొంచంగుణముగా నుండడము
చూచిఆయనచిరినవ్వునవ్వి ఈతోటలోమీరువిహారిస్తూకావలసినఫలములు భక్షి
స్తూవుండవలసినదనిచెప్పి లేహ్యముసిండానింపిఉన్నవొక చీనాదేశపుగాజు జాడీ
నాకుఇచ్చి ఈవౌషధముతప్పకుండా ప్రతిరోజునన్ను పరగడుపునఆరుచిన్నమో
లచోప్పునపుచ్చుకొంటూనుండవలసినదని కూడాసెలవిచ్చివెళ్లెనునేను ఆప్రకా
రముజరిగించినాను రోజుకురోజుకుశరీరపుష్టిన్ని మనస్తిమితమున్ను కనపడ్డదిగాని
స్వతంత్రమైనమోహమునకు యేసాధనముకనపడక ప్రియసురాలియొక్కరూ
పమునాయెదుటనేతిరుగుతూనుండెను వొకరోజునతీరువలోవొకపుస్తకపు సం
చికకనపడ్డందునతెరిచిచూస్తే సముద్రముయావత్తువొకకూజాలో నింపినట్టుగా
ఇహపరసాధనమైనసమస్తశాస్త్రములు అందులోసమకూర్చివ్రాసిఉండెను ఎ
ల్లప్పుడు అదిచదువుతూవైద్యశాస్త్రము వశీకరణవిధముగ్రహించినాను తిరిగిభై
రాగితనస్థానములోనుంచి బయలుదేరేదినము వచ్చినందుననేనువెళ్లి వందనము
చేస్తేకలందానునాచేతికిచ్చిరమ్మనిచెప్పినందున కూడావెళ్లినాను అప్పుడు గుమ్మ
ముదాటిరాగానే నావెంబడిగావచ్చిన అమీరున్ను సౌదాగరున్ను ఆగోసాయి
పాదములమీదపడి మీకటాక్షమువల్లఇంతమట్టుకుబాగుపడ్డదని స్తోత్రముచేసి
నారుఆయన మామూలు ప్రకారము సముద్రములోస్నానముచేసి సంధ్యా
నుష్ఠానములుజరిగించుకొని నిలవబడిరోగులనుచూస్తూపూర్వపుతరహానేజరిగిం
చినారుఇంతలో వెట్టివాండ్లసమూహములో నీరసముచేతనిలువలేకుండావున్న

చక్కనిచిన్నవాడుకనపడ్డందున ఆసన్యాసినావైపుచూచి ఇతణ్ణిమాత్రముతూ
డాతీసుకొనిరావలసినదనిచెప్పి శతిమ్మావాండ్లకుమందుఇచ్చి లోపలికివెళ్లి ఆరో
గియొక్కబ్రహ్మరంధ్రముచీరిమెదడుమీదనున్నజెట్టీని (చింటాతో) తీయడమున
కునిశ్చయించినాడు ఆచింటాకాల్చి జెర్రిపీపుమీదనుంచితేతనంతట నడవస్తున్న
దిలాగితేమెదడు పట్టుకొనివదలనియెడల ప్రాణహానిసంభవించునని అన్నాను
అదివినియితడుతనకన్నా బుద్ధిమంతుడనియెంచి నావైపుచూచి మాట్లాడకుండా
తోటలోకివెళ్లివొకచెట్టుకొమ్మకు జటతోనురివేసుకొని వేలాడుతూనుండెను నేను
దగ్గరకువెళ్లిచూస్తేఆబైరాగిచచ్చియుండెను ఈవింతచూచిమిక్కిలి విచారపడు
తూవురిలోనుంచితప్పించిఖననముచేతామని దించేవరకు రెండుతాళపు చెవులు
అతనిమొలలోనుంచికిందపడ్డందున వాటనితీసుకొని ఆసుగుణనిధిని భూస్థాపన
ముచేసి[illegible]రెండుతాళపుచెవులుపట్టుకొనివెళ్లి అన్నిటికితగిలిస్తే రెండుగదులకు
అమిరినందున తెరచిచూస్తే నట్లుమొదలుపెన్నెసట్టెపర్యంతము జవాహీరు
తోనింపియున్నవిమరిన్ని ముఖమలుతో చుట్టినబంగారపురేకులుతగిలించి తాళ
మువేసియున్నవొకపెట్టెయుండెను అదితీస్తేఅందులోఈశ్వరతత్వమున్న దేవరా
క్షసపిశాచగణవశీకరణాని ధ్యానమున్నసూర్యసశ్యముమొదలైనవి వ్రాసినపుస్త
కముకనపడ్డది ఆభాగ్యముచేతికిదొరికినందున చాలాసంతోషించి ఆప్రకారము
యింటికిపోయినడవడమునకు నుపక్రమించిసౌదాగరుకున్ను తెలియచేసి వాడ
లుతెప్పించుకొనియావత్తునగదుపుస్తకములువాడమీదవేసి మేమున్నసవారీనై
స్వస్థలానకురాగానేరాజుగారుగుఱ్ఱపుసవారినై యెదురుగావచ్చిమిక్కిలి ప్రే
మచేతకౌగలించుకొన్నారు నేనుఅతడిపాదములనుముద్దుపెట్టుకొని పూర్వపు
తోటలోనుండడమునకుసెలవుఅడిగితే ఓచిరంజీవిఆస్థలముఅచ్చిరాదని తోచిమ
రమ్మతుచేయనందున దిగడమునకుతగియుండదు కోటలోఏస్థలము అనుకూలమని
తోస్తేనాయెదుటదిగిఅక్కడిప్రద్యానవనము బాగుచేయించుకొని విహరించవ
లసినదనిసెలవిచ్చిం నేపట్టినపట్టువిడువకనందునఆతోటనేమరమ్మతు చేయించిస్వ
ర్గమువలెశృంగారించిఅందులోప్రవేసింపచేసెను నిశ్చింతగాజిన్నుఅనగా గంధ
ర్వరాజవశీకరనిమిత్తము ఆహారమువర్జించితపస్సుచేయడమున కుపక్రమించి
నానుసలబై దినములుకాగానేవొకరోజుననిశిరాత్రియందు ప్రచండమైనవొకగా
లివిసరగానేగంధర్వసేనతోకూడావొకసింహాసనముకిందికిదిగినది అందుమీదవొ
కవైభవముకలిగినమనుష్యుడొకడుముత్యాలటోపిన్ని అంగిన్నివేసుకొనికూర్చుం
డియుండెనుఅతణ్ణినేనుచూస్తున్నేవినయముగా అతనికిసలాముచేసినాను నాస్థ

లామఁఅందుకొనిఓస్నేహితుడా ఎందుకు నిద్రాభంగాకష్టపడ్డావు నీకోరికయేమో చెప్పవలసినదనియన్నాడు అందుకునేనుచాలారోజులనుంచి నీకోమాతెలను మోహించియున్నానుఅందునుంచేచాలాచెడి జీవన్మృతుడనైయున్నాను యిక మీరుకటాక్షించినపక్షమందుమీకు పుణ్యముకలుగుతున్నదని మనవిచేసినాను అందుకుమనుష్యులుమట్టిచేతను మేముయగ్నిచేతను చేయబడినందున ఈరెండింటికిసంబంధముకలగడముకష్టమన్నందున నేను ఆమెనుచూడడమునకేకాని వేరేకోరిక లేదని ప్రమాణముచేయగానే అతడుమనుష్యులితమవాక్య పరిపాలనసేయరని న్నిసమయమువచ్చినప్పుడుఅన్నిచెప్పుదురుగాని జ్ఞాపకముతెచ్చుకొనని ఒకవేళ వేరేతలంపుచేసినపక్షమందు వుభయులుచెడిపోవడమేకాకుండా ప్రాణహాని కూడాసంభవిస్తున్నదనిజవాబుచెప్పినాడు నేనుఅతనితో హానికరమైన [illegible] యెవ్వముసేయననిన్ని ఆమెనుచూస్తూఉంటానని అన్నానుఈమాటలుసాగుతూగుండగానేఅవశ్యముగాఆస్త్రీశృంగారించుకొని వచ్చినది అంతలోగంధర్వరాజుసింహాసనము వెళ్లిపోయినది నేనామెనుదగ్గరకుకౌగలించుకొని సంగీతలవంటికనుబొమలుగల స్త్రీనాయింటికిఎందుకురాదుఆమెనిమిత్తమేకదా ఈతపస్సుచేసినానని అర్థముగల వొకశ్లోకముచదివినాను ఆసంతోషముతో నేమేము ఉభయులముఆతోటలోకూచుండిభయముచేతమరియేపనిసేయకుండాచిన్నపిల్లలలాగున ఆడుకొంటూనుంటిమి నేనాఖరారుచూపునసహపడుముచేత ఆశ్చర్యపడుతూ వొకప్పుడు ఓప్రియుడా నీవు నిజమాడేమనుష్యుడవు అయితే ఆపుస్తకము బహు జాగ్రతగాకాపాడుకోవలసినది (జిన్న) నీవుపరాకుగాసుండడముకనుక్కొనియే మాయోపాయముచేతనైనాయెత్తుకొనిపోనుగనుక స్నేహధర్మముచేత యీ మాటనీతో చెప్పినానన్నది ప్రాణముతోసమముగాసుంచుకొందునని చెప్పినాను యింతలోవొకరాత్రి (సైతాన్) అక్రమముగానన్నుప్రోత్సాహపరిచినందున ఇంద్రియవికారముచేత ఏమైతేకానీఎంతపర్యంతము ఓరిమిచేయగలననిమనస్సునఆలోచించి ఆమెనునాగుండెలమీదికితీసుకొని సాంగత్యముచేసినాను అప్పుడే ఈశ్వరతత్వమువ్రాసిఉన్నఆపుస్తకము తనకు యివ్వవలసినదని వొకధ్వనివినపడ్డది ఆమదముచేత వాడలెరుంగకున్నందున పక్కలోనున్నపుస్తకముతీసినేను ఎరగనటువంటిన్ని వొకనిచేతికియిచ్చి నాపనినేను చేసుకొంటూనుంటిని అప్పుడామెనేజరిగించినబుద్ధితక్కువపనిచూచి అయ్యోపనికిమాలినవాడా నీకుచేసిన ఉపదేశముమరిచిపోతివి ఏమిచేతునని వొడలువిరుచుకొనిపడిపోయినది ఆమెతలవైపునఆపుస్తకముచేతులోనుంచుకొని వొకదేవతనిలువపడియున్నందునపట్టుకొ

నికొట్టి ఆడేలాకొండామని ఆలోచించినాను ఇంతలోమరియొకటి ఆఫు స్తక
ముపట్టుకొనిపారిపాయను నేనువిచారపడుతూమంత్రోచ్చారణచేసేవరకు ఆ
క్కడనిలువబడియున్న (జిన్ని)యొద్దుఅయినదిగాని ఆప్రియురాలికిఎంతమాత్ర
ము తెలివిరాలేను తరువాత ఆ స్త్రీమాయమైనది అందువల్లనాస్థితిఱిక్కిలీ చెడిపో
యిమనస్సుతొందరపడి ఎంతమోసమో అంతదుఃఖము సంప్రాప్తమైనది ఆ
గోజునుంచిమనుష్యులయందు అసహ్యముపుట్టి ఈతోటలోవొకమూలపడియుం
డి ఊసుపోవడమునిమిత్తము పచ్చలతోవొకచెట్టు చేస్తూవుండడమేకాక ప్రతి
నెలకుఇయెద్ద మిపసవాఁఅయినీవుచూచినమైదానముమీదికివచ్చిఆచెట్టును అక్క
డచెడకొట్టిగలాములుచంపివేస్తూ ఎవరైనా నాస్థితిచూచికనికరించి నావిషయ
మై ఆశీర్వచనముచేస్తే నాకోరిక కొనసాగుతున్నదనికూడా నిరీక్షించుచుంటిని
నావిషయమైమాతండ్రి మొదలైనవారంతా విచారముచేత నల్లబట్టలు కప్పుకొ
నివస్తూవుండెవారు వోస్నేహితుడా నాయొక్కవెఱ్ఱికన్ని అజ్ఞాతకున్నకారణ
ము ఇదిమీరు విన్నారుకదా అని అన్నాడు నేను వింటున్నే దుఃఖించి ఓరా
జకుమారుడా నీవు మోహముచేత పరితాపమును పొందుతున్నావు అయితే
భగవంతునిఎదుట ప్రమాణముచేసిచెప్పెదను నాకార్యమేదోఅదిఅయినదియిక
నీకొఱకు అడవులలోకొండలమీదతిరిగనాశక్తిమట్టుకు కార్యముచేస్తానని ఆయన
వద్దసెలవుపుచ్చుకొని అయిదుసంవత్సరములపర్యంతము వెఱ్ఱివానివలె యిసక
గాలిస్తూతిరిగినానుగాని యేమిమచ్చు అయినదొరికినదికాదు తుదకు విసికి వొక
కొండమీదనెక్కిపడితే ఎముకలువిరిగి చనిపోతానని నిశ్చయించుకొని తీరా
తయారుపడేవరకు వొకటోఫకీరువు అడ్డుపడ్డఆమహాపురుషుడే నాకున్నప్రత్యక్ష
మైబోధపరిచినందున నేనున్ను ఇక్కడికిచేరుకొన్నాను ఈప్రకారముగా రెం
డోఫకీరుతనదుఃఖ ము వెళ్లపోసేటప్పటికి తెల్లవారినందున ఫాదుషా ఎవరికితెలి
యకుండాతిరిగి కోటలో ప్రవేశించి నిత్యకృత్యములుచేసుకొనిముస్తాబై సింహా
సనముమీదకూచుండి ఊరువెలపల ఫలానిస్థలమందు నలుగురుఫకీరులు కూ
చుండియున్నారు వారినివినయముగా తీసుకొని రావలసినదని చోపుదారుల
నుపంపించెను వాండ్లువెళ్లి ఈసంగతివనివిచేయగానే ఆయనప్రపంచమునకు
మాత్రమేరాజుగాని మామనస్సుకు రాజుకాడనిన్ని అందుకుమేముస్వతంత్రు
లమైయున్నందున ఫాదుషాతో మాకేమిపనిఅనిన్ని అన్నారు అందుకువాండ్లు
భగవద్భక్తులారా మీకేమిన్ని నష్టములేదు రావలసినదనితిరిగి మనవిచేస్తేవూ

ర్వము (౧౯) షవ్రులొమ్మతుజాలీవారుచెప్పినమాటలనలుగురికిన్ని జ్ఞాపకమువచ్చిరాజదర్శనానకు వెళ్లిరివారిని వినయముగా సలాముచేసి కూర్చుండబెట్టి పూర్వోత్తరముయావత్తుతెలుసుకొని అనుకూలముగా భోజనమజ్జనాదులు జరిగించినడిచినరాత్రి తమసన్నిధినిమీకు తెలియకుండాదాగియుండి ఇద్దరిచరిత్రలనుమాత్రమువిన్నాననిన్నితతిమ్మాఇద్దరున్ను తమస్థితి తెలియచేస్తేవిని సంతోషిస్తాననిన్ని అనగానే వారుసిగ్గుపడి ఊరక్కెఉన్నందున ప్రతివారికిన్ని ఒకానొకచిత్రముకనపడుతున్నదనిన్ని తానుపాదుషాహైనప్పటికిచూచియున్నది అగుపరుస్తానుగనుక ముందుగా అడిచిత్తగించితరువాతమీరుసెలవివ్వవచ్చునని తెలియచేస్తేమంచిదని ఆఫకీరులన్నందునఅతడీవిధముగాచెప్పడమునకువక్రమించెను.

రెండోఫకీరుకత - సమాప్తము.

---

ఫాదుషా - ఆజాదుభఖ్తు చెప్పినకథ.

ఓఫకీరులారా రారాజుచెప్పేకథనువినడముచూచినది విన్నదియావత్తునేను పెద్దలసన్నిధినిచెప్పెదశ్రద్ధగాచిత్తగించండీ,

మాతండ్రిగారుకాలంచేయగానేమేముసింహాసనమెక్కినాము అప్పటిలో మిక్కిలి బాల్యదశలోనున్నప్పటికిని (రూందేశము) యొక్కయావదధికారము మాచేతచిక్కివుండెను ఇంతలోఒకసంవత్సరము (౧) బదఖషాన్ దేశమునుంచి ఒకవర్తకుడువిస్తారముగాసామానులుపట్టించుకొనివచ్చినందున ఆగొప్పవర్తకుడుపట్టణములోకి ఎప్పుడురాలేదని చోపుదారులుమాసన్నిధిలో తెలియచేసిరిమేముఅతణ్నిపిలిపించగానేఅతడుసమస్తదేశములతాలూకు(వస్తువులను)మాఎదుటికితీసుకొనివచ్చివుంచగానే ప్రతివస్తువులువిశేషమైనదిగా కనపడ్డది విశేషించి ఒకడబ్బీలో మాణిక్యమునుంచిరంగున్ను నీరున్ను కలిగి అయిదుతులములఎత్తుకలదిగానుండెను మేము ఇంతమహదైశ్వర్యవంతులమైనప్పటికిని ఇటువంటిరత్నమును ఎప్పుడుచూడడముగాని వినడముగాని లేనందునదాన్నిఆసౌదాగరువద్ద క్రయానకుపుచ్చుకుని బహుమతీలు చేయడమేకాకుండా మాదేశమంతట హాసీలునిమిత్తములేకుండాచేసి పారాచవుకీలుఇస్తూవుండవలసినదని రహదారిచీటికూడావ్రాయించి ఇచ్చినాము ఆవర్తకుడు మర్యాదలు ఎరిగినవాడున్న

---

(౧౯) వొకటోఫకీరుకతలో ౨౩ రిమార్కుచూడవలెను.

(౧) బదఖషాన్ అనేఫారసీఖండములో ఖురాసాన్ దేశములోవొకభాగము.

మంచివక్తయున్ను అయియున్నందున ఎప్పుడున్ను ఖచేరిచేసేటప్పుడు మాసన్ని
ధినికని పెట్టేవుండేవాడు సేమలీ (మాణిక్యమును) ప్రతిరోజున తోషేఖానాలో
నుంచి తెప్పించి పెద్దమనుష్యులనందరికిన్ని కనపరచేవారము వొకరోజున మేము
విశేషమయిన సభచేసికూచున్నప్పుడు మారాజ్యపుతాలూకు గొప్పవుద్యో
గస్థులుతమతమస్థలములయందు నిలువబడియుండడమేగాక ప్రతిదేశపు రాజుల
యొక్క రాయభారులుకనిపెట్టియుండిరి అప్పుడు మామూలుప్రకారమ్ము ఆర
త్నమును తెప్పించిచేతులోనుంచుకొని స్తోత్రముచేయడమున కుపక్రమించి జా
తులవారిదేశపురాయభారిచేతికిచ్చినాము ఆయన అదిచూచిచిరునవ్వునవ్వి ము
ఖప్రీత్యర్థముకొనియాడినాడు ఈవిధముగానే వొకరిచేతులోనుంచివొకరు
పుచ్చుకొనిచూచి ఏలినవారియొక్క అదృష్టముచేతసంభవించినదిగాని మరియే
రాజులకు ఇటువంటిది దొరకలేదని ఏకవాక్యముగాపలికిరి అప్పటిలో మిక్కిలి
బుద్ధిమంతుడై సమాతంద్రినాటి వజీరుమావద్ద ఆపనేచేస్తూవున్నందున తనస్థాన
మందునిలువబడిసలాముచేసి ప్రాణసంరక్షణచేసేఎడలమనవిచేస్తానంటె సెలవి
చ్చినాము ఓమహాప్రభో వొకరాతినిపట్టుకొని తామింతస్తోత్రముచేస్తారు వ
ర్ణనమున్ను వొన్నత్యమున్ను అప్రతిగారాళ్లలోకలిగియున్నప్పటికిని రాయి
రాయేగానిమరియొకటికాదువిశేషించి ఇప్పటిలోసమస్తదేశములతాలూకురా
యభారులుదర్బారులో హాజరుగానున్నందునవారుతమతమపట్టణములకు వెళ్లి
నప్పుడు ఎక్కడనోదొరికినవొకమాణిక్యమును చేతపట్టుకొని దాన్ని మరియెక్క
డాలేనిదిగా నెంచి ప్రతిరోజునవొకటికి తెప్పించి దాన్ని మెచ్చుకొని అందరికిన్ని త
మరుచూపించిఆశ్చర్యపడుతున్నారని హాస్యముగాచేస్తారనిన్ని ఆయారాజులు
గానిపాదుషాలుగాని ఈస్థితివినితమసభలలోనవ్వుతారనిన్ని మనవిచేయడమే
కాకుండాఓదేవసమానుడా వొకనీరసుడైనవర్తకుడు (౧) నేషాపూరు అనేపట్ట
ణములోవొకొక్క రేమేడేసితులాలయెత్తుగలపండ్రెండుమానిక్యములు పట్టె
డలోతగిలించి కుక్కమెడలోవేసియున్నాడనగానే చిన్నబోయి కోపమువచ్చి
యీవజీరునితలకొట్టివేయవలసినదనియాజ్ఞాపించినాముత లారులుఅతని చెయ్యి
పట్టితీసుకొనివెళ్లడానకుయత్నపడ్డారు ఇంతలోజాతులవారిరాయబారి వజీరు
తెలియచేసినసంగతి నిజమోఅబద్ధమో కనుగొనిశిక్షచేయవలసినది వొకవేళ
నిజమైనయెడలవ్యర్థముగావొకమనుష్యునికిహానిచేయించిన వారవుతారని అ
గపడచినందున(సంవత్సరంలోగాఆరుజువ్వుతేనియెడలఆప్రకారముశిక్షించడము

(౧) నేషాపూరు అనేపట్టణముఖురాసాన్ దేశములోనున్నది.

నోతునిరాకాయించివజీరునుఅదివరకు ఖైదులోనుంచవలసినదనిఆజ్ఞాపించడమయి
నదిఈవార్తతెలియగానేవజీరుయింటిలో ముత్తైరూఅన్నదన్ననిఫుట్టినది అతనికి
బుద్ధిమంతురాలైనవొకకుమార్తెన్నూ త్రముకలిగియున్నందున ఆచిన్నదిపిల్లవాం
డ్లను పోగుచేసుకొని బొమ్మల పెండ్లిండ్లుచేస్తూ ఉండగాతల్లితల విరబోసుకొని
వట్టికాళ్లతోఏడుస్తూమొత్తుకొంటూకొమార్తెదగ్గిరకువెళ్లి ఈస్థితి తెలియచేసి
ఈసమయములోనీకుప్రత్యామ్నాయముగా వొక అంధుడైనకొమారుడు ఉ
న్న యెడలతండ్రికి సంభవించిన ఆపదను నివారించునని అన్నది అందుకా
చిన్నది ఆస్థితియూవత్తున్న భోగట్టాచేసుకొని ఈశ్వరనిర్ణ్నములేక పిన్ని జ
రగనేరదు అయినావోరిమిచేస్తేకార్యముకూడివస్తున్నదని తల్లిని సమాధానప
రచివొకరోజునరాత్రి తాతతోతాను(నేషాఘరికి) వెళ్లిఆవతల కనని(సునకముతో)
కూడాతీసుకొనివచ్చి ఫాదుషాకు కనపరచితనతండ్రి మాటనెగ్గించి ఖయిదు ఖు
లాసాచేయిస్తానని తెలియచేసి మొగవేషము వేసుకొని నౌకరులు, చాకరులు
గులాములుమొదలైనవాండ్లను కుదుర్చుకొని ప్రయాణసరంజామ సిద్ధపరుచు
కొని ఎవరికిన్ని తెలియకుండా బయలుదేరి క్రమక్రమముగా అక్కడికి ప్రవే
శించి వొకసత్రములోబసచేసి ఆపట్టణముతాలూకుబజారులు మొదలయినచ
మత్కారములు చూడడమునకు బయలుదేరినంతలో వొక స్థలమందు జవా
హీరులతో దుకాణములు వేసుకొని గొప్పభాగ్యముగలమనుష్యునివలె ఖు
స్తాబైవొకమనిషి కుర్చీమీద కూర్చుండి ఉన్నాడు అక్కడ ఇద్దరుమనుష్యులు
వొంటనుచర్మము అస్థులుమాత్రము కలిగివెంట్రుకలు గోళ్లుపెరిగియునవపం
జరములలోఖయిదు సేయబడిముఖమువాల్చుకొని కూర్చుండిఉన్నారు వాండ్లను
కత్తులువరలుతీసుకొనిఇద్దరేసి అబసీలు రెండువైపులనున్న పహరాలు ఇస్తూ
ఉన్నారు ఆసమీపమందే దంతపుపీటమీదమొఖములుపరుపువేసి ఉన్నది అందు
పైనిబంగారపు గొలుసుతోకట్టియున్న వొకసునకము కూర్చుండియున్నది స
వరత్నస్థగితమైనపడికో అమరిచియున్ననెమలిపురికుంచె పట్టుకొని విసురుతూవొ
కడున్ను జలతారు రుమాలుతో దానికాళ్లున్ను మూతిన్ని తుడుస్తూ ఒకడు
న్ను ఇద్దరుదానికి పరిచర్యలుచేస్తూ ఉన్నారు దాన్నిచూడగానే తండ్రి చెప్పిన
మాటజ్ఞాపకమువచ్చి పరిక్షిస్తేమెడలో జలతారుపట్టెడలో అలంకరించియున్న
పండ్రెండు మాణిక్యములున్ను కనపడ్డందున సంతోషించినది మరిన్ని ఆచి
న్నదిముఖ్య-కీసౌందర్యవతిన్ని (యూరదేశస్థులవలె) మొగవేషము స్తాబై యున్నదిన్ని
వెనందున (ఆసౌదాగరుకు) దాన్నిచూడగానే ప్రేమయునిబ్బెను గుండెలలో

నుంచిదూసివెళ్లినందునఆయన ఆచిన్నదాన్ని తనవద్దికి పిలిపించి స్థితిభోగట్టాచే
స్తేతాను వొకవర్తకునికుమారుణ్ని అనిన్నితండ్రివృద్ధయైనందున వ్యవహారని
మిత్తము తాను అక్కడికివచ్చినాననిన్ని వేరేమార్గములు పెట్టిచెప్పినది అప
టిలో అసౌందర్యమునకు నిశ్చేష్టులై అనేకమందిదారిదోరకకుండా చూస్తూ
ఉండిరి అనంతరము ఆసౌదాగరు ప్రార్థించి వేషమువేసుకొని ఉన్న ఆచిన్న
దాన్నితనయింటికి తీసుకొనివచ్చినాడు దుకాణపువేళ ఆఖరుకాగానే మూసి
వేసి సదరుశునకమునున్ను ఆయిద్దరుఖయిదీలనున్ను కూడాపట్టించుకొని ఇం
టికివచ్చినాడు ఆయనభోజనమునకు ముందుగానే ఒకబంగారపువళ్లెరములో
కావలసినపదార్థములుయావత్తున్ను తీసుకొనివచ్చి ఆకుక్కయెదుట నుంపించ
గానేభక్షించినదిమరియొకబంగారపుతొట్టితో మంచితీర్థమునుంచితే తాగినది
తరువాత ఆరెండుపంజరములకువేసియున్నకప్పతాళములుతీయించి అందులో
నున్న యిద్దరుమనుష్యులను పైకిరప్పించియెంగిలి అనగా యీకుక్కతినగా మిగిలి
నఅన్నమున్ను తాగగా మిగిలిననీళ్లున్ను వాండ్లకు పెట్టించితిరిగిపంజరములలో
యథాప్రకారముగాప్రవేశపెట్టినారుఆసంగతిచూడగానేఆచిన్నదానికిమిక్కిలి
వ్యగ్రతగాకనపడిమనుష్యుడు ఉత్తమజన్మముగలవాడైన్నిశునకములుఅధమజన్మముక
లవైయుండగాఅందుకువ్యతిరేకముగా ఆలాగుజరిగించడముచేతమీరుముసలమా
నులుకారుకాబోలునుఐనమొడలఅందుకుఒడంబడరనిఅనగానేఇందుకుచాలాక
థయున్నదిఈస్థితిబయలుపడకుండానుంచడమునకేఅందరికన్నాగట్టిగా తాముమ
న్నుఇస్తున్నప్పటికిన్ని (ఖాజాసగుపరస్తు) అనగాశునకారాధనపరుడనని తనకు
పేరువచ్చియున్నదనిజవాబుచెప్పి తానుముసలమానైయున్నందుకు రుజువుగా
(౩)ఖురానులోచెప్పియున్న ముఖ్యమంత్రముకూడా చదివివినిపించి సమాధా
నపరిచినాడుఅటుతరువాతప్రతిరోజున్ను రాత్రిపగలుభోజన భాజనములు
జరిగిస్తూతనకువే ఱెసంతకర్తలులేనందున వజీరుకొమార్తెను వొకమొగచిన్న
వాణ్నిగాభావించితానుపెంచుకోవడమునకున్ను తనఆస్తిదఖలుపరచడమునకు
న్నునిర్ణయించినాడు ఈప్రకారముగావొకసంవత్సరముకాగానే ఆచిన్నది
స్వస్థలమునకు ప్రయాణమయితే ఆసాహుకారు అంగీకరించలేదు ఆబిడయుం
డడమునకువొప్పలేదుతుదకు ఆసాహుకారేఆచిన్నదాన్ని వదలలేకసదరుశునక
మునున్నుఆయిద్దరుమనుష్యులనున్ను కావలసినవస్తుసామగ్రినిన్ని నవుకరులు

(౩) ఖురాన్ అనేగ్రంథము మహమ్మదీయులలో వేదము.

గుమాస్తాను ముఖ్యమైన నవారిని వెంటతీసుకొని ల చిన్న దాగిలో బయలుదేరినాడు ఇం
తలా ప్పుడా దాగరుంబులు లేరిలోదేరినందున ఇంకా అనేకమంది వ్యవహారస్థులుకూడా
అతనితో వెంబడివచ్చినారు తుదకంతా మా (రాజధానిలో) ప్రవేశించగానే
ఆచిన్నది ఆయనను సెలవడిగి రెండో వారికి తెలియకుండా తనయింటికి వెళ్లి తల్లి
మొదలైనవారితో ఆస్థితి తెలియచేసి వారిని సంతోషపరచి తిరిగివచ్చి ఆసౌదా
గరును కూడా పట్టణములో కితీసుకొని వెళ్లినందున విశేషమయినకొందరితో ఈయు
నర్గావభయముచేత ఎవరో ఒక షాదుషా సంబంధమయిన రాయభారి వచ్చినాడ
నుకొని అంతా భాగట్టాలు చేయుటకు ఆరంభించినారు అనంతరము ఈకుసక
మున్ను మాణిక్యమున్ను (ఇద్దరుమనుష్యులసున్న) వీరియొక్క స్థితియావ
త్తు అందరికిన్ని తెలియగానే మాహుజూరులో బకీరుచేసినందున ఆక్షణామే వాం
డ్లనుపటి తెప్పించిచూస్తే యిద్దరుమనుష్యుల విషయమయి ఆసౌదాగరుచేస్తూ
ఉన్న అక్రమము ప్రత్యక్షముగారుజువుకనవడ్డందున అతనితలబుట్టతీసి వేయవల
సినదని ఆజ్ఞాపించినాము యింతలో సదరుజాతుబవారి రాయభారే తీరుగా మంద
షాసముచేసి మొదటిదివజీరుచెప్పిన సంగతి రుజువైనట్టున్ను రెండవది (సెరహే
తుకముగా) అతణ్ని చంపిదోషము మాకు తప్పిపోయినట్టున్ను మాడవది ఈసౌ
దాగరు చెప్పే జవాబుకూడా చిత్తగించిమా ఆజ్ఞనునడిపించడము క్రమమయియు
న్నట్టు తిరిగీమనవి చేసినందున అందుకుహర్షించిమేము సెలవుదయచేసినందున
నున్ను ఆసౌదాగరుతనయొక్క పూర్వోత్తరమును ఈక్రిందవివరించిన ప్రకా
రము గోవిధిలేక చెప్పడమునకు సుపక్రమించినాడు అంతకుముందుగానే ఖయి
దులో నున్న ఆయిద్దరుమనుష్యులను పంజరములలోనుంచి పైకితీయించి తాను
చెప్పేసంగతుల యొక్క నిజానిజములను వాండ్లవొప్పుకోగలందులకు మా ఎదుట
నిలువబెట్టించి అనంతరము మాతో ఓమహాప్రభో తామముగ్గురమున్ను అన్న
దమ్ములము అందులోకుడిపార్శ్వమము వైపున నున్న మనుష్యుడు మాలో జ్యేష్ఠు
డు ఎడమువైపున నున్నవాడుమధ్యముడు వాండ్లకుతాను కనిష్ఠుడను పమతండ్రి
(ఫారస్సీ) దేశములో నొకవర్తకుడై యుండెను తానుపదునాలుగోసంవత్సరము
వయస్సులో నుండగా తండ్రి కాలముచేసినాడు ఆయనను ఖననముచేసి తరువాత
దినవారములు కాకమునుపే ఒకరోజున ఈయిద్దరు అన్నదమ్ములు తండ్రి తాలూ
కు ఆస్తి పంచుకొని మెవరిమానాసవారుండేవని పాటులు చేసుకొందామని అన్నా
రు అది విన్నంతనే నేను ఇది యేమిమాట నేనుమీకు సేవకుడను నావంతును గురించిన
వివాదము నేయను తండ్రి నొకరుమాత్రమువని పొయ్యను గాని ఆయనస్థానమునకు

మీరు ఇద్దరున్ను నాకు పెద్దలై యున్నారు పట్టి అన్నము మాత్ర మేకాని కాలము జరు
పుటకు మీసేవలో సిద్ధముగా యుంటాను నావంతుతో సేమీరు సుఖముచెప్పవల్లకయు
కుండించుకొని మీయొద్దకని పెట్టియుంటాను నేను చిన్నవాడను చదువధర్మము వ్రాయుట
ఘనపాటులు ఎరుగనుగనుక నావల్ల ఏమవుతున్నది ఇంకా మీరు నన్ను తరిబెయ్యాలు చే
యవలసినదని అనగా నేసితో కూడా మమ్మును చెడకొట్టి దరిద్రులనుగా చేస్తావా అ
నిజనాబు చెప్పినారు నేను ఊరకే వొకమూలకుపోయి ఏడుస్తూ ఉండేటందుకు అన్న
లు పెద్దలు నాభాగుకొరకే ఆలాగు జడిపిస్తున్నారుగాని మరియొకటికాదని మనస్సు
లో తోచినది ఈవిచారముతోనే నిద్రపోయినాను ఉదయమున నే (౪) కాజీ
తాలూకు బంట్రోతులు వచ్చి నన్ను న్యాయసభకు తీసుకొని వెళ్లినారు అక్కడ
ఈ ఇద్దరు అన్నలున్ను ఉండియున్నారు (కాజీ) ఎందుకు పిత్ర్యము విభాగించు
కోవని అన్నారు నేను యింటిలో చెప్పిన సంగతే అక్కడనున్ను అగపరచినాను
ఈమాటను సస్ఫూర్తిగా అన్నట్టయి తే దాయము అక్కర లేదని తమకు నాదావా
సన్నదు వ్రాసియివ్వవలసినదని వాండ్లు అన్నారు అప్పటికిన్ని ఈ ఉభయులు నాకు
పెద్దలు తండ్రి తాలూకు సొత్తు పంచుకొని వ్యర్థముగా పోగొట్టుకోకుండా జాగ్ర
తగానుండే కొరకు అంటున్నారని బోధపరచుకొని ఆ ఉభయుల అనుమతి ప్రకా
రము (కాజీ) మోరుతో (సాక్షిత్తు) వ్రాసియిచ్చి వేసినందున వాండ్లు సమా
ధానపడి ఇంటికి వచ్చినారు రెండో రోజున ఈయిల్లు మాకు కావలసియున్నది నీ
వుండడమునకు వేరే స్థలము విచారించుకోవలసినదని అన్నారు అందు పైని నేను
తండ్రి తాలూకు యింటిలో నుండడమున్ను వీండ్లకు యిష్టము లేదని తెలుసుకొని
విధిలేక పైకి లేచి రావలెనని ఆలోచించినాను మహా ప్రభో మా తండ్రి జీవించి
యున్నప్పుడు ప్రయాణమునుంచి వచ్చినప్పుడెల్లా ప్రదేశము తాలూకు వింత వ
స్తువులను సమస్తమైన నాకు చిన్నవాండ్లయందు ఎక్కువ ప్రేమకలిగి యుండారు
గనక ఆలాగే నాకిత్తము తెచ్చియిస్తూనుండేవాడు నేను వాటిని అమ్ముకొని కొం
చెంమట్టుకు జాగ్రత చేసుకొని అది పెట్టి వ్యవహారము చేస్తూనుండేవాడను వొక
పర్యాయము (తురకస్తాన్) దేశమునుంచి వొక ఆడనౌకరును న్ను మరియొక మా
రుగుల్లమును న్ను తీసుకొని వచ్చి యిచ్చియున్నందున నేను స్వయముగా సంరక్షణ
చే ఇస్తూనుండేవాడను తుదకు వీండ్ల ఆమర్యాద చూచి అమ్మివేసి వేరే వొక యిల్లు
కొనుక్కొని అక్కడనుంటిని ఈ సునకమున్ను నాతో కూడా నే వచ్చినది గృహా

---

(౪) కాజీ అనగా ఫారసీ భాషలో న్యాయాధికారి పేరు.

పకర్ణములున్ను సేవకవృత్తినిమిత్తము ఇద్దరు గులాములనున్ను జాగ్రత్తచే
సి ముతకబట్టల (దుకాణము) వేసి దేవునిమీద భారము పెట్టిఅదృష్టముఎలాగునున్నుం
డునో అని స్వేచ్ఛగా కూర్చున్నాను అయితే నాఅన్నలు జరిగించిన విశ్వాసఘాతు
కత్వమునకు (భగవంతుడు) నాయందు అనుగ్రహించినందున మూడుసంవత్సర
ములలోగా నేను మోతుబరునని వాడికవచ్చేలాటిదుకాణమైనది అన్నిదినుసు
లలోనున్ను కావలసినవస్తువులు నాదుకాణములోనుంచే వెళ్ళుతూనుండేది ఇందు
వల్లవిస్తారము ద్రవ్యాకర్షణమయినందున మిక్కిలి నిశ్చింతగా కాలము జరగ
డము ఆరంభించినది నేను ప్రతినిమిషమున్ను భగవత్సాన్నిధ్యమందు ప్రార్థన
చేస్తూ సుఖముగానుంటూ ఈశ్వరానుగ్రహము నాయందు కలిగియుంటే తోడ
బుట్టినవాండ్లు అలిగితే నేమి రాజుకు కోపము వస్తే నేమి ఇంకా మరి యెవరేమి తల
చితే నేమి నాకేమి పర్వా అని అర్థముగల శ్లోకములు చదువుతూనుండేవాడను ఇం
తలో శుక్రవారపు రోజున నేను యింటివద్ద కూర్చుండి యుండగా కావలసిన సా
మానునిమిత్తము బాజారుకు వెళ్ళియున్న నా గులాము వెంటనే ఏడుస్తూ తిరిగివచ్చి
నందున అదియేమని అడిగినాను వాడు కోపపడి మీకుమరియేమి పనిసంతోషముగా
నున్నారుగాని అంత్యవిమర్శలో నేమి జవాబు చెప్పుతారో తెలియదని అన్నా
డు ఇప్పుడు నీకువచ్చిన ఆపదయేమని అంటె మీ అన్నలిద్దరిని వాక (×) యూహూ
దీమతస్థుడు నడిబాజారులో పెడరెక్కలు విరిచికట్టి కమిచీతో కొట్టుస్తూ నవ్వుతూ
నా సొమ్ము ఇవ్వకపోతే కొట్టిచంపివేస్తాను అందువల్ల తనకు పుణ్యము లభిస్తున్న
దని అంటూవున్నాడు మీ అన్నలకు ఈస్థితి సంభవించినది మంచిదే నా ప్రజలు ఏమ
నుకొందురన్నమాట వింటున్నే రోషపడి వట్టికాళ్లతో బాజారువైపు పరుగెత్తు
తూ (రూపాయిలుతీసుకొని రావలసినదని గులాములతో చెప్పి వెళ్లిచూస్తే గులాము
చెప్పినమాట నిజముగా కనపడ్డది ఆకొట్టే బంట్రోతులతో నేను యూహూదివద్దకు వె
ళ్లివచ్చేదాక నిదానించమని చెప్పి అక్కడికి వెళ్లి ఎందుకు కొట్టుస్తున్నారని అడిగితే అత
డు మీరు సహాయము సేయవలసియుంటే రూపాయిలు ఇచ్చి వాండ్లను తీసుకొని వెళ్ల
వలసినది లేకుంటే మీరేయింటికి వెళ్లవలసినదని చెప్పగా నే దస్తావేజు కనపరచండి లె
క్కచూచి యిస్తాననగా అది అధికారులవద్దనున్నదని చెప్పెను ఇంతలో నా గులాము
లు సంచులతో రూపాయిలు తీసుకొని వచ్చినందున ఆరూపాయిలు అతనికిచ్చి అన్న
లను వదిలించినాను వీండ్లు పైకిబట్టక డప్పుకు తిండి నీళ్లున్ను లేనందున నాతో కూడాని

(×) యూహూదీమతస్థులు తురకలకు శత్రువులై యున్నారు.

పట్టీసుకొని వచ్చి తలంటబోసి పోయించి క్రొత్తబట్టలు కట్టించి భోజనము పెట్టినాను గాని వీండ్లు సిగ్గుపడుతారని ఎంచి తండ్రి తాలూకు సొమ్ము మీరు ఏమి చేసినారని అడుగ లేదు ఒక మహారాజా వీండ్లను నిజమే చెప్పుతున్నారని అనుకొండి కొంచెం రోజులలో ఆ దెబ్బలు ఆ నొప్పులు కుదిరి పుండ్లు మానిన తరువాత వొక రోజు నేను అన్నలను చూచి యీ పట్టణములో మిమ్ము నెవరు నమ్మరు గనుక కొంతకాలము ప్రయాణము చేయుండ సి నేను అంటే వారికే యున్నందున అందుకు అంగీకరించినట్టు తెలుసుకొని ప్రయా ణ సరంజామలన్నీ డేరాలు లొట్టిపిట్టలు వేసడములు జాగ్రత చేసి వ్యాపార ముని మిత్తము ఇరవై వేలరూపాయిల సామాగ్రికొని వొక వర్తక సమూ హము (౬) బఖారా అనే స్థలమునకు వెళ్లుతున్నందున వాండ్లతో కూడా పంపే ప్పగింత చేసినాను ఒక సంవత్సరము అయిన తరువాత ఆ వ్యవహారస్థులు తిరిగిన్ని వచ్చినారు గాని వాండ్ల క్షేమ సమాచార మేమిన్ని తెలియలేదు తుదకు ఒక స్నేహి తుని వొట్టు వేయించి అడిగితే వొక అన్న జూదమాడి సొమ్ము యావత్తు ఓడిపోయి ఆ జూదమాడే యిల్లు ఊడుస్తూ జూదగాండ్ల సేవకవృత్తి చేస్తూ వాండ్లు దయచేసి ఏ మయినా యిస్తే అందువల్ల జీవిస్తూ అక్కడ గడిసె వేసుకొని పడియున్నాడనిన్ని రెండో అన్న కల్లు దుకాణపు వాని కూతురిని మోహించి తన ధనమంతా దానికి విని యోగపరచి ఆ దుకాణము వద్దకని పెట్టిన పని పాటలు చేస్తూ ఉన్నాడనిన్ని ఈ సంగ తులు మీకు తెలియచేస్తే లజ్జిస్తారని మీతో ఎవరున్ను చెప్పలేదనిన్ని అన్నాడు ఈ స్థితి ఆ మనుష్యుని వల్ల వినగానే నేను ఆశ్చర్యపడి విచారము చేత ఆకలి నిద్ర లేకుండా నుండె వారి ఖర్చుకు కొంత సొమ్ము చేత పట్టుకొని అక్కడికి వెళ్లి వెతికి వాండ్లను నా బసకు తీసు కొని వచ్చి స్నానము చేయించి కొత్తగా బట్టలు తొడిగించి వాండ్లు సిగ్గుపడుతారని నేను భయపడి ఏమాట నోటితో అనలేము తిరిగి వాండ్ల నిమిత్తము వర్తకపు సా మానులు కొని యింటికి రాగలందులకు బయలుదేరినాము నేషాపూరుకు సమీప ముగా రాగా నేనొక ఊళ్లో ఆ వస్తుసామాగ్రితో వాండ్లను వదిలి పెట్టి నేను ఎందు కు వెళ్లి వచ్చినదిన్ని ఎవరికి తెలియకుండా ఇంటికి ప్రవేశించి రెండురోజులు అయ్యి న తరువాత మా అన్నలు పరదేశము నుంచి వస్తున్నారు రేపటి దినము ఎదురుగా వె ళ్లుతానని ప్రకటన చేసి ఉదయాన వెళ్లవలెనని యుండగా ఆ పల్లెతాలూకు వొక గృహస్థుడు నా వద్దికి యేడుస్తూ వచ్చినందున ఎందుకని అడిగితే మీ అన్నలను మా యిం ట్లో ఉంచినందు చేత బందిపట్టుపడి మా యిల్లు కూడా దోచుకొని పోయినారనిన్ని మీ అన్నలు దిగంబరులై ఊరు బైల కూర్చుండియున్నారనిన్ని చెప్పినాడు అప్పుడు

---

(౬) బఖారా అనే పట్టణము టార్టర్ దేశములో నున్నది.

రెండువ్వడు వస్తువులు కట్టుకు కట్టింపుకొని పైన్నెత్తి దిగింది ఒకటికేతీసుకొనివచ్చినాను ఆస్థి తి ప్రజలువినిపించిన్నను చూడడమునకు వన్తెనిస్సిగ్గుచేత బైటరాకుండా నూరుదు నెల లుండి ఇకనెంతకాలమువీండ్లు మాలదాగియుందురు ఉపయోగమైతేవీండ్లను కూడా వెంటబెట్టుకొని ప్రయాణము వెళ్లుదామనియాలోచించి వాండ్లతోనైలవై నవకమునకు ఈసేవకులుతనతోకూడావస్తాడని అంటే ఒప్పుకొన్నారుతిరి గివర్తకకపుదినస్సుసిద్ధపరచుకొని బైయలుదేరివాండ్లనుకూడాతీసుకొని వెళ్లినా ను మామూలు ప్రకారంఅందరికిన్ని (౮) జకాతుసొమ్ము సంభావన పంచిపెట్టి సామానులు తూకమువాడుమీదికిఎగుమతిచేసినందున లంగరెత్తుకొని ఓడ బయలు దేరినది ఈకుక్కలవాళ్లునని రప్పోతూవుండితుళ్లిపడిలేచి ఓడనడిసముద్రములో నుండడముచూచి అరుస్తూసముద్రములోనుంచి ఈదడము మొదలుపెట్టినది నేను దాన్నిఎదురుగా వొకపడవపంపించినందున ఓడలో ప్రవేశించినది వొకనెలకు ట్టుకునులక్షితముగా ఆయోడమీదకాలముజరిగినదితరవాతనా రెండోఅన్న నాదా సిదాన్ని మోహించినాడు వొకరోజున పెద్దవానితో మనతమ్ముడు మనకునదుపా యముచేయడములజ్జయియున్నది ఇందుకుఏమైనాఆలోచింతామని అనగానే ఉభయులుఆలోచించి సమకూడితే చంపివేయడమేయోగ్యమైనదేగాక వీడిసొ మున్ను పుచ్చుకోవచ్చునని నిశ్చయించినారు వొకరోజున నేను ఆఓడగదిలోప రుండియున్నాను దాసికాళ్లుపడుతూవున్నది రెండోఅన్నవచ్చితొందరగా లేపి నందునతుళ్లిపడిలేచిపైకివచ్చినాను ఈశునకమున్ను నాతోవెంటాడినది వెళ్లిచూ స్తేపెద్దఅన్నవాడలట్టుమీదచేతులు ఉంచుకొనిఅంగిసముద్రములోవిచిత్రముచూ స్తూనన్ను పిలుస్తూవున్నాడు నేనుదగ్గిరికివెళ్లిఅడిగితే నీటిమనుష్యులు ముత్యపుచి ప్పలున్ను పగడపుతీగెలున్ను చేతపట్టుకొని చమత్కారముగా ఆడుతున్నారని అన్నాడుమరిఎవరైనా ఇటువంటికల్పనమాటల నేపతుమందు నేనునమ్మనుగాని పెద్దఅన్నచెప్పడముచేత నిజమనుకొని చూడడమునకు తలవంచినాను ఎంతచూ చినాఏమిన్నికనపడలేదు ఇప్పుడేకనపడ్డదిఏమైనదో చూడుమని అంటూనుండేను ఇంతలోనేనుపరాకుగా నుండడముకనుక్కొని రెండోఅన్న వెనకెట్టుగావచ్చి ఊబెత్తుగాసముద్రములోపడేలాగున తోసివేసినాడు తరువాతభయపడి పరుగె త్తరడే మాతమ్ముడుసముద్రములోపడిపోయినాడని కేకలువేస్తూవడిగాము త్తు కొంటూవిడ్చినారు ఇంతలోవాడనక్కెచినది సముద్రపు కెరటాలున్నన్ను అక్కడి

(౮) జకాతు అనగా మహమ్మదీయులు లాభముమీద నూటికి అయిదు చొప్పున ఇచ్చేది.

నుంచి యెక్కడికో తీసుకొనిపోయినందున తరంగాలలో మునుగుతూ తేలుతూ కొట్టుకపోతూవుంటిని తుదకు అలిసిపోయి యేమిన్ని సేయలేక భగవంతుని ధ్యానకము చేసుకొంటూ ఊరకేయుండగా వొకసారి దేనిమీదనో నాచెయ్యి పడ్డది కండ్లు తెరచిచూస్తే ఈతునక మేకనపడ్డది నన్ను సముద్రములో పడవేసినప్పుడు ఇదిన్ని కూడా గెంటినది కూడా ఈదుతూ నన్ను వదలక వస్తూవుండెను నేను దానినికొపట్టుకొన్నాను భగవంతుడు నేజీవించడమునకు యీతునకను హేతువుగా కల్పించినాడు ఏడు రాత్రి పగల్లు ఈవిధముగా జరిగినవి ఎనిమిదో రోజున వొడ్డుకు చేరినాము యేమిన్ని శక్తిలేకుండా దొర్లుతూ శరీరమును భూమిమీద చేరవేసి వొకరోజంతా వొళ్లు తెలియక పడియుండి రెండోరోజునకుక అనుభవిని తెలివి తెచ్చుకొని భగవత్ప్రార్థన చేసి యిటుఅటుచూడగా దూరమునందు ఊరున్నజాడ కనపడ్డది గాని వెళ్లడమునకు శక్తిలేక వేసారుతు సాయంకాలమునకు వొకక్రోసు నడిచినాను ఆమార్గమములో వొకకొండ అడ్డముగా ఉన్నందున ఆరాత్రి అక్కడ పడియుంటిని ప్రొద్దున పట్టణములో ప్రవేశించి బాజారులో వెళ్లగానే రొట్టెలు లేహ్యములు అమ్మేవాండ్ల దుకాణములు కనపడ్డందున తినడమునకు మనస్సులో ఆశపుట్టెను గాని కొనడమునకు నావద్ద డబ్బు లేదు ఊరకే అడగడమునకు ఇచ్చలేదు ఇక్కడ కాదు అక్కడ అడుగుదాము అక్కడ కాదు మరియొక దుకాణము దగ్గిర అడుగుదామని మనస్సులో సమాధాన పరుచుకొంటూ నుంటిని తుదకు శక్తిలేక పాయను కడుపులో మంటపుట్టి ప్రాణము పోవడానకు సమీపించినది ఇంతల్లో అవశాత్తుగా ఫారసీ దేశసుల వలె ముస్తాబై చేట్టా పట్టాలు పట్టుకొని వస్తూ ఉన్న ఇద్దరు మనుష్యులను చూచి తమదేశస్థులని సంతోషపడ్డాను ముఖపరిచయము కలవాండ్లు యైయుందురేమో వీళ్లతో తనస్థితి చెప్పతామని దగ్గిరికి వెళ్లితేనా ఇద్దరన్నలే అయియున్నందున ఇతరుల దగ్గిరికి వెళ్లి చెయ్యి జాచకుండా భగవంతుడు నామర్యాదను కాపాడినందుకు మి తిసంతోషించి దగ్గరకు వెళ్లి సలాము చేసి పెద్దన్న చెయ్యి ముద్దుపెట్టుకొన్నాను వాండ్లు నన్ను చూస్తున్నే వడిగా కేకలు వేసి రెండో అన్న చెంపకాయలు కొట్టినందున గంజుకొంటూ కిందపడి తనకు సాహాయము చేసునేమోఅని పెదన్న కొంగు పట్టుకొంటే అతడు కూడా తన్నినాడు తుదకు యిద్దరు నన్ను మొత్తగా దంచి (ర) హజరతు యూసఫ్ అనే అతణ్ణి ఆయన సోదరులు జరిగించినవిధముగా చేసినారు మాటిమాటికి భగవంతుని విషయమైనన్ను రక్షించవలసినదని

---

(ర) హజరతు యూసఫ్ అనే ఆయన తురకలలో సున్నముసుపంటివాడు అతణ్ణి తోడబుట్టిన వాండ్లు నూతిలో తోసిరి.

ఎంతచేసుకొన్నా వాండ్లకు కనికరముపుట్టలేదు అనేకులు అక్కడపోగై ఇతడుఏ
మిత్యృతము చేసినాడని అడిగితే ఈడుమాగుండుమూతమ్ముని నౌకరనిన్ని అతణ్ని
పెదుసముద్రములో పడవోసి సొమ్ము ఎత్తుకొనివచ్చినాడనిన్ని ముచాలాకాల
మునుంచి ప్రయత్నము సేయగా ఈవేళకనపడ్డాడనిన్ని చెప్పి ఓగులాభువాడా మా
తమ్ముణ్ని చంపివేయడమునకు నీమనస్సులో ఏమితోచినది అతడునీకేమిచెడ్డపని చే
సినాడు అతడునీకు బహుఉపకారిగదా అనిఅడుగుతూ ఇద్దరున్నుబట్టలు చింపివే
సుకొని నిరర్థకముగా తమ్ముణ్ని గురించి ఏడుస్తూనన్ను తన్నుతూ గద్దిస్తూనుండిరి
యింతలో అధికారులతరఫు బంట్రోతులువచ్చి ఎందుకుకొట్టుతారని వాండ్లను
అటకాయించి నాచెయ్యిపట్టుకొని కొత్వాలుదగ్గిరికి తీసుకొనివెళ్లిరి యీఉభయు
లున్నాతోకూడావచ్చి అధికారితో ఆలాగే చెప్పి ఏమోలంచమిచ్చి న్యాయము ఇప్పిం
చవలసినదని నామీద అబద్ధపు ఖూనీచార్జీ చేసిరి అధికారి నన్ను అడిగితే ఆకలిచేత
నన్ను దెబ్బలచేతనున్ను మాటలాడడమునకు శక్తిలేక తలవాల్చుకొని నిలువబడియుం
టినిగాని నోటివెంట ఏమాట బైలువెళ్లనందున అధికారికి నేను నిజముగా ఖూనీచేసి
నట్టుతోచి వీణ్ని మైదానముమీదికి తీసుకొనివెళ్లి ఉరితీయవలసినదని ఆజ్ఞాపించినాడు
మహాప్రభో నేనుధనముయిచ్చి వీండ్లను సదరుయాహూదియొద్దనుంచి ఖయిదు
తప్పించితీసుకొనివస్తే అందుకుబదులుగా నాప్రాణముమీదికి తెచ్చినారు ఇద్దరుహా
జరుగానే ఉన్నారు నేను యిందులో యేమైనా తఫావతుచెప్పుతున్నానేమో
అడుగుడీతుదకు నన్ను తీసుకొనివెళ్లినందున ఉరితాడుచూడగా జీవితాశవదులుకొ
న్నాను ఈసక్కతప్పనాకోసముదుఃఖించేవాండ్లు యెవరున్ను లేకపోయిరి ఇది
వ్రతివాండ్లకాళ్లమీదపడుతూ అరుస్తూనుంటే కట్టలతో కొట్టేవారునుకొందరు కా
లతోరుచ్చేవారుగాని ఆస్థలమువదిలేదికాదు నేపడమటిముఖముగా నిలువబడి
శ్రీభగవంతుడా ఇప్పటిలో మీకన్న మరియెవరున్ను లేరు ఈనిర్దోషిని రక్షించవలసిన
దనిమూలమంత్రముచదివి పక్కవిరుచుకొని పడిపోతిని ఇంతలో దైవయోగ
ముచేత ఆపట్టణపురాజుకు శూలనొప్పిపుట్టినందున ఉమరావులు వైద్యులు పోగై
ఏసాధనము చేసినా గుణములేదుగనుక పేదవాండ్లకు దానధర్మములు చేసి ఖయిదీల
నువదిలించి వాండ్లవల్ల ఆశీర్వచనము పుచ్చుకోవడమే అన్ని వైద్యములకంటే ఎక్కు
వయని చెప్పితే తత్క్షణమే డలాయతులుజయలుఖానా నైపుపరుగెత్తిరి వాకడు మై
దానమువైపువచ్చే ప్రజలగుంపుచూచి ఎవరినో ఉరితీస్తున్నారని గ్రహించి గుఱ్ఱా
న్ని వడిగాదౌడాయించుకొనివచ్చి కత్తితో ముందుగా ఉరితాడుకోసివేసివాండ్లతో ప్రభు
వారికి ఆలాగునసుండగా ఇప్పుడుమనుష్యుని ఉరితీయవచ్చునా అని కేకలువేసినన్ను

వదలించినాడు అప్పుడు ఈయిద్దరుఅన్నలుతిరిగికొత్వాలువద్దకువెళ్లియేలాగునైనా
నాన్నుచంపవలసినదనిచెప్పగానే అతడులంచముతీసియున్నందున వారితో ఆ
కలిచేతను నీళ్లుగాలిలేక ఎవ్వరికితెలియక స్వయముగా చనిపొయ్యేటటువంటి
బందేఖానాలోపడవేస్తానని చెప్పినన్ను పట్టితెప్పించి వొకమూలనుంచి ఆపట్టణ
మునకు వెలపలక్రోసెడు దూరములోవొక కొండయున్నది అక్కడపూర్వ
కాలమందు(హజరత్ సిలేమాన్) అనేపేరుగలరాజుయొక్క కాలములోదేవతా
నిర్మాణమైనవొకలోతైన ఇరుకుసుయ్యిఉన్నదిదానికి ఆసిలేమానుయొక్క కా
రాగృహమనియంటేరు ఎవరిమీదనైనారాజుకుకోపంవస్తేవాండ్లను అందులోప
డవేస్తేవాండ్లు ఒకరుచంపకుండాతమంతటతామేచచ్చుచుందురు నన్ను రాత్రి
ఎవరికిన్ని తెలియకుండా ఈయిద్దరు అన్నలున్ను కొత్వాలుబంట్రోతులున్ను
అక్కడికితీసుకొనిపోయి అందులోత్రోసివేసినిమ్మళముగా తిరిగివచ్చినారు ఓమ
హాప్రభో ఈశునకమునాతోకూడానేవచ్చి ఆనూతియొడ్డునపరున్నది నేను
లోపలవాళ్లుతెలియకపడియుంటేని కొంచజ్ఞానముకలిగితాను చచ్చిపోయిన
టున్ను అవిగోరి అయినట్టున్నదెంచుకొనేవాడను ఇంతలో ఇద్దరుమనుష్యు
లయొక్కమాటలుచెవినిపడ్డందున వాండ్లు(యమకింకరు)లనిన్నితన్నుప్రశ్నచేసి
అడుగుతున్నారనిన్ని అనుకొంటూఉండగా అందులోకి ఎవరోసరసరతాడువది
లినట్టుచప్పుడువినబడినేను భూమిమీదతడవిచూస్తే ఎముకలుమాత్రముచేతికిదొ
రికేనవి వొకనిమిషమైనతరువాత ఎవరోఏమోతింటూచప్పరిస్తూ ఉన్నట్టువినప
డ్డందున మీరు ఎవరని అడిగినాను వాండ్లున్నితాముఖయిదీలమని జవాబుచెప్పి
తేతానుచనిపోయినానా అని ప్రశ్నచేసినాను తిరిగివాండ్లుకిలకిలనవ్వి యింకా
బ్రతికేయున్నావనిన్ని ఈనూనెనీవన్నమాటే అవుతున్నదనిన్ని జవాబుచెప్పినారు
ఆపిమ్మటమీరుతింటూ ఉన్నదేమిటోనాకున్ను కొంచమిమ్మని అడిగితే కసిరిలేదు
పొమ్మనివాండ్లుపశ్రమతానపరున్నారు నేనునీరసముచేతనిస్సత్తువచేత మూ
ర్ఛపోయి ఏడుస్తూ భగవన్నామస్మరణచేస్తూనుంటేని ఓమహాప్రభో ఏడురో
జులుసముద్రములోనున్నతరువాత అన్నలకుత్రచేతవొకమెతుకైనా దొరకక
పైగాయినిన్నిరోజులున్న ఉంటేనివిశేషించి అన్నముతినడమునకు బదులిగాదె
బ్బలుతినిఇకతిరిగీఇందులోనుంచి విడుదులఅవుతానన్నఆశయెంతమాత్రము లే
నటువంటిఖయిదులోకూడాపడియుంటేని తుదకు ప్రాణాపాయస్థితియముకూడా
సంభవించినందున ఒకప్పుడు ఊపిరిరావడమున్ను ఒకప్పుడుపోవడమున్నుకలిగి
యుండేనుగాని ఎప్పుడెప్పుడు అనేరాత్రివేళవొకమనుష్యుడువచ్చిగుమాలుతో

రొట్టెలున్న తాడుతో నక్కరాజా ఇవి రెండు కట్టిపెట్టినాతో ఖయిదులోనున్న స
దరు ఇద్దరుమనుష్యులనిమిత్తములో పలికిజారవదిలి కేకలువేస్తేవాడు గట్టుమీదను
న్న ఈకుక్క ఈస్థితి అట్టే చూచిచూచి ఈమనుష్యుడు తనవాండ్లకు ఏలాగుననుద
ము రొట్టెనూతిలోకి అందిస్తున్నాడో ఆలాగుననే తనయజమానునికిన్ని ఆధారము
కలగచేస్తే అతని ప్రాణము యెంతో నిలువబడుతున్నదని ఆలోచించి ఊళ్లోకివెళ్లి
రొట్టెలవానిదుకాణపుబల్లమీదికి లగువుచేసి వొకరొట్టెనోట కరుచుకరాగా ప్ర
జలువెంటబడికొడుతూనుండిరిగాని రొట్టెవదిలినదికాదు మనుష్యులు అలసి వెనక
కు తిరిగినారుగాని ఊళ్లోనున్నకుక్కలు వెనకతగిలినవి వాటితో టన్ని దెబ్బలాడు
తూ బూకరిస్తూ రొట్టెను కాపాడుకొని ఆనూతిపట్టకెవచ్చి అందులోపడవేసినది
అప్పుడు పగటివేళ అప్రటచేత వెలుగుగానున్నందున రొట్టె నావద్దపడడము చూచి
న్ని కుక్క ఆముప్పువినిన్ని అదితీసుకొన్నాను అటుతరువాత ఈపనికోసరము వె
ళ్లి ఊరికొననువొకముసలిదాని గుడిశెయున్నది వాకిట చట్లతో టన్ని బంగరాల
తో టిన్ని నిండా నీళ్లుకలిగియున్నవి ఆముసలిది రాట్నముతో ఏకులువడుకుకొం
టూ గుమ్మములో కూచుండి యున్నది కుక్కరాజావద్దకివెళ్లి అదినోటితో క
రిచిపెట్టితీసుకొని రావడమునకు ప్రయత్నముచేస్తే అవిజారిపోయి ఒకగూనమీ
దపడి కుండలదొంతి విరగపడి బద్దలై నీళ్లుకారిపోయినవి ఆముసలిది కఱ్ఱపట్టుకొని
కొట్టడానికు లేచినది ఈశునకము దానిగుండా చుట్టుతూ తిరిగి కాళ్లమీదపడి మూ
తిరాస్తూ తోకకదిలిస్తూ కొండవై పుపరుగెత్తడమున్ను మళ్లీవచ్చి దానిపాదాల
మీదపడడమున్ను వొకమారు తాడు ఎత్తడమున్ను మరియొకమారు నోటితో చె
దుతాడు పట్టుకొనికనపించడమున్ను పైటకొంగుపట్టుకొని లాగడమున్ను జరిగి
స్తూవచ్చినందున భగవంతుడు ఆముసలిదాని మనస్సులో కనుకొందామని ఆ
సక్తిపుట్టించిచేదుతాడు పట్టుకొని ఆకుక్కతో వెళ్లేలాగున చేసినాడు యిదిదాని
చీరెకొంగుపట్టుకొని యింటివద్దనుంచి బైలువెళ్లిముందఱనడుస్తూ తుదకు ఆకొం
డమీదికి తీసుకొనివచ్చినది ముసలిదాని మనస్సులో ఆవెఱ్ఱిచేసేపనివల్లనే నిఖాయం
దునిశ్చయముగా ఈనూతిలోపడియున్నాడనిన్ని అందునిమిత్తమే కాబోలు యు
దకము కావలెనని తెలియచేస్తున్నదనిన్ని గ్రహించి వొకకూజానిండా నీళ్లు నింపి
అది తాడుకు కట్టిలోపలికి పడిచినందున నేను అందుపుచ్చుకొని రొట్టెనుక్కతీసి రెం
డుమూడు గుటకలనీళ్లు తాగి ఈఆకలి అనేశునకమును సమాధానపంచి భగవత్ప్రా
ర్థనచేస్తూ ఈపైన ఏమిజరుగుతున్నదో చూతామని వొకస్థలమందు కూచున్నా
ను ఈ శోరుమొరగనిజంతువు ఆవిధముగానే రొట్టెతీసుకొనివచ్చి ఇచ్చి ఆముసలి

దానిచేత నీళ్లు యిప్పిస్తూ ఉండేది అక్కడ కొట్టేలవాండ్లు ఎల్లప్పుడున్ను శునకము
ఏతన్నిమిత్తమే వస్తూ ఉన్నదని కనికరించి దాన్ని చూస్తున్నే ఎదుట వొకరొట్టె పార
వేస్తూ ఉండేవారు ముసలిది వొకవేళ నీళ్లుతీసుకొనిరాకపోతే కుండలు బద్దలుకొ
ట్టివేస్తున్నదనే భయముచేత రోజునున్ను వొకకూజా నీళ్లు ఇచ్చి వెళ్లుతూ ఉండేది
(అంగాగ్ర) ఈ స్నేహితుడు అనగా శునకము రొట్టెనీళ్లతోటనన్ను సంతుష్టిపరచి
తానునూతిలోనుంచునపడియుండేది ఈ ప్రకారముగా ఆరుమాసములు జరిగినవి
గానిఅటువంటిఖయిదులోనుండడముచేత వొంటికిగాలితగలక చర్మమున్ను దుమ్ము
మాత్రమే అవశిష్టముగానుండి ఓభగవంతుడా యీ ఊపిరికూడా వదిలిపోతే
బాగానుండునని యేడ్చేవాడను వొకరోజున రాత్రి ఆఇద్దరుఖయిదీలు నిద్రిస్తూ
నుండిరినాకున్ను నిద్రపట్టక ఊరకే ఏడుస్తూ దైవసాన్నిధ్యమందు ముక్కు నేలరా
చుకొని ఆపరాధము చెప్పుకొంటూ ఉంటిని రెండోజాముకాగానే భగవదనుగ్ర
హమువల్ల వొకతాడు నూతిలోకి వేలాడబడినది మరిన్ని ఓదురదృష్టవంతుడా ఆ
తాడుకొననున్న చేతులను గట్టిగాకట్టుకుని అక్కడినుంచి బైలుదేర వలసినదన్న ధ్వని
కూడావినబడ్డది నేను అదివినగానే తుదకు నాఅన్నలే నామీదనిఅనుగ్రహించిరక్తసం
బంధముచేత వాళ్లు పైకితీస్తున్నారనియెంచుకొని మిక్కిలిన్ని సంతోషముతో ఆ
తాడునడుముకుబాగాకట్టుకొన్నాను ఎవరో పైకినన్నులాగినారు రాత్రిమిక్కిలి
చీకటిగానున్నందున నన్ను ఎవరు పైకితీసినారో వారిని నేనుపోల్చలేదు పైకిరా
గానే అతడు నాతో మెల్లగా ఇక్కడనిలువబడడమునకు తగినస్థలము కాదని అన్నా
డు నాకైతే శక్తిలేదు దానిభయముచేత కొండామీదా పడుతు కొండదిగిచూస్తే
నేజీను కట్టిన రెండుగుఱ్ఱాలు సిద్ధముగానున్నవి ఆమనుష్యుడు వొకదానిమీదనన్ను
ఎక్కించి రెండోదానిమీద తానుసవారియై ముందునడిచినాడు వెళ్లగావెళ్లగా స
ముద్రపువొడ్డున ప్రవేశించేవరకు తెల్లవారినది ఆపట్టణమునకు పదిపంద్రెం
డుక్రోసులుదాటినాము అప్పుడు ఆచిన్నవాణ్ని చూస్తే బహుశుభ్రముగా
నుండడమేగాకుండా ఇనపకవచముతోడుకొని నాలుగుఆయుధములుధరియిం
చిగుఱ్ఱముమీదకూర్చుండి కొరకొరలాడుతూ కళ్లెఱ్ఱచేసి నావైపు క్రూరదృ
ష్టితోచూస్తూ తనచెయ్యిపళ్లతోకరుచుకొంటూ ఒరలోనుంచి ఫిరంగికత్తితప్పిం
చిగుఱ్ఱమునుతనవైపుత్రిప్పివిసిరినాడు నేను గుఱ్ఱముమీదనుంచిపడి నిర్దోషుడను న
న్నెందుకుచంపివేస్తావు ఓస్నేహితుడా అటువంటిఖయిదులోనుంచినన్ను పై
కితీసిఇప్పుడు ఈనిర్దాక్షిణ్యమునకు కారణమేమనిబతిమాలడమునకు ఉపక్రమిం
చినాను అందుమీదనిఅతడు నీవు ఎవరో నిజముచెప్పవలసినదనిఅన్నాడు నేను ప్ర

యాణస్థుడనుసిహేంఃతుకముగా ఆపదనుపొందియున్నవాడను మీకటాక్షముచే
తప్రతికెనాననిజవాబుచెప్పియింకాఅయినప్రియకరమైన మాటలుకూడా ఆడి
నందునభగవంతుడు అతనిమనస్సులో కనికరముతో కత్తినివొరలోవేసేటట్టుచే
సెను ఆచిన్నవాడునన్నుచూచి ఏదిసంకల్పించినాడో అదిచేసినాడు నీమానాని
నీవుబ్రతుకమనినన్నుత్వరగా గుఱ్ఱముఎక్కు—ఇది ఆలస్యముచేయడము సరితగినస్థల
ముకాదనిచెప్పినహేతువుచేతగుఱ్ఱమును యెగవేసినాము మార్గములోవిచార
పడుతూపశ్చాత్తాపపడుతూనుండేవాడను ఆదినము రెండోజాముకు వొకటప్ప
కుచేరినాము అక్కడగుఱ్ఱముదిగినన్నున్ను దిగుమనిచెప్పి గుఱ్ఱపుసామానుయావ
త్తున్నుతీసిమేతనిమిత్తమువాటినవదిలిపెట్టితానున్ను నడికట్టువిప్పికూర్చుండి నీస్థి
తిఏమోనీవు ఎవరోచెప్పుమని అన్నాడు నేను నాపేరున్ను ఆనవాలున్ను జరిగి
నసంగతిన్ని యావత్తుచెప్పినాను ఆచిన్నవాడునాస్థితియావత్తున్ను విని దుఃఖపడి
నావైపుతిరిగిఓచిన్నవాడా ఇకనామాటచెప్పుతాను వినుమనిఅన్నాడు నేను(౧)
జేరుబాదుదేశపురాజకన్యకను ఆనూతిలోపడవేయబడిన్ను (బహరామం
డు) అనేపేరుగలచిన్నవాడను మహారాత్రిగాదినంత్రికమారుడను వొకరోజున ఎ
ప్పటివరిప్రవీణతలుతెలియడమునకు (నాలుగుగుఱ్ఱాల) మనుయిలాకేనవస్త్రమైన గా
జులురాజకొమాళ్లుగుఱ్ఱపుసవారులై ఊరువెలపలమైదానముమీదికివచ్చి తుపా
కులతోనున్ను ఉచ్చలతోనున్ను గురులుకొట్టడము ఈటెలుకత్తులుసహాయముతో సా
ముచేయడముమొదలైనవి జరిగించడమునకు ఆజ్ఞాపించినారు ఆచమత్కారము
చూడడమునకు మాతల్లిఅయినరాణిగారిపట్టపుదాచాటున అనేకమంది దాసీ
లను చెలికత్తెలనుకూడా ఉంచుకొని మేడమీదకూచుండియుంటేని మంత్రి
కొమారుడు అందరిలోనున్న సుందరమైనవాడై యుండడమేకాకుండాగుఱ్ఱము
ను కావాకూడాతిప్పుతూఉండేను అదిచూచిఅతనిపైనినామనస్సు మోహించిన
దిగానిచాలాకాలముఎవరికిన్ని తెలియకుండాఉంటేను తుదకువికలపడినాదాది ఈ
కితెలియచేసి అనేకమయినకష్టములుఇస్తే అదిఆచిన్నవాణ్ని నానోపాయ
ములచేత నాగదిలోకితీసుకొనివచ్చినది అప్పుడుఅతనికిన్ని నాయందు మోహ
ముపుట్టెను! చాలాకాలము అన్యోన్యానురాగముల చేత జరిగినది వొకరోజురాత్రి
రెండుజాములప్పుడు ఆయుధస్థుడైఅతడు ( అంతఃపురము ) లోకిరాగాచవు
కీపరుండేవాళ్లుచూచిపట్టుకొనిరాజుతోచెప్పితే శిరచ్ఛేదముచేయవలసినదని సె
లవిచ్చినాడుఅయితేసభవారంతావిని ప్రాణసంరక్షణ మవ్వెల్యాలాగున చేసినం

(౧) జేరుబాదుఅనేది బర్మారాజ్యము.

ఖురానులో చెప్పియున్న ముఖ్యమంత్రము. నేను చదివి ఆమెచేత మూడుపర్యాయములు పఠించినాను తరువాత అక్కడనుంచి గుఱ్ఱాలపైని సవారీయైమేము ఉభయులము బయలుదేరి రాత్రిమకాము చేసినస్థలమందు ఆమెమత ప్రచారము చేస్తూనావల్ల వింటూ సంతోషిస్తూ ఉండేది ఈవిధముగానే రెండుమాసముల వట్టుకు ఉభయులమున్ను రాత్రి పగళ్లు ప్రయాణము చేసినాము తుదకు ఒకద్వీపమునగా(జేరుచాసుకున్న (౧౧) సరందీపుకున్న మధ్యసరిహద్దుగానున్న ఒకపట్టణములో ప్రవేశించినాము ఆపట్టణము ఇస్తంబోలు అనగా (కొన్‌స్టాండునోపిల్) కన్నా ఎక్కువ ప్రజాసమృద్ధిమైనదిన్ని అక్కడి ఉదకమున్ను గాలిన్ని మిక్కిలి సౌఖ్యకరమైనదిన్ని సంతోషకరమైనదిన్ని ఐయుండడమే కాకుండా అందులరాజునవు షేరవాన్ కన్న మిక్కిలి న్యాయకర్త యున్ను దీనసంరక్షకుడున్ను కూడా ఐయున్నందున సంతోషించి ఒకలోగిలికొని అక్కడ కాపురము ఉండడమునకు నిశ్చయించడమైనది కొంచెంరోజులలోనే మా గాటయాసము తీరి సందున కావలసిన సామానుకొని ఆచిన్నదాన్ని మహమ్మదు మతాచార ప్రకారము వివాహము చేసుకొని ఉభయులమున్ను కలిసియుండెను మూడుసంవత్సరములలో అక్కడి చిన్న పెద్దలందరితోటిన్ని సహవాసము చేసి మోటుబడినిపించుకొని విశేషమైన వర్తకము చేసి తుదకు వాళ్లందరికిన్ని మించిపోయినాను వొకరోజున అక్కడి పెద్దమంత్రిని చూడడమునకు బైలుదేరితే ఊరుబైలు పాస్థానము ప్రజపోగైయున్నందున ఆ సేమనిరెవరినో అడిగితే ఇద్దరు మనుష్యులు జారత్వము చోరత్వము నడవడ్యజరిగించినందున వాళ్లకో కొట్టిచంపివేస్తున్నారని చెప్పినాడు అనగానే అయ్యో నన్నున్ను ఈవిధముగానే ఉరితీయడమునకు సిద్ధమైతే భగవంతుడు రక్షించియున్న సంగతి జ్ఞాపకమువచ్చి వాళ్లు ఎవళ్లో ఎటువంటి ఆపదను పొందియున్నారో నిజమైన దోషులో లేక నావలె నేరుకుట్ర చేతపట్టుబడ్డారో కనుగొందామని ఆసమూహమును వొత్తిగించుకొని లోపల చొరబడి చూస్తే నవరునాయిద్దరన్నలే పెడరెక్కలు విరిచికట్టి తలముడటోపి కాళ్లకు జోడు లేకుండా ఈడ్చుకొని బోవబడుతూవున్నారు వాళ్లముఖము చూడగానే నాయొంటిగా క్షమసుకైరై గుండెకాయి బంట్రోతులకు వొకపిడికెడు మొహరులు ఇచ్చి వొకనిమిషము తాళుమని చెప్పి గుఱ్ఱాన్ని దవుడాయించి అధికారి యింటికి వెళ్లి ఆయనకు విశేషపు వెలగల వొకకెంపునజరు దాఖలు చేసి మనవిచేస్తే వొకమనుష్యుడు వాళ్లమీద ఫిర్యాదు చేసి నేరము రుజువుపరచినందున రాజాజ్ఞ ఐనదని అంటే నేను బహువినయముగా అనేకవిధ

(౧౧) సరదీపు అనగా సిలోన్ అనే లంక.

ముల ఆ అధికారిని ప్రార్థిస్తే ఆయన ఆఫీర్యాదినిపిలుపించి అతనికి నాచేత అయిదువేలరూపాయీలు ఇప్పించి ఉత్తుర్దా మోసేనుపుచ్చుకొని అటువంటి పద్రవములోనుంచి వాళ్లను తప్పించినాను మహారాజా నేను అబద్ధమే ఆడుతున్నానో నిజమే ఆడుతున్నానో వీళ్లను అడుగుండి అప్పుడు వాళ్లు ఇద్దరు తలకిందికెపంచుకొని నిలుబడియుంటే ఇంటికి తీసుకొనివచ్చి స్నానముచేయించి బట్టలుకటించి దివానుఖానాలో వాళ్లను ఉండేలాగున చేసినానుగాని ఆపర్యాయము తన భాగ్యనువాళ్లఎదుటను నడవనివ్వలేదు ఐతే వాళ్లస్సేవలో సిద్ధముగా ఉంటూకూడా భోజనముచేస్తూ ఉండేవాడను పరుండడమునకుమాత్రములోపలికి వెళ్లేవాడను మూడుసంవత్సరములపర్యంతము ఈచొప్పుననా అన్నలపరామర్శ జరిగినది వాళ్లివల్లనున్ను నామనస్సు చెడిపోవడమునకుతగిన ఏకార్యమున్ను జరగలేదు నేను ఎప్పుడైనా పైకి వెళ్లినప్పుడు వాళ్లు ఇంటిలోనుండిపోతున్నందున పతివ్రతఅయిన నాభార్య వొకరోజున స్నానముచేసేనిమిత్తము వెళ్లి ఖచేరిలోకిపస్తే పురుషులు కనపడనందున ముసుకుతీసినది అప్పుడు ఈరెండో అన్నేకాబోలు మేలుకొనే పరుండియుండిచూస్తూన్నే మోహించిపెద్దన్నతో తెలియచేయగా ఉభయులున్ను నన్నుచంపివేయడమునకునిశ్చయించినారు ఈసంగతినాకేమిన్ని తెలియలేదుసరే కదావిశేషించి ఓభగవంతుడా ఈపర్యాయముఇంతవట్టుకువీళ్లుఅటువంటివని యేదిన్ని సేయలేదుఇప్పుడువీళ్లప్రవర్తనబాగుపడ్డది సిగ్గువచ్చినది కాబోలునని కూడా అనుకొంటిని వొకరోజునభోజనముచేసినతరవాత పెద్దన్నగారు కళ్లనిండానీళ్లు దెచ్చుకొనితనస్వస్థలముయొక్క స్తోత్రమున్ను (హీరాన్) దేశముయొక్క మంచిన్ని చెప్పడమునకుసుపక్రమించినాడు ఇదివింటున్నే రెండోవాడున్ను ఆలాగుననే అవునని పొగుడుతూవచ్చినాడు స్వదేశమునకువెళ్లవలెనని ఉన్నయెడలమీసెలవుకువిధేయుడనే అనిన్ని నాకున్ను ఆకోరికెకలిగియున్నది గనక భగవంతుడు అనుగ్రహించి సత్కుమందు నేనున్ను తమపాదసేవచేస్తూ వస్తాననిన్ని అన్నాను ఈసంగతి నాభార్యతో తెలియచేస్తే తిరిగి ఏమైనాదగా సేయడమునకు ఆలోచించినారేమో మీరుబాగా తెలుసుకొండనిన్ని వాళ్లుమీయొక్కప్రాణమునకుశత్రువులై యున్నప్పటికిన్ని నన్నునుగుండెలమీద ఎక్కించుకొనిసంరక్షిస్తూఉన్నవిధముగా వాళ్లను పోషిస్తున్నా గనిన్ని వాళ్లయొక్క స్నేహమునమ్మతగియుంటే మీఇష్టప్రకారము జరిగించవచ్చునుగాని ఈదుష్టులయెడల జాగ్రతకలిగియుండవలసినదనిన్ని చెప్పినది ఆపిమ్మటకొంచకాలములో ప్రయాణమునకు కావలసినపదార్థములు సిద్ధపరుచుకొని ఊరుసైలఘేరా వేయించినాను

అనేకమందిజట్టుకాళ్లున్ను కుదరడమేకాకుండా వాళ్లందరిపైని నేను పెద్దగానుం డుమనియున్ను వాళ్లుఅంగీకరించినందున మంచిముహూర్తము చూచుకొని బైలు దేరినాముగాని నా అన్నలవిషయమై నేను జాగరూకుడనై యుండేవాడను ఏ యితే అన్నివిధములనున్ను వాళ్లఆజ్ఞనుమన్నించిన్ని ననగ్గనకోరిన్ని యుండేవా డను వొకరోజున వొకమజిలీలో ఇక్కడికిక్రోసెడుదూరమున స్వర్గసంబంధమయిన వొకధారయున్ను మైదానమున్ను గులాబిమొదలైన తరహాతరహా రంగులుగలపు ష్పాలతోటయున్ను ఉన్నదనిన్ని నిజముగా విహరించడమునకు అశ్చర్యకరమయిన స్థల మనిన్ని నీకుయిష్టమయినయెడల రేపు అక్కడమకాము చేస్తే దేహసౌఖ్యమున్ను మాగాణయాస నివారణమున్ను కలుగుతున్నదనిన్ని నా రెండో అన్న చెప్పినందు కు సెలవేనాకు కావలసియున్నదిగనక ఆలాగున చేస్తానని అనడమేకాకుండా వాళ్లఆజ్ఞాప్రకారము రేపటిదినము అక్కడమకాము చేస్తామని సమూహాస్థు అందరికిన్ని తెలిసేలాగు ప్రకటనచేయించి చలిదిభోజనమునకు కావలసినతరహా తరహాకలపదార్థములు సిద్ధపరచవలసినదని వంటవాళ్లకున్ను తెలియచేశినా ను తెల్లవారగట్లనే ఉదోభాగ్యనిధులు ఇద్దరున్ను బట్టలుతొడుక్కొని నడుముకట్టుకొనినన్ను లేపి త్వరగాత్వరగా చల్లచల్లగా అక్కడికివెళ్లివిహరింతా మనిజ్ఞాపకముచేసినారు నేనువారి తప్పించుమని అంటేసంచారమునకు పాద చార్యాయోగ్యముంటున్నదని అన్నందున కాసుదారులతో రెండుగుఱ్ఱాలు సిద్ధపర చివెనకతీసుకొనిరమ్మని చెప్పినాను యిద్దరు గులాములు మాత్రము కాసీకిళ్లున్ను కుక్కాగున్ను పట్టుకొని కూడావచ్చినారు మార్గములో ఊచలుఎగిరించు కొంటూవెళ్లుతూనుంటిమి ఆసమూహామునకు దూరముగా వెళ్లినతరువాత వొ కనౌకరును ఏదోపనిమీదపంపించి మరికొంతదూరమునడిచి రెండోనవుకరును హొన్నిపిలుకడమునకున్ను తోలివేసినారు నాకుగ్రహచారముపట్టియున్నందున నోటికిముద్రవేసినట్టు ఊరికే ఉంటేవాళ్లకు తోచినట్లుగా చేసినారు తుదకు మాటలా డుతూనన్ను వొంటరిగా దూరముతీసుకొనిపోయినారుగాని యీకుక్కమాత్ర ము వదలకుండానే ఉన్నది చాలాదూరము వెళ్లినాముగాని ఆనీరుధారకనపడ లేదు ఆవనమున్ను లేదు ముళ్లకంచెలతోనున్న అడవిలో మాత్రము వెళ్లుతూనుం టిమి అక్కడ నేను అల్పాచమనని మిత్తముకూర్చుంటే ఫిరంగుకత్తిమెరుపుకనప డ్డందున తిరిగి చూస్తే రెండో అన్నగారు నన్ను కత్తితో నరికినాడు బుజ్జి రెండువాలిక లై అయిపోయినది ఓక్రూరుడా నన్నెందుకు కొడతావని అన్నాను ఇంత లో పెద్దన్నా రెక్కలసందున నరికినాడు ఉభయులుకత్తులతో నాకుగాయములు

చేస్తేరక్తమైపోయినందున అప్పుడు ఈఇద్దరు నిర్దాక్షిణ్యులు నేనుచనిపోయిన
ట్లుమనస్సుసమాధానపరుచుకొన్నారు ఈశునకము ఆవుపద్రవముచూచి వాళ్ల
మీదపడ్డది దీనికిన్ని గాయములుచేసినారు తరవాతవాళ్లుతమచేతులతోనే శరీర
ములమీద ఆనవాలుగా చిన్నచిన్నచురకలపెట్టుకొని తలవిరబోసుకొని వట్టికా
ళ్లనడకతో ఆదండులోకితిరిగి వెళ్లిదొంగలువచ్చిఅడవిలో తమతమ్ముణ్ని చంపివేసి
నారనిన్ని తామున్ను వాళ్లతోదెబ్బలాడితేగాయములుచేసినారు గనక త్వరగా
యిక్కడినుంచి బైలుదేరకపోతేవచ్చిదోచుకొనిపోతారనిన్ని చెప్పినందున ఆస
హవాసస్థులంతాఆవార్తవినినిర్విణ్ణపడి తొందరగా బైలుదేరి వెళ్లిపోవడమున
కు ఉపక్రమించినారు నాభాగ్యనాళ్లయొక్కగుణాతిశయములున్ను నావిషయ
మైవాళ్లుజరిగించిన దగానడవడిన్ని వినియున్నందున ఆమాటవింటున్నేకైజారు
తోపొడుచుకొనిచనిపోయినది ఓఫకీరులారా (శునకారాధపరుడైన) ఆఖాజా
తనయొక్కస్థితిన్ని సంభవించిన ఆపదలున్ను యీప్రకారముయింతమట్టుకు చె
ప్పడమువినగానే మాకున్నుదుఃఖమువచ్చినది అతడుచూచి ఓమహారాజా అమ
ర్యాదకాకపోయినయెడల బట్టలుతీసి నాశరీరముయావత్తున్నుచూపిస్తానని మ
నివిచేస్తే సెలవైనందున ఊర్ధ్వకాయముమట్టుకు కనపరిస్తేగాయములులేకుం
డా ఉన్నబెత్తుపుస్థలమైనాకనపడలేదు మాసన్నిధినేతలమీద టోపితీస్తే తాళువ
పట్టునఎంతగుంటపడియున్నదంటే వొక దానిమ్మపండు కేవలము అందులో ఇ
మిడిపోతున్నది అప్పుడు హుజారులో హాజరుగానున్నసభికులంతా అదిచూడడ
మునకు ఇబ్బంది చేత తమకళ్లుమూసుకొన్నారు తిరిగిన్ని ఆఖాజా ఓమహారా
జామీరుచల్లగానుండవలెను ఈయిద్దరన్నలున్ను అప్పుడు నను చనిపోయినాననను
కొనివెళ్లిపోయినారు వొకవైపుననేనున్ను వొకవైపున ఈశునకమున్ను గాయ
ములతోపడియుంటిమి వొంటిరక్తమంతాకారిపోయినందున శక్తిన్ని తెలివిన్ని
ఎంమాత్రమున్నూ [illegible]డానుండెను జీవించియుండడమునకు వూపిరి ఎక్కడనత
గులుకొని ఉండెనోనాకేమి తెలియదు నేనుపడియున్నస్థలము (సరండీవు) అనే
లంకకుసరిహద్దయినందున విస్తారము జనసమూహముగలవొకపట్టణముకూడా
ఆసమీపమందుండెను ఆపట్టణములోవొక హిందూదేవాలయము కలదుఅక్క
డిరాజుకు మిక్కిలిన్ని సౌందర్యవతియైన వొకకొమార్తెకలిగియుండెను ఆ
నేకమందిరాజులున్ను రాజకుమారులున్ను ఆమెనుమోహించిచెడిపోయియుం
డిరి ఆదేశమందు రాణివాసములేనందున ఆచిన్నదిపగలంతాచెలికత్తెలనువెం
టతీసుకొని వనవిహారమువేటాడడము జరిగిస్తూనుండేది నేనుపడిఉన్నస్థలాన

కు సమీపముగా రాజసంబంధమైనవొకతోట ఉన్నందున ఆరోజునతండ్రివద్ద సె
లవుపుచ్చుకొని అందులోకి ఆమెవచ్చి సంచారనిమిత్తము ఆమైదానముమీదికితిరు
గుతూవచ్చెను కొందరుదాసీలుగుఱ్ఱపుసవారులై నేనుపడియున్న స్థలానకువచ్చి
నామూలుగువిని దగ్గిరనిలువబడి నాస్థితిచూచి ఏడుస్తూవెళ్లి అమ్మా వొకమొగ
వాడున్నా వొకనునకమున్న రక్తములోమునిగిపడియున్నారని చెప్పినందున విం
టున్నే ఆమెస్వయముగానాపద్దికివచ్చి విచారపడుచూస్తే గుడుగుడుమని జీవము
న్నట్టుకనపడ్డందున దాసీలుయెత్తిచూచి యింకా బ్రతికియున్నట్టుమనవిచేసినా
రు ఆమట్టున శివాసిమీదవరుండబెట్టి తోటలోకి మోయించుకొనివెళ్లిసర్కారు
శస్త్రవైద్యుణ్ని పిలుపించినన్నున్ను శునకమునున్న బాగుచేస్తే ఇనాముఇచ్చేద
మనుతున్నదని తెలియచేసినందున అతడునాయొంటిరక్తమున్నమూలిన్ని బాగా
తుడిచిశుభ్రముచేసిసారాతోకడిగగాయములుకట్టిపలాస్త్రివేసి (బేదముషర్కు) అ
రఘున్లిక్షుప్రత్యామ్నాయముగా నాకతుకలోపోసినారు రాజకొమార్తె
రాత్రింపగళ్లుయావత్తున్ను నాతలవైపునకూచుండియుంటున్న నాసేవచేయి
స్తున్నమూడునాలుగుపర్యాయములు కోడిపడిదమయినా పానకమైనా తనచే
తులమీదుగా ఇచ్చి పానముచేయిస్తూనుండేది తుదకు నాకు తెలివివచ్చిచూస్తే
ఏదుర్మార్గుడున్నీ విషయమయి ఈలాగుజరిగించినాడు గుడిలో ఉన్న విగ్రహ
రూపుడైన దేవునికైనా జడిసినాడుకాడని ఆమెమిక్కిలి విచారముతో అంటూ
నుండేది పదిరోజులుఅయ్యేటప్పటికి అంఖుపానకము మాజునము వీటియొక్క
బలముచేతనేను బాగాకళ్లుతెరిచిచూస్తే యింద్రసభ నాచుట్టున్ను వ్యాపించి
యున్నట్టుకనపడ్డది మరిన్ని రాజకొమార్తె నాతలవైపున నిలువబడియున్నం
దున చూచివొకపర్యాయము ఆహాయని మెల్లిగా లేవడమునకు యత్నపడ్డాను
గాని శక్తిలేకమానుకొన్నాను ఆమె నాయందుదయదలచి నీవు స్తిమితముగానుం
డుభయపడకు యెదుమార్గుడో నిన్ను ఈలాగునహింసించినప్పటికిన్ని ఆ
పెద్దవిగ్రహమునన్ను నీయందు అనుగ్రహించేలాగనచేసినదిగనక యికను బా
గుపడుతావన్నది నేనుతిరిగిన్ని ఆమెనుచూచిస్మారకముతప్పిపోయినాను అదిఆమె
గ్రహించిపన్నీరుబుడ్డితోస్వయముగానామైనిచల్లినదితుదకుఇరువైరోజులలోగా
గాయములుఎఱ్ఱపుండుపడినలవైరోజులు అయ్యేసరికిఆరోగ్యస్నానముఅయినం
దున ఆమెమిక్కిలిసంతోషించి వైద్యునికి చాలాబహుమతిచేసినాకుబట్టలు తొ
డిగించినది భగవదనుగ్రహమువల్లనున్ను ఆమెజరిగించిసంరక్షణము వల్లనున్ను

సారాపట్టించిమాటలువింటున్నసంతోషిస్తూనుండేది నేనున్న చమత్కారము
యినకథలుముచ్చటలుచెప్పి ఆమెమనస్సుసంతోషపరచేవాడను వొకరోజుననా
సమాచారమడిగితేనేను యావద్వృత్తాంతమున్ను ఆరంభముమొదలుకొని అం
తమయ్యేపర్యంతమున్ను చెప్పినందుకువిచారపడి ఇదియావత్తున్ను మరిచిపొయ్యే
లాగునసీకుసదుపాయముచేస్తానని అంటే (భగవంతుడు) మీకు క్షేమముకలుగచే
యవలెను మొదటనుంచి నా ప్రాణసంరక్షణచేసినందున. ఇప్పుడు నేనుమీవాడ
నైయున్నాను గనుక ధర్మార్థముగానే యెల్లప్పుడునునాయందు అనుగ్ర
హ ముంచవలసినదని మనివిచేసేనాడను వొకరోజు రాత్రి నేను నమాజు చే
సుకొంటూనుండగా ఆమెవంటరిగావచ్చి చూచికేలకేలనవ్వి వీడుఏమిటో చేస్తు
న్నాడువెళ్లిచూతువా అనిదాయీనిఅడిగినది నేను అదివింటున్న భయపడ్డాను తర
వాత ఆమె ఎదుటకివచ్చినంతలో అప్పనోయి నీవు ఏమిచేస్తున్నావని అడిగితేనే
ను జవాబు చెప్పలేకపోయినాను ఇంతలో దాయి నాప్రియమయిన అమ్మా
ఈమనుష్యుడు మన ఆలయములోనున్న దైవానకు విరోధియయిన తురకై
యున్నట్టుకనుపడుతున్నది తనదైవమును పూజిస్తూ ఉన్నట్టు తోచుచున్నదని
మనివిచేయగానే రాచకొమార్తె చేతులు పిసుక్కొని వ్లోపోయినది నేను
అదివింటున్న నిశ్చేష్టుడనైనన్ను ఏమిచేసునో అన్నభయముచేత నిద్రపట్టక తె
ల్లవారేపర్యంతము యేడుస్తూనుంటిని యీవిధముగా మూడురోజులు జరిగిన
ది నాలుగోరాత్రి ఆమె సారాత్రాగిన నిషాతో దాయీనివెంటతీసుకొని మి
క్కిలి కోపముతో నేనున్న స్థలమునకువచ్చి పుష్పలతోటకు అవతలనిలుచుకొని
ఆతురక మనదైవము యొక్క ఆగ్రహమునకు పాత్రుడై చని పోయినాడా
ఇంకా బ్రతికియున్నాడా అని దాయీని అడిగితే ఇంకాడూపిరియున్నదనిజవా
బుచెప్పినందున వానియందు నాదృష్టి మళ్లిపోయినదిగాని ఐనాపైకి రమ్మని చె
ప్పమన్నదిదాయి నన్ను కేకవేయగా. వెళ్లిచూస్తే రాచకొమార్తెముఖము కోప
ముతో తుమతుమలాడుతూ ఎఱ్ఱగామండిపడుతూవున్నది నేనుసలాముచేసి చేతు
లుకట్టుకొని నిలువబడితే క్రూరదృష్టితో నన్నుచూచి దాయితో వీణ్ని ఊచతో ఎగ
రవేస్తే నాతప్పితముమనదైవము క్షమిస్తున్నదా లేదా అనిన్ని వీణ్నిఇంటనుంచి
సంరక్షించడముచేత నాకు మిక్కిలి పాపము సంభవించియున్నదనిన్ని అంటే
మీరుఎరగకుండా చేసినదైనందున మీకుమంచేసంభవిస్తున్నది వానికి చెడ్డతప్పద
నిన్ని అన్నది అదివిని రాచకొమార్తె దాయిచేత సౌజ్ఞచేయించినందునకూర్చు
న్నాను ఆమెనిగన్నతో సారావుచ్చుకొని ఈదురదృష్టవంతునికిన్ని వొకగిన్నెఇస్తే

నిరాయాసముగా చచ్చిపోతాడని అన్నది ఆప్రకారము దాయీ ఇచ్చినందున
నిరాతంకముగాపుచ్చుకొని సలాముచేసినాను నావైపుఎంతమాత్రమున్ను చూ
చినదికాదుగాని కీగండ్లతో దొంగతనముగా చూస్తూనుండెను అప్పుడునాకు ఆ
కైపుతలకెక్కి వెట్టిమొట్టిపదాలుపాడుతూ గొంతుమీదకత్తి వేసి నరికినప్పటికిని
పూపరేసిల్ఫి ఉన్నది యేమిబ్రతుకని అర్థంగల వొకకవిత్వముచెప్పి చదివినాను
అదివిని చిన్ననవ్వునవ్వి దాయీతోనీకు నిద్రవస్తూఉన్నదా అనిఅడిగితే ఆమతము
గ్రహించి అవునని సెలవుపుచ్చుకొనివెళ్లినది మరియొక నిమిషములోగా రాచ
కొమార్తెగిన్నెడుసారాఅడిగితే నేనుతీసుకొనివెళ్లిఇచ్చినందున పుచ్చుకొన్నది
అప్పుడునేను ఆమెపాదాలమీదపడితే నామీదచెయ్యివేసి - నెమిరి అయ్యో వెట్టి
వాడా మాప్రత్యక్షదైవమును వదిలిపెట్టి అదృశ్యపదార్థమును . పూజిస్తావు
యేమనిఅడుగడమునకుపక్రమించినది నేను న్యాయమునివ్వవలసినదనిన్ని కొంచె
మువిచారించిచూస్తే నమస్కరించడమునకు అర్హైన మేతగియున్నాడనిన్ని ఎందు
వల్లనంటే వొక్కనిశ్లోచుక్కవల్ల నిపంచుసౌందర్యవతిని సృజించి మిమిలాసము
చూపించి అనేకులమనస్సునకు వెర్రెత్తేలాగునచేసినాడనిన్ని వొకశాశీపనివాడు
రాయినిచెక్కివిగ్రహముచేసి బుద్ధిహీనులుపట్టుబడేనిమిత్తము బలపంచిపుంచి
నాడనిన్ని సైతాను అదినిజమైనదైవమని భ్రమపుట్టిస్తున్నాడనిన్ని మేము తురకల
మయినందున పుట్టించినవాణ్నే దైవముగా భావిస్తాముగాని మనుష్యునివల్ల చే
యబడినబొమ్మలయందు గురుతుఉంచమనిన్ని చేసినఅనేకవుపదేశములను తెలుసు
కొని రాచకొమార్తెమనస్సునమెత్తబడి నాకున్నుమీమతము తెలియచెయుమని
అన్నదినేనుమంత్రముచెప్పితే మంచిమనస్సుచేతధరించి అపచారము చెప్పుకొని
తురకలలోకలసి తన తలిదండ్రులుబొమ్మలనుపూజిస్తారుగదా వాండ్లకేమిదారి
అని అన్నదిఅందుపైని ఎవరికర్మమువారిదనిఅంటే తన్ను పినతండ్రికుమారు
నికి వివాహముసేయ నిచ్చయించినారు ఈఆపదయేలాగు తప్పుతున్నదనిఅన్నది
మీరుక్రమమయినమాటే ఆడుతున్నారుగనుక మీయిష్టమువచ్చినట్టు సేయవచ్చు
ననిఅంటే ఇకనుఇక్కడతాను ఉండడమునకు ఇచ్ఛలేదనిన్ని మరియెక్కడికైనా
వెళ్లిపోదామనిన్ని అన్నదివసము ఏలాగుపారిపోయి ఎక్కడికెవెళ్లగలమని అంటే
ముందుగానీవు నావద్దనుంచివెళ్లి తురకలసత్రములోనున్న మెడలఅందరికిన్నినీమీ
దఅనుమానముఉండదనిన్ని మీదేశమునకువాడలు వెళ్లడముకనుకొని నాకుకబురు
పంపిస్తేమనముఉభయులము అంచుమీదుగా రవానాఅవుదామనిన్ని ఆమెచెప్పినసం
దున తెల్లవారగానేవెళ్లి నేనుఆసత్రములోవొకగది అద్దెకుపుచ్చుకొనిదిగినాను

నేను ఆమెనుమెడబాసినదిమొదలుకొని తిరిగిన్ని కలుసుకొంటామని ఆశచేత బ్ర
తికెయుంటిని రెండుమాసములయ్యేసరికిరూమ్‌షామ్ హీరాన్ దేశములతా
లూకు వర్తకులంతాస్వదేశమునకు నీళ్లమీదుగా వెళ్లడమునకు ప్రయాణమయి
నారు వారితోనాకున్న పరిచయముకలిగినందున వాడలోవొకగది కేవుకుపుచ్చు
కొని వొకరోజునరాత్రిముందుగా నాతాలూకుపెట్టె అందులో ప్రవేశపెట్టి
నాతాలూకుదాసీనిన్ని శునకమునున్ను కూడాతీసుకొనివస్తానని వాడకామందు
తోచెప్పితే రేపుఉదయమున నేవాడలంగరుయెత్తుతాముగనక పెందలకడనేరా
వలసినదనిఅన్నాడు అటుతరువాత గ్రామములోకివచ్చి రాచకొమార్తె వద్దికి
వర్తమానముపంపిస్తే ఆమె రెండోవారికి తెలియకుండా రెండుయామముల
రాత్రివేళ వొకనగలపెట్టె తీసుకొనివచ్చినందున మేము ఉభయులమున్ను మి
క్కిలి విశ్వాసముగల ఆశునకమున్ను తెల్లవారగట్ల పడవమీదుగావెళ్లి ఓడయె
క్కినాము ఆవాడ లంగరుయెత్తుకొని రవానాఅయినది ఇంతలో పొగరులోనుం
చి ఫిరంగిలధ్వనివినబడ్డది ఇదిఏమిటోఅని అందరున్నుతొందరచేత విచారపడ్డా
రు ఓడకుతిరిగి లంగరువేసినారు వర్తకులంతా కేవు (౧౨) కప్తానుకుజడిసి
తమవద్దనుండే చక్కనిదాసీలు మొదలయినవాండ్లను పెట్టెలలోపెట్టి తాళము
లు వేసినందున నేను ఆ రాచకొమార్తె విషయమయిన్ని ఆలాగే జరిగించి
నాను ఏమంటే ఆరాజుసిగ్గుచేత తనకొమార్తె పారిపోయినదన్నసంగతి ఎవ
రికిన్ని తెలియచేయక ఆచిన్నదానిబద్దునౌఖరి వుస్తామనేమిషమీదఆయోడలో
నున్న స్త్రీలనందరినిన్ని పట్టితెప్పించి యెంచుకొంటామని సెలవ్వుయిచ్చినందున
ఏతన్నిమిత్తము, కేవుకప్తానుకొందరు నౌఖరులనుతీసుకొని వొకపడవమీద స
వారిఅయి వోడమీదికివచ్చి అందులో వొక . పెట్టెమీదకూర్చుండి దాసీలనుఎం
చడమునకు ఆరంభించినాడు రాజకుమార్తె ఊసుఏమిన్ని రానందున నేనుభగ
వత్ప్రార్థనచేస్తూ ంటిని జతపడ్డంతేమందిదాసీలను కేవుకప్తానుతాలూకు మ
నుష్యులుపడవమీద ఎక్కించినారు అతడుస్వయముగా కూర్చుండియున్న పె
ట్టెతాలూకుమనుష్యునితో నవ్వుతున్న నీదాసిదాన్ని ఎక్కడదాచినావని అడిగి
తే ఆబుద్ధితక్కువమనుష్యుడు ఆపెట్టెలోనున్నట్టు కేవుకప్తాను గ్రహించినా
డనుకొని జడిసితమపాదములతోమనేనేకాదు అందరున్న ఈలాగుననే పెట్టె
లలోవేసి తాళములువేసుకొన్నారనిఅన్నాడు ఆమాటవింటున్నే అతడు అన్ని

---

(౧౨) కేవుకప్తానులనగా ఓడలమీదనుండేఅధికారి.

పెట్టెలున్ను శోధనచేయముడమునకు ఉపక్రమించినా పెట్టెనన్ను తీయించి అం
దులోనున్న రాజకొమార్తెను అందరితోటిన్ని తీసుకొని వెళ్లినాడు అందుపైని
మరియేమిన్ని ఆశలేకపట్టిపుణ్యానకు ప్రాణముపోగొట్టుకొన్నట్టుభావించి ఇక
నాబ్రతుకునందలి ఆశకూడామరిచిపోయి రాత్రిపగలుయంవతున్న దేవుడా
నీవేగతిఅనియంచుతూనుంటిని తెల్లవారేసరికి అందరితాలూకు స్త్రీలనున్ను తిరి
గీపంపించివేసినందున వర్తకులంతా సంతోషించినారు వొక్క రాచకొమా
ర్తెమాత్రమురానందున అందుకుకారణమేమని అడిగితే రేవుకప్తాను ఉంచుకొ
నిఉండుననిన్ని ఇకజరిగినదానికి విచారపడవద్దనిన్ని దానికిన్ని త్తువర్తకులమం
తా చందాచేసుకొనినీకు ఇస్తున్నామనిన్ని అంటే నాసంచ ప్రాణములు ఎగిరి
పోయిదేశానకురానని వారితో చెప్పితిరిగివొడ్డుకువచ్చినాను ఈశునకమున్ను నా
తోచేతిరిగివచ్చినది వొక నగలపెట్టెతప్పతేదివస్త్రసామానంతా రేవుకప్తాను
నవుకరులకు ఇచ్చివేసివొక నెలపర్యంతమున్ను అంతటావెతకడమునకు మొదలు
పెట్టినానుగాని ఆరాజకుమార్తెజాడయెక్కడనున్ను దొరకనదికాదువొక రా
త్రిపహారొవొకమిషమీద రాజుగారిమహలులోకి వెళ్లిశోధిస్తే ఆమెజాడకనుపడ
లేదు తుదకు రేవుకప్తానుయింటను ఆమె ఉంచెపుండవలెను లేకుంటే మరియె
క్కడనున్ను లేదనినిశ్చయించి అతనియింటచుట్టు తారుతూలోపలికివెళ్లడమునకు
దారిదొరుకుతున్నదేమోఅని తిరుగుతూనుంటేమనుష్యుడు పట్టేంత విశాలమైన
కాలువవొకటికనపడ్డదిగాని అందుకు ఇనపజాలుడాపడముచేసి యున్నందున
కష్టపడిఅదిఊడదీసిఅందుగుండాలోపలజొరబడి ఆడవేషమువేసుకొని ప్రతివై
పునున్ను చూడగా వొకస్థలమందు ఎవరోవొకరుదైవప్రార్థనచేస్తూ ఉన్నని
ధముగావొకధ్వని నాకువినబడి ఎదుటకువెళ్లిచూస్తే ఆరాచకొమార్తె వింతగా
ఏడుస్తున్నందున ఈమతాంతరులవల్లనుంచి విముక్తికలగజేయవలసినదనిన్ని న
న్ను (ఈఖాజానుతో) క్షేమముగాకలుసుకొనేలాగున చేయవలసినదనిన్ని దైవ
మును ప్రార్థిస్తూ ఉన్నది నేనుపరుగెత్తి ఆమెపాదాలమీద పడ్డాను ఆమెనన్ను
కౌగలించుకొన్నది వొకపర్యాయమే ఉభయులమున్ను మూర్ఛాగతులమైనా
ము తెలివిరాగానే ఆమెను అడిగితే రేవుకప్తాను అందరుస్త్రీలనున్ను వొడ్డుకుతీ
సుకొనివచ్చినప్పుడు దైవమునుగురించినేను నారహస్యము బయలుపడకుండా
నున్ను నీతుమరేఖున్ను ఆపదరాకుండానున్ను చేయవలసినదని ప్రార్థనచేసినం
దున ఆరక్షకుడుఅనుగ్రహించినేను రాచకొమార్తెనని ఎంతమాత్రమున్ను
ఎవరున్ను తెలుసుకొనేలాగునచేయకుండా చేసినాడనిన్ని రేవుకప్తాను అందరు

స్త్రీలలోనున్న నన్నుఫసందుచేసి ఎవరికిన్ని తెలియకుండా తన ఇంటికిపంపించివే
సితతిమ్మావాండ్లను ఫాదుషాదగ్గిరకుపంపిస్తే అందులో నేనుకనపడనందున వాండ్ల
కుసెలవిచ్చివేసి రాచకొమార్తె మిక్కిలి కాయలాగానున్నదని ప్రకటనచేసినా
రనిన్ని ఈపైని నేనుకనపడనియెడల అపకీర్తి రాకుండా ఉండగలందులకు ఇకకొం
చెముగోజులలోచనిపోయినట్టు అన్నిదేశములలోనున్న కబురులుఫుట్టిస్తారనిన్ని
ఇప్పుడు రేవుకస్తానునాతో క్రీడించడమునకుచాలా ప్రయత్నముచేస్తున్నప్పటికి
నేనుఅంగీకరించలేదుగాని బలవంతపరచేయెడల దేహత్యాగము చేయడమున
కునిశ్చయించుకొని యున్నానన్ని చెప్పి ఇక్కడనుంచి విడుదలకావడమునకు నీ
వు చేయగలిగితే వొకసాధనమున్నదని అంటేమి సెలవైతే అగ్నిలోఉరుకుతాన
నిన్ని ఆకాశముమీదికిఎగురుతానన్ని తెలియచేస్తే ఈదేశములో ఎవరైనాదివా
లాపడ్డయెడల ఆఆసామిదేవాలయముదగ్గిరకువెళ్లి అంతాజోళ్లువట్టేస్థలమందు
ఉన్నసల్లగొంగళికప్పుకొనికూచుంటే స్వామిదర్శనానకువచ్చేమనుష్యులంతా
నగలుబట్టలునగదుమొదలైనవి ఎవరెవరికి తోచినట్టుగా ఆమనుష్యునెదుట
ధర్మార్థము పడవేస్తారన్ని మూడురోజులుఅయ్యేసరికి పెద్దపోగు కాగానే
పూజారి వొకమనిష్తికూడా ఇచ్చిపంపించివేస్తాడనిన్ని ఆలాగననేనిప్పుడు వెళ్లి ఆ
గొంగడినిండాకప్పుకొనికూచుంటే అక్కడనుంచివెళ్లుమని అన్నప్పుడు నేను
సొమ్ముకోసరమురాలేదు రేవుకస్తానుతనభార్యనుతీసుకొన్నందున ఫిర్యాదుచేసు
కోవచ్చినాను ఈగుడియజమాని అయినవెజ్జురాలితో ఈస్థితి తెలియచేసినా కా
ర్యముచేయిస్తే సరేలేకుంటే ఆదేవుడే ఆమెకునాస్థితి తెలియచేస్తాడని నిరీ
క్షించుకొనికూచుండవలసినదనిన్ని ఆఅమ్మవారిమాటదైవవాక్కుగా అంతా
నమ్మిస్తారు గనక ఆమె ఈస్థితిరాజుకు తెలియచేయగానే కార్యముసఫలమవు
తున్నదనిన్ని సలహాచెప్పినందున. నేను తిరిగి ఆతాను కాలువ తెన్నవెళ్లిపో
యివచ్చి అదేప్రకారము జరిగించినాను ఆపిమ్మట ఆముసలమ్మనన్ను లోపలి
కిపిలిపిస్తే వెళ్లిచూచేవరకు నవరత్నఖచితమైన సింహాసనముమీద వొకపెద్దవిగ్ర
హము స్థాపింపబడియున్నది ఆయెదుట ఆమెజలతారు మసలందుమీద బాలీసె
క్కాలనుఆనుకొని మఠమువేసుకొని కూర్చుండియున్నది ఆమెకు రెండువందల
సంవత్సరములవయస్సున్న మునుపై ఆరుగురు సంతానమున్ను కలిగి యుండెను
ఆమెనన్నుఅడిగితే ఆరాచకొమార్తె చెప్పినవగసను రేవుకస్తానుమీద ఫిర్యా
దుచేసినాను అందుపైని నాయందు అనుగ్రహించి ఆమె ఇరుపార్శ్వములను
నిలువబడియున్న పది పంద్రెండుసంవత్సరముల యీడుగలయిద్దరు చిన్నవాం

డ్లతో ఈమనుష్యుని రాజువద్దికితీసుకొనివెళ్లి ఈస్థితి తెలియచేసి ఇతనిభార్యను యిప్పించివేసి రేవుకస్తానుకుశిక్షఅయ్యేలాగున చేయించవలసినదని దేవునిసెలవైనట్టుచెప్పుమని ఆజ్ఞాపించినందున ఆచిన్నవాండ్లు ఆమండపములోనుంచిబైలుదేరగానే పండాలు అంతాశంఖములుఊదుతూ కీర్తనలుపాడుతూ కూడా బైలువెళ్లినారు అక్కడిచిన్నపెద్దలంతా ఆయిద్దరు చిన్నవాండ్లయొక్క కాళ్లకిందిమట్టి మహాప్రసాదముగాఎంచి తీసుకొని కళ్లసద్దుకొంటూనుండేవారు ఈవిధముగాకోటదగ్గిరకు వెళ్లేవరకు రాజుకుకబురైనందున పాదచారియై ఎదురుగుండావచ్చిమిక్కిలి వినయముగాతీసుకొనివెళ్లి తనసింహాసనముమీద కూర్చుండబెట్టి ఎందుకు విజయము చేసినారని అడిగితే ఆబాపనపిల్లకాయలు తమతల్లివల్లవిన్నసంగతిచెప్పి ఆలాగునచేయకపోతే దేవునికి కోపమువస్తున్నదని కూడా భయపెట్టినారు రాజువింటున్నె చిత్తమని రేవుకస్తానును ఆచిన్నదానితో కూడా త్వరగాతనయెదుటికితీసుకొనివస్తే విమర్శించి శిక్షిస్తాననిసవుకరులకు ఆజ్ఞాపించినాడు ఇదివింటున్నె నేను గాభరాపడి రాజుమాతోను ఇక్కడికితీసుకొనివచ్చేయెడల ఈమర్మము బయలుపడి నాపని యేమవునో అనిజడిసి దేవుని ప్రార్థిస్తూనుంటినిగాని నోటివెంట శ్వాసమే బైలువెళ్లడమున్ను వొళ్లువడకడమున్ను ఉపక్రమించినది ఆచిన్నవాండ్లు నాలక్షణముచూచి ఈతిర్పు నాకుసమాధానములేదనిగ్రహించి తత్క్షణమేకోపపడిలేచి రాజుతోనీవు వెర్రివాడవై దేవతా భక్తిలేకుండా మావాక్యములఅస్పృశముగా ఎంచి ఆఉభయులనున్ను పిలిపించి నిజము కనుక్కోవలెనని యత్నపడుతున్నావు పెద్దవిగ్రహముయొక్క సెలవు మీకు తెలియచేసినాము మంచిది జాగ్రతగానుండుమని ఆబాపనచిన్నవాండ్లు యిద్దరున్ను కోపపడుతూలేచి నిలువబడ్డారు అదిచూస్తున్నె రాజుమిక్కిలిన్ని భయపడి బహువినయముగా చేతులుజోడించుకొని యెదుటనిలువబడి వణుకుతూ బతిమాలినాడుగాని ఆఉభయులు ఎంతమాత్రముతగ్గి కూర్చుండలేదు ఇంతలో ఆసభలో హాజరుగానున్నమంత్రులు ఉద్యోగస్తులు మొదలైనవారంతా అవును రేవుకస్తాను బహుపనికిమాలిన మనుష్యుడున్ను పాపాత్ముడున్ను దురాత్ముడున్ను అని యీబాపనచిన్నవాండ్లతల్లి తెలియచేయించిన సంగతి నిజమనిన్ని మొదలైనఅనేకసంగతులుఏకవాక్యముగారాజసన్నిధిని మనవిచేసి రేవుకస్తానుమీద దెబ్బలుకొట్టడమునకు అంతా ఉపక్రమించినందున ఆరాజుసిగ్గుపడి త్వరగాప్రశస్తమైనవొకదుస్తునాకుబహుమతిచేసి తనదస్తూరీతో నాపేరహుఖుం వ్రాసి తనముహూరుతీసి నాకు ఇచ్చి ఆమసలన్నపేర వొకవుత్తరము కూడా

[illegible]
[illegible]
[illegible] చేసినాను అంతలో [illegible]
[illegible] ప్రసుకొని తమ సెలవు ప్రకారము [illegible]
[illegible] బహుమతిచేసి పాతమనుష్యుని పంపవేసే అధికారము [illegible]
యందు ఉంచవతమే కాకుండా అతనివరస్థిరరూపమైన ఆ స్త్రీ కూడా [illegible]
[illegible]నిగా [illegible]ఇంచినాను గనక క్షమించవలసినదని కూడా ప్రసన్న[illegible]
గున ఆమె సంతోషించి దేవాలయములో ఉత్సవము చేయించి ఆయుధస్థలమైన
అయిదువందలమంది సిపాయీలను నాకు తయనాతుచేసి వాళ్ళ నాతో కూడా
రేవులోకివచ్చి రేవుకత్తానును పట్టుకొని నాకొప్పగించ గలందులకున్ను నేను
యేలాగుచెప్పితే ఆలాగువాణ్ని కొట్టగలందులకున్ను అతనియొక్క ఆస్తి సమగ్ర
తగా నాకొప్పగించగలందులకున్ను నేను సెలవిచ్చి పంపించినప్పుడు వాడొద్ద
క్రమముగా నవుఖరీచేసినట్టు రశీదుకూడా తీసుకొని రాగలందులకున్ను వాళ్లకు
ఆజ్ఞాపించి నాకు వొకపాగా బహుమతీచేసి సెలవిచ్చినందున నేను రేవులో
ప్రవేశించేవరకు వొకమనుష్యుడుముందువెళ్లి రేవుకత్తానుకు కబురుచేసినాను
నేను వెళ్లేసరికె అతడు తొందర పడుతూ కూచుండి యున్నందున రేవుస్థి
రంగీకత్తితో వొక్కమారే బుఱ్ఱగిరిపొయ్యేలాగున మెడమీదనరికినాను మరిన్ని
అక్కడి గుమస్తాలు షరాబులు మొదలైనవాళ్లను పట్టుకొని దస్త్రములన్నిన్ని
జప్తుచేసి లోపలికివెళ్లి రాచకొమార్తెతో కలుసుకొన్నాను ఉభయులమున్ను
కరినివొకరు కౌగలించుకొని దుఃఖించి తిరుగా సంఘటన చేసినందుకు దేవుడు
మంచివాడనికొనియాడినాము తరువాత వొకరికన్నీళ్లు వొకరుతుడుచుకొని పైకి
వచ్చి ఆ పేటావాలో ప్రవేశించి ఆఖచేరి తాలూకుఉద్యోగస్థులకుబట్టలుయిచ్చి
తిరిగీ వాళ్లపనులలో ప్రవేశపెట్టి నౌకరులకు చారులకు ఇనాములుయిచ్చి దేవా
లయములోనుంచి నతో వచ్చినవారిలో యెవరికితగినట్టు వారికికట్నాలు కానుక
లిచ్చి పంపించివేశినాను వారంరోజులు అయినతరువాత విశేష విలువైన సజ్జా
[illegible]రున్ను జలతారుబట్టలున్ను శాలూలున్ను సమస్తదేశముల తాలూకు వింత
వస్తువులున్ను విస్తారమైననగదున్ను రాజుకు నజరుపెట్టేనిమిత్తము తీసుకుని వారి
కి తగినట్టు ఉద్యోగస్థులకున్ను పండాలకున్ను పండాలభార్యలకున్ను మంచి
[illegible]త్తము నగలుతీసుకొని వచ్చి ఆ వెజ్జురాలియెదుట నుంచినాను ఆమె
నాకెద సునాకు బహుమతీచేసి కితాబుకూడా ఇచ్చినందున తిరిగి రాజుదగిరకు వె

పైన సజరు దాఖలుచేసి పూర్వోత్తర రేవుకస్తాను చేసిన వ్యవహార సంబంధమయిన తప్పితము లన్నిటినిన్ని క్షమించవలసినదని కోరినందున అందుకు రాజున్ను మంత్రులున్ను వర్తకులున్ను అంతా నాయందు అనుగ్రహించి గుఱ్ఱముకోకలు బహుమతులుచేసి కొన్ని గ్రామములు మొఖాసాయిచ్చి పరువుమర్యాదలున్ను కూడా దయచేసినారు తరువాత హుజూరున సెలవుపుచ్చుకొని ఇవతలికివచ్చి రాజసన్నిధాన వర్తకులకున్ను ఇతరులకున్ను తెచ్చినవియిచ్చి అంతా నామాటే ఆడేలాగున సమాధానపరచి పిమ్మట రాచకోమాటిను వివాహము చేసుకొని ముక్కాలి స్థిమితముగానున్ను క్షేమముగానున్ను ఆ దేశములో కాలక్షేపము చేస్తూ భగవత్ప్రార్థనచేస్తూ ఉంటిని నేనుయిచ్చే న్యాయమునకు ప్రజలంతా సంతోషిస్తూనుండేవారు నేను నెలకువొకపర్యాయము దేవాలయములోకిన్ని రాజసన్నిధికిన్ని వెళ్లుతూవస్తూనుంటే రోజుకురోజు వారు నాయందు అనుగ్రహిస్తూనుండేవారు తుదకు రాజుగారు నన్ను మంత్రాంగములో కూడా ప్రవేశపెట్టి నాసలహాలేనిది ఏపనిన్ని చేయనందున నిశ్చింతగా కాలముజరుగుతూ నుండెను ఆదిభగవంతునికే తెలుసును తరుచుగా ఈయిద్దరన్నలు ఎక్కడికిపోయినారో ఏలాగున నున్నారో అని మనస్సునందు విచారము కలిగియుండెను రెండు సంవత్సరములైన తరువాత జేసుబాదు దేశమునుంచివచ్చిన వొక వర్తకసమూహము తిరిగీ స్వదేశమునకు సముద్రముమీదుగా వెళ్లడమునకు నిశ్చయించుకొని అక్కడ కలిగియున్న ఆచారప్రకారము ఆ సమూహము తాలూకు సరదారుడు ప్రతిదేశము తాలూకు వింతవస్తువులు నాకు నజరు దాఖలు చేసినందున ఆ మరునాడు అతని డేరాకు నేను వెళ్లి చూస్తే ఇద్దరుమనుష్యులు చిరిగిపోయిన పాతగుడ్డలు కట్టుకొని నెత్తిమీదమూటలు యెత్తుకొని నాయెదుటికి తీసుకొనివస్తూ తిరిగి మోసుకొనివెళ్లుతూ ఉన్నందున చూచి వాండ్లు నా అన్నలని పోల్చి అటువంటి నీచవృత్తిలో వాండ్లు ఉన్నందుకు సిగ్గుపడి నేను ఇంటికిరాగానే వాండ్లను పిలిపించి ముస్తాబు చేయించి నావద్దనుంచుకొన్నాను ఆ పనికిమాలినవాండ్లు తిరిగినన్ను చంపివేయడమునకే ఆలోచించి వొకరోజున రెండుజాముల రాత్రివేళ అంతా నిద్రమత్తుగానుండడము కనుక్కొని దొంగలవలెనా తలవైపుదిక్కుకువచ్చినారు నా ప్రాణసంరక్షణనిమిత్తము గుమ్మములో పహరా ఉండడమే కాకుండా విశ్వాసముగల ఝూశునకమున్ను నా మంచముపట్టెదగ్గర పరుండియుండెను వాండ్లు కత్తివరలోనుంచి తీయగానే కుక్క అరుస్తూ వాండ్లమీద పడ్డది ఆధ్వనివిని అంతా మెలుకువ తెచ్చుకొన్నారు నేనున్ను తుళిక్కిపడి లేచినాను నా మనుష్యులు వాండ్లను పట్టుకొని

రక్షించినవాని భక్షిస్తున్నారన్న సామెత నిజమైనదని అష్టమైనట్లున్న శిక్షాదమున
కు ఉపక్రమించినాను మహారాజా మీకు దేవుడు చాలా మేలు చేయవలెను ఒక
టి రెండుమాత్రము క్షమించవలసినదనిన్ని మూడోతప్పితమునకు శిక్షించవలసి
నదనిన్ని శాస్త్రము సిద్ధమై యున్నందున వీండ్లను ఖైదు సేయడమునకు నిశ్చ
యించినానుగాని జయిలుఖానాలో పడవేస్తే వీరిద్దరకు ఎవరున్నూటికానా లేక ఆక
లిదప్పిచేత చచ్చిపోతురేమో లేక మరియేవిషమైనా తినివేతురేమో అనిన్ని యెల్ల
ప్పుడున్ను నాకండ్లయెదుట ఈపంజరములో నుంచినయెడల నాకు మనస్తిమితము
గానున్ను విశేషించి వాండ్లు సిగ్గుపడి మరి యేదుస్తంత్రమున్ను చేయకుండా ఉం
టారనిన్ని ఆలోచించి ఈప్రకారము జరిగించినాను ఈకుక్క పరువు మర్యాద వి
శ్వాసము కృతజ్ఞత కలిగి నాయెడ్ల సంచరించినది విశ్వాసహీనుడైన మనుష్యుని
కన్న ఉపకారియైన జంతువు ఎక్కువై యున్నందున ఆప్రకారము జరిగిస్తున్నా
నని తనస్థితి యిదనిన్ని యీపైని తన్ను ఖామందులు చంపివేయించండి లేదా ప్రా
ణసంరక్షణమే చేయించండి. తమచిత్తమనిమాతో ఆ (ఖాజా) మనవిచేసినాడు
అది వింటున్నే మేము అతనియందు అనుగ్రహించి నీయందు యేమిన్ని తప్పితము
లేదనిన్ని నీ అన్నలు అయోగ్యులనిన్ని కుక్కతోక పన్నెండు సంవత్సరములు పాతి
పెట్టి నావంకరగానే ఉంటున్నదిగాని తిన్నపడదని అన్నాము తరువాత ఆకుక్క
మెడలోనున్న పన్నెండుమాణిక్యములను గురించి అడిగితే (ఖాజా) మాతో ఓదైవ
సమానుడా నీకు దేవుడు దీర్ఘాయుష్యము నివ్వవలెనని కోరి తరువాత అందలి
వివరము చెప్పడమునకు నుపక్రమించినాడు.

తాను రేవు కప్తానుగానున్న స్థలమందు మూడుసంవత్సరములైన పిమ్మట బా
గరులో ఉన్నతమైన మేడమీదకూర్చుండి అన్నివైపులనున్ను చమత్కారము చూ
స్తూనుండగా అడివిలోనుంచి ఇద్దరు మనుష్యులు అస్తువారుల తెన్నువస్తూ ఉన్నట్టు
అతాత్తుగా కనపడ్డందున దూర్బీనుతో చూస్తే వింతగా కనపడ్డారు చోపుదారు
లను పంపించి పిలిపిస్తే ఒక మొగవాడు ఆడది ఇద్దరువచ్చినందున స్త్రీని లోగిటిలో
రాజకుమారి వద్దికి పంపించి పురుషుని యెదుటికి పిలిపిస్తే ఇరువై ఇరువై
యొక్క సంవత్సరముల వయస్సుగలవాడుగానున్ను మీసము గడ్డము అప్పుడే నూగు
దేరుతూ ఉన్నట్టుగాను ఉన్నాడుగాని ఎండతీక్ష్ణముచేత ముఖము నల్లబడిన్ని గోళ్లు
తల పెరిగిన్ని అడివిమనుష్యునివలెనున్నాడు మరిన్ని మూడు నాలుగు సంవత్సరము
ల వయస్సుగల ఒకచిన్న వాణ్ని భుజాలమీద ఎక్కించుకొనిన్ని రెండు మూటలు మెడ
కు వేలగట్టుకొనిన్ని వింతగా కనపడడందున నేను ఆశ్చర్యపడి చూచి ఓస్నేహితుడా

నీవుఎవరుఏదేశస్థుడవు నీవుఏమిఈలాగుననున్నావు అనిఅడిగితే అతడు దుఃఖపడి
మనలోకట్టుకొన్నమూటలు విప్పినాయెదుటపెట్టి ఆకలిఆకలి ధర్మాత్మా ఏమూ
గానైనా తినడానకుఇవ్వండిఅనిచాలాకాలమునుంచిగడ్డిగాదరఆకుఅలమువం
వతూడలుతింటున్నవచ్చినాననిన్ని కొంచమైనాతనకుబలములేదనిన్ని అన్నాడు
ఆక్షణమే నేనురొట్టెమాంసముసారా తెప్పించియిచ్చినందునఅతడువుచ్చుకోవడ
మునకుఉపక్రమించినాడు ఇంతలోరాణివాసములోనుంచివొకఖోజ్జాఅతనిభా
గ్యయిచ్చినది అనికొన్నిసంచులుతీసుకొనివచ్చినాడు నేను వాటనన్నిటనిన్నివిప్పి
చూస్తేప్రతితరహాకలిగినరత్నములుఅందులోవొక్కొక్కరత్నముయొక్కవిలు
వకురాజ్యముయావత్తున్ను ఇవ్వతగియున్నది ఉన్నతములోనున్ను ఎత్తులోను
న్నునీరుకలిగియుండడములోనున్ను వొకదానికన్న వొకటివిలువైనది అవితీసి
యుంచడముచేతలోగిళ్లన్ని తరహాతరహారంగులుగలవై పోయినవి అతడురొట్టె
ముక్కతిని గిన్నెడుసారాతాగి అలసటతీర్చుకొని స్తిమితపడ్డందున ఇవినీకు ఎ
క్కడదొరికినవనిఅడిగితే తనయొక్క నివాసస్థలము ( ఆబురుబాయిజాన్ )
అనిన్ని బాల్యములోనేఇల్లునాకిలితల్లినితండ్రిని ఎడబాసి అనేకకష్టాలు అనుభ
వించి చాలాకాలముతానుబ్రతికియుండే గోరీలోనుంచబడిమృత్యువు నోటనుం
చితప్పించుకొనివచ్చినాననిఅన్నందున అదియేమిటో వివరముగా తెలియచేస్తే
తెలుసుకొంటాననిఅంటే ఈవిధముగాచెప్పడమున కుపక్రమించినాడుతనతం
డ్రివర్తకవ్యాపారములోనుండే వాడైనందున యెల్లప్పుడున్ను హిందుస్తాన్
చీనాసీమమొదలైన స్థలములకు ప్రయాణముచేస్తూనుండేవాడు తనకు పదిసంవ
త్సరములవయస్సు కాగానే తండ్రిహిందుస్తాన్ దేశమునకువెళ్లేటప్పుడు నన్ను
కూడాతీసుకొనివెళ్లవలెనని కోరితేతల్లిపినతల్లిమేనత్తవగైరాలు ఇంకానేనుచిన్న
వాణ్ని గనుకప్రయాణముసేయడమునకు తగియుండలేదని అంటేతండ్రివినక
తానుముసలివాడనైనాననిన్ని తనఎదుటనే నేనుతరిబియ్యతుకాకపోతే ఈమా
టతనమనస్సులోనట్టేఉండిపోతున్నదనిన్ని చెప్పినన్ను వెంటతీసుకొని బయలు వె
ళ్లినాడు క్షేమముగాప్రయాణముజరిగినది హిందుస్తానులో ప్రవేశించి కొంత
సరుకు అమ్మిఅక్కడనుంచిమరికొన్నివస్తువులు పుచ్చుకొని షేరుబాదు దేశము
నకు వెళ్లినాము ఈప్రయాణమున్ను అనుకూలముగానేజరిగినది అక్కడనుంచి
సురక్షితముగానున్ను త్వరగానున్నుస్వదేశానకు రావడమునకు కొంతదినస్సు
పుచ్చుకొని ఓడఎక్కినాము నెలరోజులు అయినతరువాతవొకరోజున గాలివా
నాచుట్టివేసుగుతొండమంతలావుగా వర్షము కురువడమున కుపక్రమించినది

భూమిని ఆకాశమునుయావత్తున్ను చీకటిఅయిపోయినది ఓడచుక్కానీవిరిగిపోయి
నది మాలీమున్ను నఖోదాయున్ను నెత్తికొట్టుకొనియేడ్చినారు ఆ౨రోజులమధ్యాం
తము గాలిన్ని కెరటాలున్ను ఏలాగులాక్కొనిపోతే ఓడఆలాగుననే వెళ్లుతూ
నుండేది పదకొండోరోజున వొకకొండకు తాకపడి ఓడముక్కముక్కలై పో
యినది తండ్రిన్ని నవుకరులు చాకరులు సామానుయేమైనది తెలియదు నేనువొకబ
ల్లమీదపడియుండగామూడురోజులమట్టుకుదానియంతటనదే నీటిలోతిరిగినాలు
గోనాడువొడ్డుకుతగిలినది నేను జీవావశిష్టుడనుమాత్రమై ఆచెక్కమీదనుంచి
దిగి రేవులోకిబయలువెళ్లిఏలాగైతేనేమి ఘటమువొడ్డునచేరవేసినాను అక్కడికి
దూరముగా పొలముకనపడ్డది అక్కడఅనేకమంది మనుష్యులు పోగైయున్నా
రుగాని అంతానల్లగానున్ను తల్లికడుపులోనుంచిపుట్టిన విధముగా దిగంబరు
లై ఉన్నారునన్నుయేమోఅడిగినారుగాని నాకువాండ్లభాష యెంతమాత్రము
న్ను తెలియలేదు అందులో సెనగచేనుఉన్నందున ఆవెన్నులు కాలుచుకొని తిం
టూవుండగానన్ను ఆలాగుననేపుచ్చుకొమ్మని సంజ్ఞచేసినారు నేనున్ను వొకపిడి
కెడుతీసిపుచ్చుకొని కొంచెమునీళ్లుతాగి వొకమూలపరుంటిని నాకు నిద్రమెలు
కువవచ్చినతెరువాతఅందులో ఒకమనుష్యుడు నావద్దికివచ్చిదారి చూపెట్టినాడు
నేనుకొన్ని సెనగలుపట్టుకొనిఆమార్గముగావెళ్లితె వొకవిశాలమైన మయిదా
నముకనపడ్డందున ఆసెనగలుతింటూ వెళ్లగానాలుగురోజులకు వొకకోటకనప
డ్డది దగ్గిరకువెళ్లితేమిక్కిలియెత్తుగానున్ను ప్రతిదండే రెండేసిక్రోసులు పొడవు
గారాతికట్టడముతోనున్ను గుమ్మమువొక్కరాతితో చేయబడి పెద్దకప్పతా
ళమువేయబడిఉన్నదిగానిమనుష్యునిజాడఏమిన్ని అక్కడకనపడలేదు అక్కడనుం
చిముందునడిస్తే వొకమెట్టుకనపడ్డది దానిమట్టికాటుకవలెనల్లనైయున్నదిఅదివా
టిపైకివెళ్లగానే వొకపట్టణముకనపడ్డది దానికిచుట్టూపెద్దగోడయున్న ప్రతిస్థల
మందుబురుజులున్ను వొకవైపునవిస్తారమువెడల్పయిన ఏరున్ను ఉండియున్నం
దునమెల్లిమెల్లిగాగుమ్మముదగ్గిరకువెళ్లి శివాధర్మ దేవతా అని అడుగులోపలపెడి
తే జాతివానివలేముస్తాబైయున్నవొక మనుష్యుడు కుర్చీమీద కూర్చుండియు
న్నందున చూచినాను అతడునన్ను పరదేశినిగా ఆలోచించి ఎదుటికిరమ్మనిపిలిస్తే
నేనువెళ్లిసలాముచేసినందున మిక్కిలి అనుగ్రహపూర్వకముగా అందుకుప్ర
తిసలాముచేసిబల్లమీదను రొట్టెవెన్న కోడిమాంసముసారాఉంచికడుపునిండా
తినుమన్నాడు నేను కొంచెముతిని తాగిఒళ్లుతెలియకుండాపడివున్నాను రాత్రి కా
గానేకండ్లువిడ్డందున చేతులుముఖముకడిగించి అన్నముతినుపించి అతడునన్ను

వచ్చిన్నావాకూ నీస్థితి ఏమిటో చెప్పుమని అడిగితే జరిగినయావత్తున్ను వినుపించినాను అప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చినావని అడిగితే నేను చాలా కష్టపడి ఇప్పుడు పట్టణ ప్రముఖము చూచినాననిన్ని భగవంతుడు ఇంతమట్టుకు తీసుకొనివస్తే ఎందుకువ చ్చినావని అడుగుతున్నావనిన్ని అంటె యిప్పుడు పరుండు రేపు చెప్పవలసినదేమి టో చెప్పుతానని అన్నాడు తెల్లవారగా నేనన్ను పిలిచి పారజల్లెడతోలుసంచియి చ్చి మాఘారా వలసినదని అన్నాడు భగవంతుడు రొట్టెతినిపించి ఏమికష్టమైన పని చేయిస్తాడో అనిమనస్సున యోచించి విధిలేక అవి ఆయన యొద్ద టకీ తీసుకొని వ చ్చినాను అప్పుడు అవి పట్టుకొని ఆమిట్టమీదికి వెళ్లి గజములోతు తొవ్వి అందులో నుంచి బయలుదేరినవి ఆజల్లెడలతో జల్లిస్తే కింద కారినవి సంచిలో నింపుకొని తన యొద్దికి దీసుకొని రావలసినదని నాకు ఆజ్ఞాపిస్తే నేను ఆ దేవ ప్రకారము జరిగించగా తరహాతరహా రంగులు గల రత్నములు కనపడ్డవి వాటికాంతిచేత కండ్లు మలిగిపోయి నవి వాటితో ఆసంచి నిండా నింపుకొని ఆ స్నేహితుని వద్దికి తీసుకొని వెళ్లినాను అవి చూచి యివి నీవు పుచ్చుకొని ఇక్కడనుంచి వెళ్లిపోవలసినదనిన్ని ఈ పట్టణము లో యునికి మంచిది కాదనిన్ని ఆం పేతమ రుతనవిషయమై మిక్కిలి అనుగ్రహించి యింతవిస్తారము రత్నములు దయచేయసినారుగాని నాకు ఆకలి చేస్తే యివి యేమి చే యననిన్ని ఇంకా కొన్ని నాకు యిచ్చిన పట్టికెన్ని షేమకా రకువ స్తున్నదనిన్ని అ న్నాను అందుపైని ఆయన నవ్వి సిపైని నాకు ముక్కిలి కనికరముతో స్తున్నదనిన్ని నీవు మావలె ఫారసీ దేశస్థుడవయినందున పట్టణములోకి వెళ్లకుండా ఆటంకపరు స్తాననిన్ని ముఖ్యముగా వెళ్లడమునకే కోరిక కలియున్న యెడల నా ఉంగరము పు చ్చుకొని బాజారులోకి వెళ్లితే తెల్లని గడ్డము గలవాడొక మనుష్యుడు అక్కడ కూర్చుం డియుంటాడు అతడు చాలామట్టుకు నాపోలికగానే ఉన్నాడు నా పెద్దన్న అతనికి అది యిస్తే నీ జాగ్రత చేస్తాడు అతడు చెప్పినట్లెల్లా నడవవలసినది లేకపోతే పునా నవు చచ్చిపోతావు నా అధికారము యింతమట్టుకే పట్టణములో నాయిలాకా లేదు అనిన్ని అన్నందున నేను ఆ ఉంగరము పుచ్చుకొని సలాము చేసి సెలవు తీసుకొని పట్ట ణములోకి వెళ్లి చూస్తే వీధులున్ను బాజారులున్ను బహుశుభ్రముగానున్నవి మరిన్ని స్త్రీపురుషులు అనుకూలముగా ముస్తాబులై లజ్జ లేకుండా అమ్ముతూ కొంటూ ఉ న్నందున నేను అంతట తిరుగుతూ ఆ చమత్కారము చూస్తూ నడబజారులో ప్ర వేశించేవరకు ఇసుక వేస్తే రాలకుండానున్న మనుష్యుడు వెళ్లడమునకు సందు లేకుం డానున్న ఉండే వింత విస్తారము జనసమ్మర్దము కలిగియున్నది అది వొత్తిగించు కొని ముందు మేలాగైతే నేమి ఆ స్నేహితుని చూచినాను అతడు వొక కుర్చీమీద

కూర్చుండి రత్నఖచితమయిన గద్దె యెదుటనుంచుకొని యున్నాడు నేను వెళ్లి సలాము చేసి ఆఢంగరము ఇస్తే నావైపు కోపదృష్టితో చూచి ఇక్కడికి ఎందుకు వచ్చినావు నీయంతట నీవే ఆపదలో పట్టుబడ్డావు ఆ బుద్ధిశక్కువ నాతమ్ముడైనా నిన్ను ఎందుకు పంపించినాడని అనందుకు అతడైతే చెప్పినాడు గాని నేను వినలేదని నా స్థితి ఆరంభము మొదలుకొని అవివరము జరిగినదియావత్తున్ను అగపరచినాను ఆ మనుష్యుడు విచి నన్ను వెంట తీసుకొని తనయింటివైపుకు వెళ్లినాడు ఆ యిల్లు రాజగృహము లాగున కనపడ్డది అనేకమంది నౌకరులు చాకరులు ఉండియున్నారు గదిలోకి తీసుకొని వెళ్లి కూర్చుండబెట్టి బహుమృదువుగా ఓచిన్నవాడా ఏమి అక్కరకుపని చేసినావు నీకాళ్లతో శ్మశానవాటికకు నడిచి వచ్చినావు ఎవరైనా ఈమాయమంత్రాలు గల పాషిష్ఠి పట్టణములోకి వస్తురా అని అంటే నేను నాస్థితి ముందుగానే తెలియచేసియున్నాను నాకర్మము తీసుకొని వచ్చినది ఐతే అనుగ్రహించి ఇక్కడి మార్గములున్ను ఆచారములున్ను తెలియచేసినట్టయితే గ్రహించి మీ తమ్ముడున్ను మీరున్ను ఇక్కడ ఉండకుండా ఆటంకపరచడమునకు కారణమేమో తెలుసుకొంటానని అన్నాను అప్పుడతడు ఇక్కడి రాజున్ను సమస్తమైన ప్రజలున్ను దేవుడియొక్క నిగ్రహానకు పాత్రులై వింతయిన ఆచారములున్ను మతమున్ను అవలంబించియున్నారననిన్ని ఇక్కడ దేవాలయములోనున్న ఒక విగ్రహము కడుపులోనుంచి దెయ్యము ప్రతివారియొక్క పేరు జాతి మతము తెలియ చేస్తున్నదనిన్ని విదేశస్థులు ఎవరైనా వచ్చినట్టు రాజుకు తెలియగానే వాండ్లను ఆమండపములోకి తీసుకొని వెళ్లి ఆవిగ్రహమునకు సాష్టాంగము చేయిస్తాడనిన్ని ఆలాగు చేయనివాణ్ని ఏటిలో తోసివేస్తారనిన్ని అందులోనుంచి పైకి లేచివస్తే ఒక తరహా రోగము పుట్టి మరికదల మెదలలేకుండా నుండి పోతాడనిన్ని ఇది ఇటువంటి మాయోపాయములు గల పట్టణమైనందున నీయావనముమీద నాకు కనికరము పుట్టి కొంచెము రోజులైనా బ్రతకడమునకు విషయమై ఒక ప్రయత్నము చేస్తాననిన్ని అంటే అదియేమిటో ఆజ్ఞాపించవలసినదని అన్నాను అందుకాయన వజీరుకొమార్తెను నీకు పెండ్లి చేస్తాననిన్ని తుదకు ఫకీరువాడైనప్పటికిన్ని ఆవిగ్రహానకు సాష్టాంగపడితే రాజుకూతురిని అడిగినా అతని సంతోషముకొరకు యిస్తాడనిన్ని రాజుకు నాయందు నమ్మకమున్ను స్నేహమున్ను కలిగియున్నందున సమస్తమైన సభికులు పండితులున్ను గొప్ప చేస్తూ ఉంటారనిన్ని అంతా వొకవారములో రెండుగోజుల దేవాలయములోకి వెళ్లి పూజిస్తారనిన్ని రేపటిదినమే అంతా పోగుపడతారు

గనుక నేను నిన్నున్ను తీసుకొనివెళ్లుతానని చెప్పి అన్నపానాదులు ఇచ్చినందున పుచ్చుకొని పరున్నాను ఉదయమున నే నన్ను వెంట తీసుకొని దేవాలయము నకు వెళ్లినాడు అక్కడచూస్తే మనుష్యులు వెళ్లుతూవస్తూ పూజిస్తూవున్నారు రాజున్ను గొప్పవారలున్ను విగ్రహముఎదుట అర్చకులయొద్దతలమీద నేతిబిన్నీ లేపుండా వినయముగా రెండు మోకాళ్లపైని కూర్చుండియున్నారు అక్కడవివాహముకానటువంటి సుందరులైన స్త్రీపురుషులు నాలుగువైపులనున్ను గంధర్వులవలెను వంక్తులుతీర్చి నిలువబడియున్నారు అప్పుడు ఆస్నేహితుడు నావైపు తిరిగి నేను ఏలాగుచెప్పితే ఆలాగుచేయుమనిఅంటే మంచిదని అన్నందున ముందుగా రాజుయొక్క చేతులుకాళ్లుముద్దుబెట్టుకొని మంత్రియొక్క చేటుగుపట్టుకొమ్మని అన్నాడు నేను ఆలాగే చేసినందున రాజుఇతడెవరనిన్ని ఏమంటాడనిన్ని అన్నాడు ఆపెద్దమనుష్యుడు ఇతడుతనకు బంధువుడనిన్ని ఏలినవారి పాదము ముద్దుబెట్టుకొవలెననిన్ని మంత్రికొమార్తెను వివాహము చేసుకొవలెననిన్ని కోరికచేత దూరదేశమునుంచి వచ్చినాడనిన్ని ఈవిగ్రహముయొక్క ఆజ్ఞయున్ను తమయిష్టమున్ను అయినయెడల కార్యమవుతున్నదనిన్ని అన్నాడు ఆపిమ్మట రాజు మామతమువలంబించినయెడల శుభస్యశీఘ్రమనిఅన్నాడు ఆక్షణమే దేవాలయములో నగారావాయించడము మొదలుపెట్టి గొప్పబట్టలు నాకు కట్టించి నల్లనితాడువొకటి నామెడలోవేసి ఆవిగ్రహముయొక్క సింహాసనము నకుటికె యీడుచుకొనిపోయి సాష్టాంగముగచేయించి నిలువబెట్టినారు అప్పుడు ఆవిగ్రహములోనుంచి ఓసాయబూ నీవుమాకు వందనముచేసినావు గనుకనీపని బాగుపడ్డది ఇకమాయొక్క అనుగ్రహానికున్ను కటాక్షానకున్ను పాత్రుడవై యుండవలసినదని వొకధ్వనిబయలువెళ్లినది అదివింటున్నే ప్రజలంతాసాష్టాంగపడి భూమిమీదపడి దొర్లడము మొదలుపెట్టి చహంబాష్ మీకే యీదేవత్వము తగియున్నదని స్తోత్రముచేసినారు సాయంత్రముకాగానే రాజామంత్రులుఇద్దరున్ను సవారినైమంత్రియింటికివచ్చి అతనికొమార్తెను వారి ఆచార ప్రకారము నాకువివాహముచేసి ఆమెకువిస్తారము అరిణముపెట్టినారు మరిన్ని ఈవిగ్రహముయొక్క సెలవుప్రకారము ఈచిన్నదాన్ని మీసేవనిమిత్తముఇవ్వ వలసినదని చెప్పి బహువినయముగా ఉభయులనున్ను వొక యింటనుంచినారు ఆచిన్నదాన్ని నేనుచూస్తే నిజముగా గంధర్వస్త్రీవలెనున్నది నఖముఖనాసికలు బాగానున్నవి పద్మినీజాతి స్త్రీకిచెప్పియున్నలక్షణములు యావత్తున్ను ఆబిడయందుకలిగియున్నందున సంతోషముగా ఆబిడతో భోగించినాను ఉదయాననే

నముచేసి రాజువద్దికివెళ్లితే ఆయనవొకదుస్తుబహుమతీచేసి యెల్లప్పుడున్ను ద
ర్బారులోఇంటూఉండవలసినదని సెలవిచ్చినారు మరికొన్నిరోజులైనతరువా
త రాజసభలో ఆలోచనకర్తనుకూడా ఐనాను రాజు నాసహవాస మునను
మిక్కిలిన్ని సంతోషిస్తూతరుచుగా బహుమతీలుచేస్తూ ఉండేవాడు నాతండ్రి
యొద్దవిస్తారముధనమున్ను సామగ్రిన్ని రత్నములున్ను ఉండేదైనందున యీ
శ్వామ్ముతోనాకు కారక్యములేకపోయినప్పటికిన్ని మిక్కిలి భోగరాగములయం
దే ఆసక్తికలవాడనైనందున రెండుసంవత్సరములపర్యంతముకాలము అనుకూ
లముగాజరిగినది ఇంతలోభార్యకు గర్భమునిలిచినది నెలలుతొమ్మిది నిండినతరు
వాత నొప్పులుపడడము మొదలుపెట్టినందున దాయీలు మంత్రసానులువచ్చి
నారు వొకమొగచిన్నవాడుకడుపులోనేచచ్చిపోయి జననమైనందున ఆవిషము
పురిటాలికికూడా ఎక్కిచనిపోయినది నేను విచారముచేత పెర్రివాడనై యిది
యేమాపదసంభవించెనని ఆమెతలవైపుదిక్కునకూచుండి యేడుస్తూఉంటిని
ఆయేడుపుధ్వని అందరిండ్లకువినపడ్డట్టుగానే నాలుగువయిపులనుంచిన్ని అనేక
మంది స్త్రీలు బైలువెళ్లివచ్చినానెత్తిమీద వొక్కొక్కచరుపుచరిచి అక్కడనేలు
పబడియేడుస్తూ ఉండేవారుఇంతలో ఎవరోవెనకమారుగావచ్చినాఅంగఖాద
పురుపట్టుకొనియీడిచినాడు ఎవరో అనిచూస్తేనాకుపెండ్లిచేయించిన మనుష్యు
డే మరిన్ని అతడునన్నుచూచి ఓబుద్ధితక్కువవాడా నీవుఎందుకుఏడుస్తావని అ
న్నాడు అందుకునేను ఓకరీనుడా నారాజ్యముపోవుడైపోయినదనిన్ని నాసం
సారసుఖములేకుండాపోయినదనిన్ని యిటువంటిసంగతిలోఏడుస్తావేమనిఅంటు
న్నావనిఅంటే అతడు చిరినవ్వునవ్వి ఇకను నీచావుకే ఏడువవలసినదికానివొకరి
కోసరముజరూరులేదనిన్ని నిన్న ఈపట్టణములోకి వృత్యువుతీసుకొని వచ్చినదని
పూర్వము నేనుచెప్పినట్టే అయినది ఇప్పుడు నీకు చావడముకన్న వేరేసాధన
ములేదనిన్ని అన్నాడు తుదకుప్రజలున్నన్నుపట్టుకొని దేవాలయములోకితీసుకొని
పోయినారు అక్కడరాజుమొదలుకొని ముప్పై ఆరుజాతులవారున్ను హాజరు
గానుండినాభార్యతాలూకుఆస్తియావత్తులోనున్ను ఎవరికికావలసినది వారుపు
చ్చుకొనిదానికిమ్మతురూపాయీలు అక్కడ ఉస్తూఉన్నారు అవిపెట్టిరత్నము
లుకొనివొకపెట్టెలోనుంచి రెండోపెట్టెలోరొట్టెలు హల్వామాంసముపండ్లు
యింకాతినుబడేసరుకులు ఉంచినారు శవమునువొకపెట్టెలోవేసిగుమ్మటములో
నుంచిరవానాచేసినారుతినుబడేవస్తువులతోనున్న పెట్టెవొకలొట్టిపిట్టమీదకట్టిపె
ట్టిఅందుపైనినన్ను ఎక్కించి జవాహిరుతోనున్న పెట్టెనాపక్కను ఉంచినారు

బ్రాహ్మణులంతా ఆముందరభజనచేస్తూశంఖములు ఊదుతూ ముందునడిచి
నారు వెనక అనేకమంది శుభంశుభంఅని అంటూకూడావచ్చినారు ఈవిధము
గా ఊరువెలపలకుమొదట నేనువచ్చిన దర్వాజాతెన్న తీసుకొనివెళ్లితే అక్క
డప్రథమము నాకుకనబడి ఉంగరముయిచ్చినమనుష్యుడునన్నుచూచి ఏడుస్తూ
ఓఅదృష్టహీనుడావ్యాఘ్రపుచేతపట్టుపడ్డావు నామాటవిన్నావుకావు పట్టణము
లోకివెళ్లి నిర్హేతుకముగా ప్రాణము పోగొట్టుకొన్నావు నాతప్పితమేమిన్ని
లేదు నేనువద్దనేచెప్పినానని అన్నాడుగాని నేనుబహుగంద్రగోళములోపడియు
న్నందునజవాబుచెప్పడమునకునోరురాకనున్ను ముందుజరిగేసంగతికనుక్కోవ
డమునకు మతిస్థిరములేకనున్ను ఉంటిని తుదకుప్రథమమునేనుచూచియున్నతో
టవద్దికితీసుకొనివెళ్లినారు అప్పుడు వొకపండితుడు, నావద్దికివచ్చిమనుష్యుడువొ
కరోజునజన్మమెత్తుతాడు మరియొకరోజున నాశముపొందుతాడు ఇదేప్రపం
చముయొక్కస్వభావము ఇప్పుడు నీస్త్రీచిన్నవాడు ధనమునలభైరోజులుజీవిం
చడమునకుతగినభోజనపదార్థములున్ను స్థిరముగానున్నవి వీటిని పుచ్చుకొని
దేవాలయములో వున్నవిగ్రహముయొక్క అనుగ్రహమువచ్చేవట్టుగు ఇక్క
డనుండుమనిచెప్పిచనిపోయిన భార్యకోసము సహగమనముచేయించినారు నేను
కోపముచేతఆవిగ్రహమున్ను అక్కడనున్నమనుష్యులనున్ను ఊరుదాచార
ములనున్ను దూషించడమునకున్ను ఆబ్రాహ్మణుడిదవడపండ్లు ఊడిపడేలాగు
నచెంపకాయలుకొట్టడమునకున్ను ఉద్యుక్తపడితేనాకు ఉంగరముయిచ్చినమను
ష్యుడునామాటకు అడ్డమువచ్చిజాగ్రతమేమిన్ని అనకూడదు ఆలాగుఅనేవా
డల ఈక్షణమేనిన్నుతగలపెట్టివేస్తారు నీకర్మము ఏలాగునన్నదో ఆలాగైనది
ఇకనుదైవానుగ్రహమునుకోరియుండేనీవు ఇక్కడనుంచి బ్రతికిపైకివత్తువేమో
అనిఅన్నాడు తరవాతఅంతానన్ను వొంటరిగావదిలిపెట్టిపైకివెళ్లిపోయిరి తిరిగీ
తలుపులుతాళమువేసినందున నేను వొంటరిగాఊరికేయేడుస్తూ తనపెండ్లాము
శవమునుతన్నుతూనీవుపిల్లనుకంటున్నే చచ్చిపోయేదానవైతే ఏందుకుపెండ్లిఆడి
కడుపుతోనున్నావని అంటూగట్టిగాకొట్టుతూతిరిగవిధిలేక ఊరికేకూచుండే
వాడను ఇంతలోప్రొద్దుఎక్కనందున ఎండకాకచేత తలలోనున్న మెదడుఊడ
కడమునకున్ను దుర్గంధముచేత ఊపిరి తిరగకపోవడమునకున్ను ఉపక్రమించి
నది ఎటువైపుచూచినా చచ్చినవాండ్లయెముకలున్ను జవాహారు పెట్టెలున్ను
పోగులుపడియున్నవి అప్పుడుకొన్నిపాతపెట్టెలుదొంతిపెట్టిపగలు రెండయు
న్నరాత్రివంచున్న తగలకుండాచేసుకొని నిర్లిసిమిత్తము వెతికితే కండమూతి

యింత వెడల్పుగల చిన్న రాతి జెల వొకటి కనపడ్డందున ఆసెళ్లవల్లనున్ను ఆ పదార్థాలవల్లనున్ను కొన్ని రోజులు కాలము జరిగినది తుదకు తిండిసామాను సరిపోయిన తరువాత గాభరాపడి దైవసాన్నిధ్యమందు మనివి చేసుకొంటే ఆయన అనుగ్రహించినందున తిరిగి కోటతలుపు తీసి వొక శవమును తీసుకొని వచ్చినారు. వానితో కూడా వొక ముసలివాడు వచ్చినందున వాణ్ని అక్కడ వదిలిపెట్టి అంతా వెళ్లిపోయినారు తరువాత ఈ ముసలివాణ్ని చంపి వీని తాలూకు తిండీ మొదలయినవి యావత్తున్ను పుచ్చుకొందామని ఆలోచించి వొక పెట్టె తాలూకు కోడు పట్టుకొని వాని వద్దికి వెళ్లేవరకు వాడు మోకాళ్లమీద తలవుంచుకొని విచారిస్తూ కూచుండి ఉండగా నేను వెనకమారుగా వెళ్లి యేలాగు కొట్టినానంటె వొక్కదెబ్బకే బుఱ్ఱబద్దలై మెడ ముఱ్ఱాడి కిందపడి చనిపోయినాడు అట్లాయినందున ఆ సామాను తెచ్చుకొని తినడమునకు వుపక్రమించినాను చాలాకాల పరియంతము నాకు యిదే పనియై వుండేది మరికొంత కాలమునకు గుంపటముతో కూడా మంచిలక్షణవతియైన వొక చిన్నది వచ్చినందున దాన్ని చంపడమునకు మనస్సు పుట్టినది కాదు అది నన్ను చూచి భయముచేత స్మారకము తప్పిపోయినది నేను దాని తాలూకు తిండి సామాను నా దగ్గిరను తెచ్చుకున్నానుగాని వొంటరిగా తినక ఆకలి వేసినప్పుడల్లా దాని యొద్దకు తీసుకుని వెళ్లి కలిసి తినేవాణ్ని ఆ పిమ్మట దాన్ని నేను హింసించనని తెలుసుకొని రోజుకు రోజు దాని భయము పోయి స్నేహమతిశయించినా బసకు వస్తూ పోతూ వుండేది వొకరోజున నీవు యెవరు నీ స్థితి యేమిటి అని అడిగితే తాను రాజుగారి వకీలు కూతురు అనిన్ని తన పినతండ్రి కొడుకుకు పెండ్లి చేసినందున వూరేగింపు సంభ్రమము రోజున పెండ్లికొమారుడు సూలనొప్పి పుట్టి గజగిజ గింజుకొని వక్కనిమిషములో చనిపోయినాడనిన్ని చెప్పి తిరిగి నా స్థితి అడిగితే నేను యావత్తు వృత్తాంతము తెలియచేసి భగవంతుడు నా నిమిత్తమై నిన్ను యిక్కడికి పంపించినాడని అంటే అది చిరునవ్వు నవ్వి వూరికే వున్నది ఈ విధముగా మాలో వకరితో వకరికి క్రమక్రమముగా మనస్సు కలిసినందున తురకమతాచారముల్లు దానికి వుపదేశము చేసి వివాహమాడుతానన్న షరతు మీద దానితో సంసారము చేసినాను అదిన్ని గర్భవతియై వొక కుమారుణ్ని కన్నది మూడు సంవత్సరములు అయిన తరువాత చిన్నవాడు పాలు వదిలిపెట్టినందున వొకరోజున భార్యతో ఇక్కడ యెంతకాలము ఉండగలము ఏలాగు పైకి వెళ్లగలమని అంటే అది దేవుడు అనుగ్రహించి ఇందులోనుంచి పైకి తీయవలెనుగాని లేకపోతే ఇందులో చచ్చిపోవడమే సిద్ధాంతమని అన్నందున నేను మిక్కిలి దుఃఖపడి యేడుస్తూ నిద్రపోయినాను స్వప్నములో వొక మనుష్యు

డు కనపడి తూముకాలువ తన్నరావలెనంటె బైలువెళ్లుమని అన్నాడు నేను సం
తోషముతో తుళ్లిపడిలేచి పాతపెట్టెలనున్న ఇనపమేకులు సళాకులు పోగుచేసి
తీసుకొనివస్తే కాలువ వెడల్పు చేస్తానని అంటే అది ఆప్రకారము జరిగించినందున
వొకసంవత్సరమయ్యేసరికి కష్టపడి మనుష్యుడుపట్టేటంత వెడల్పు చేసినాను తరు
వాత చనిపోయినవార్లతాలూకు అంగరఖాచేతులనిండా మంచిమంచిగొప్పర
త్నములు ఎత్తినింపుకొని మేముముగ్గురమున్ను పైకెత్తులువెళ్లివచ్చి భగవత్ప్రార్థ
నచేసి నెలరోజులనుంచి భయముచేత దారివదిలిపెట్టి అడవులలోనుంచి కొం
డలమీదనుంచివస్తూ ఆకలివేసినప్పుడెల్లా ఆకు అలముతింటూవచ్చినాము ఇదితన
స్థితియని ఆమనుష్యుడు తెలియచేసినాడు ఓ దైవసమానుడా మీరు క్షేమము
గానుండవలెను నాకుకనికరముదయించి అతనికితలంటనీళ్లుపోయించి మంచిబట్ట
లుతొడిగించి నా చేతికింద అసిష్టాంటుగా అతణ్ని ఉంచుకొన్నాను తరువాత
నాకు ఆరాచకొమార్తెవల్ల కొందరుపిల్లలు కలిగినారుగాని బాల్యములోనే చ
నిపోతూవచ్చినారు వొకచిన్నవాడు అయిదుసంవత్సరములు పెరిగి చనిపోయి
నందున ఆవిచారముచేత రాజుకొమార్తెయున్ను కాలముచేసినది అందువ
ల్లనాకుమిక్కిలిన్ని విచారముకలిగినందున స్వదేశమునకు వెళ్లగలందులకు రాజువద్ద
సెలవుపుచ్చుకొని రేవుకస్టానుద్యోగము నా అసిష్టాంటుకు వొప్పగింత చేసినాను
ఇంతలో రాజున్ను స్వర్గస్థులయినారు నేను విశ్వాసముగల ఈశనకమున యావ
త్తుధనము సామానుజవాహీరులతో కూడా తీసుకొని నేషాపూర్ అనేపట్టణ
ములో ప్రవేశించి తరువాత ఆప్రకారము పండ్రెండు మాణిక్యములు కుక్క
మెడలో అలంకరించినాను ఈనాస్థితియెవరికిన్ని తెలియనందున నేనుకుక్కను
పూజిస్తానని వాడికపుట్టినది ఈప్రతిష్ఠచేత హారాన్ ఫాదుషాయొక్క సర్కా
రులో రెట్టిగా ఈరోజువరకున్ను చెల్లిస్తూ ఉన్నాము ఇంతలో సౌదాగరుకుమా
రుడువచ్చినందున అతనిమూలముగా పెట్టుకొవడమునకు ప్రాప్తుణ్ని అయినానని
అన్నాడు అందుపైని మేము ఈచిన్నవాడు నీకుమారుడు కాడా అని అడిగితే కాడు
తమయొక్క రైతుగాని ఇప్పుడు నాకు ఖావందుగాని వారసుగాని ఏమైనాబుడే
ననగానే. ఈమాటవిని ఆచిన్నవానితో నీవు ఏవర్తకుని కుమారుడవు నీతలితం
డ్రులు ఎక్కడనున్నారని మేము అడిగితే ఆచిన్నవాడు నేలముద్దుబెట్టుకొని ప్రా
ణపంరక్షణము చేయవలసినదనికోరి ఈచిన్నదిసర్కారువశీయుకుమార్తె అనిన్ని
ఈవర్తకుని యొద్ద రత్నములున్నవని చెప్పినందున తనతండ్రి పైనియేలినవారుకొ
పముచిత్తగించి వొకసంవత్సరములోగా అర్థదలినిజముఋజువుపరచనిఎడలచంపిం

చి చేస్తామని సెలవుదయచేసినందున నేను ఈవేషము వేసుకొని (నేషాపూర్) వెళ్లి ఈఖాజానుఈకుక్కను ఆరత్నములతో ఖామందులసమ్ముఖమునకు తీసుకొనివచ్చినాననిన్ని ఈస్థితియావతున్ను తమరుచిత్తగించియున్నారుగనక అనుగ్రహించివృద్ధయినందున తనతంత్రీనిఖయిదులోనుంచి విడుదలచేయించగలందులకు ప్రార్థిస్తూఉన్నాననిన్ని మనివిచేసినందున అదివింటున్న ఆఖాజాపా అనిక్రిందపడిపోయినాడు అప్పుడు అతనిపైనిపన్నీరుజల్లిస్తేలేచియేమిబుద్ధితక్కువ ఈచిన్నవాణ్ణి దత్తతచేసుకొని ఉయిలుద్వారాతనఆస్తియితనికిదఖలుపరిచినాయెడలతనపేరు ఉంటున్నదనిన్ని ఇతణ్ణి తనకుమారుడని అంటారనితనకు పుట్టినఆలోచనచెడిపోయినదనిన్ని ఇదిస్త్రీఅయియుండిన్ని ముసలి మొగవాణ్ణిచేఋగొట్టినందున దీని-మాయలలో పడిపోయినాననిన్ని ఇంటనున్నున్ను ఉండక తీర్థమున్ను వెళ్లక మధ్యనూరకే గడ్డముమీసము గొరిగించుకొన్నవిధముగా అల్లరిపడ్డాననిన్ని అన్నాడు అందుపైనిమాకుకనికరముదయించి దగ్గరకుపిలిచిదుఃఖపడవద్దు ఈచిన్నదాన్నినీకు వివాహము చేస్తాము భగవంతులు దయచేసిన యెడలనీకుకుమారుడుకలిగినీఆస్తికికర్తకాబోతాడని చెవిలోచెప్పినందున అతనికి స్తిమితముతగిలినది ఆపిమ్మట ఆచిన్నదాన్ని లోగిటిలోకి పంపించివేసిమంత్రినిఖయిదులోనుంచితీసుకొనివచ్చి స్నానముచేయించి తిరిగిబట్టలు బహుమతీ చేసికట్టించి మాహుజూరుకు త్వరగాతీసుకొని రావలసినదని ఆజ్ఞాపించినాము వజీరురాగానే ఫరషు చివరపర్యంతము ఎదురుగుండా వెళ్లిబహుతెలిసిన వాడవనిశ్లాఘించి కౌగలించుకొని తిరిగీ ఆయనఉద్యోగములో ప్రవేశపెట్టడమేకాకుండా ఆఖాజాకున్ను మొఖాసాలుమొదలయినవియిచ్చి మంచిమహూర్తమందువివాహముకూడాచేయించినాముకొన్నిసంవత్సరములలోఇద్దరు కుమాళ్లున్ను వొకకొమార్తెయున్ను కలిగినందున అందులోనొకడు గొప్పవర్తకుడున్ను రెండోవాడు మాసర్కారులోస్వతంత్రవ్యవహారస్థుడున్ను అయియున్నారు ఓ: సలారామేను ఏతన్నిమిత్తము ఈకతమీయెదుట చెప్పినాముగనక ఇకనైనాగడిచినరాత్రిఉండిపోయినయిద్దరియొక్క వృత్తాంతమున్ను మాకుతెలియచేయవలసినదనిన్ని మమ్మునుమీసేవకునిగానున్ను ఈఇల్లుమీఆశ్రమముగానున్నుఆలోచించికొంతకాలము మావద్ద నుండవలసినదనిన్ని మహారాజు కోరివారిని చాలాపరామర్శచేసినందున మీకుకావలసియున్నయెడల మేమిద్దరమున్ను మాపూర్వోత్తరము తెలియచేస్తాముగనక వినుమనిఅన్నారు.

పాదుషాఆజాదుభక్తుచెప్పినకథ. ముగిసెను.



## మహా శోకఫకీరు కథ



ఈ మహాశోకఫకీరుమతమువేసుకొని కూర్చుండు అని సంబంధముయొక్క క్రమము సవిధముగా చెప్పడమునకు నుపక్రమించినాడు ఓ స్నేహితులారా ఈఫకీరు యొక్క స్థితిన్ని ఇతనికి సంభవించినఆపదయున్ను రాజైన మోహము జరిగించి నరీతిన్ని వివరముగాచెప్పుతాను చిత్తగించండి ఈవిధేయుడు ఫారసీ ఖండము తాలూకు ముఖ్యప్రదేశముయొక్క రాజుకుమారుడు తండ్రికితనకన్న వేరే కుమాళ్ళులేనందున నేనువయఃకాలములో స్నేహితులతో సొకటాలపాళిగంజీఫా చందరంగము పచ్చీసు ఆడుతూ ఉండడమైనాలేదా గుఱ్ఱపుసవారిమై తిరగడములోను వేటకువెళ్ళడములోను కాలక్షేపముచేయడమైనా జరిగిస్తూఉండేవాడను వొకరోజున జరిగినస్థితిఏమంటే గుఱ్ఱములనుతయారుచేయించి సవారిమై అందరి స్నేహితులను వెంటతీసుకొని ఊరిబైలుకువెళ్లి కముజులు కొంగలు మొదలైన పిట్టలమీద డేగలను బైరులును వదులుతూదూరముగావెళ్లితే అక్కడ ఎటుచూచినాకసుమారు మేరక్రోసులకొలది పచ్చనిచెట్లు ఎఱ్ఱనిపుష్పాలతోన్ను ఉన్న వొక వింతైనకొండ అగపడ్డందున ఆసక్తిలోపడి గుఱ్ఱపుకళ్ళెములనువదిలిపెట్టి మెల్లిగావొక్కొక్కఅడుగే నడిపిస్తూ సంచరిస్తూ వెళ్లుతూఉండగా వొకనల్లలేడి దానిమీదజలతారుతో నేసినఝూలున్ను మెడలోజలతారుతో అల్లిన పట్టెడకు బంగారపుముఖ్మాలున్ను రత్నఖచితమైన తిరుగుడున్ను కలదై ఎక్కడైతే మనుష్యసంచారమున్ను పిట్టఎగరడమున్ను లేదో అటువంటి మైదానముమీద నిమ్మళముగామేస్తూ తిరుగుతూ మాగుఱ్ఱపుడెక్కలచప్పుడువిని బెదిరి చెవులునిక్కపొడిచి తలఎత్తిచూచి వెళ్లుతూఉన్నందున. దాన్ని బ్రతికిఉండగానేపట్టుకోవలెనని నర్రదాపుట్టి స్నేహితులతో మీరుఇక్కడఉండుండనిన్ని జాగ్రత మీరుముందు అడుగువేసి నావెనకే ఎంతమాత్రమున్ను రావద్దనిన్ని చెప్పి బైలువెళ్లి నానుగుఱ్ఱము నాతోడలనందున ఏలాగుపక్షిమైపోయినదంటే అనేకపరియాయములు ఆలేడి కిదాట్లుమరిపించివేసి దాన్ని చేతితో పట్టుకొంటూ ఉండేలాగున పరుగెత్తినదిఅది చూచి ఆలేడినాలుగుకాళ్లతోన్ను లగువులు వేస్తూ గాలిమైపారిపోయినది. గుఱ్ఱమున్ను గాలితో మాటలాడుతూవెళ్లేదిగాని తుదకు కాలిధూళినైనా ముట్టుకో

లేక పోవడమే కాకుండా ఒళ్ళంతా చెమటెక్కి నురుగులు కూడా కక్కుకొన్నది నేనున్న దాహముచేత నాలుక ఎండిపోయి మరిగుఱ్ఱమును వదలలేక పోయినాను ఇంతలో సాయంకాలమైనది నేను ఎక్కడినుంచి ఎక్కడికి వచ్చినానో నాకు తెలియలేదు తుదకు విధిలేక దాన్ని మరిపించి పొదిలోనుంచి ఊచ తీసి విల్లు ఎక్కుబెట్టి ఆకర్ణాంతముగా లాగి గురిచూచి ఎగిరి స్తే తొలి ఊచ దానికాలున సరిగా గుచ్చుకొన్నందున అది కుంటుతూ కొండఅంచు వైపు వెళ్లినది ఈఘకేరున్న గుఱ్ఱము దిగి పాదచారినై దాని వెంటబడితే అది కొండ ఎక్కడము మొదలుపెట్టినది నేనున్నూ దానితో వెళ్లినాను అనేకములైన గొప్పలు ఎక్కి దిగిన తర్వాత వొక మండపము కనపడ్డది దగ్గరకు వెళ్లి చూస్తే చిన్నతోటయున్ను వొడ్డసబావిన్ని కూడా ఉన్నది ఆలేడి మరికనపడనందున నేను మిక్కిలిన్ని ఆయాసపడి అక్కడ కాళ్లూ చేతులూ కడుగుకొంటూ ఉండగా ఆమఠములోనుంచి అయ్యో తల్లి నిన్ను ఎగిసినవాని గుండెలకు నా ఉసురనే బాణము తగిలి యౌవ్వనము యొక్క ఫలమును పొందక పోనుగాక అనిన్ని గవంతుడు వాణ్ని నావలెనే దుఃఖిని చేయునుగాక అనిన్ని ఎవరో అంటూ ఏడుస్తూ ఉన్నట్టు ఆకస్మికముగా ఒక ధ్వని వినపడ్డందున నేను అక్కడికి వెళ్లి చూస్తే ఒక పెద్దమనుష్యుడు నెల్లని గడ్డను మంచి ముస్తాబు కలవాడై ఒకనసలందు మీద కూర్చుండివున్నాడు ఆలేడి ఎదుట పరుండియున్నందున దాని పిక్కలోనుంచి ఊచను తీస్తూ శపిస్తూ ఉన్నాడు నేను ఎదుటికి వెళ్లి సలాము చేసి అయ్యా మీరు క్షేమముగా ఉండవలెను ఈ కుత్సితము అజ్ఞానకృతముగా ఈ గులాము వానివల్ల జరిగినదన్ని దేవునికొరకు క్షమించవలశినదనిన్ని మనవిచేస్తే ఈ నోరెరుగని జంతువును నీవు హింసపెట్టినప్పటికిన్ని తెలియక చేసిన పనియైనయెడల భగవంతుడు క్షమిస్తాడని అన్నాడు నేను దగ్గరకు వెళ్లి కూచుండి ఊచ ఊడతీయడమునకు సహాయము చేసినాను మిక్కిలిన్ని కష్టముమీద అది తీసి గాయములో పలాస్త్రి వేసి చేతులు కడుగుకొని ఆ పెద్దమనుష్యుడు తనవద్దనున్న భోజన పదార్థములలోనుంచి కొంచెమిచ్చినందున పుచ్చుకొని ఉదకపానము చేసి వొక మంచముమీద కాళ్లు చాచుకొని నిమ్మళముగా పరున్నాను ఆ నిద్దురలో ఎవరో మొరపెట్టి ఏడుస్తూ ఉన్నట్టు వొకటి చెవినిపడ్డందున కళ్ళు నలుపుకుంటూ లేచి చూస్తే ఆబసలో ఆముసలివాడుగాని మరిఎవరైనాగాని లేకుండా నేను వొక్కడనే యున్నాను భయపడి నాలుగు వైపులనున్ను చూస్తే వొక మూల తెర వేసియున్నది అది ఎత్తితే అవతల వొక సింహాసనము మీద పదునాలుగు పదేను సంవత్సరముల వయస్సు గల వొక గంధర్వస్త్రీ మత్తాబులాగు వెలుగుతున్న జుసపాలు రెండు వైపులనున్ను వేలవదిలి నవ్వుముఖముతో జాతి

దొరసాని మోస్తరుగా ముస్తాబై ఖింత్తైనవై యార్యముగా చూస్తూ కూర్చుండియున్నదిమరిన్ని ఆముసలివాడు తనసిరస్సు ఆబిడపాదములమీద ఉంచుకొని శరీరస్ఫురణమేమిన్ని లేకుండా ఊరకే యేడుస్తూవున్నాడు నేను అతనియొక్క స్థితిన్ని ఆసౌందర్యవతియొక్క లక్షణమున్ను చూచి మూర్ఛబోయి శవములాగున ప్రాణములేకుండా పడిపోయినందున ఆముసలివాడు అదిచూచి పన్నీరు బుడ్డితీసుకొని తెచ్చి నామీదచల్లడమునకు ఉపక్రమించినాడు తరువాత నేనుజీవనముతో లేచి ఆప్రియురాలికి ఎదురుగుండా వెళ్లి సలాముచేస్తే ఎంతమాత్రమున్ను చెయ్యి ఎత్తనున్నులేదు పెదవికదల్పనున్నులేదు అదిచూచి ఓగులాబిపుష్పమువంటి శరీరముకలదానా యింతగర్వపడడమున్ను సలాము అందుకోకపోవడమున్ను ఏమతములో చెప్పియున్నదని అడగడమేకాకుండా స్త్రీకిమితభాషిత్వము అలంకారమైయున్నప్పటికిన్ని అంతవుపద్రవముగా ప్రియులు కళ్లుమూసుకొని పొయ్యే పర్యంతమున్ను నోరువిప్పకపోవడము న్యాయమా ఇదేమిటి అని అర్థముగల వొక శ్లోకము కూడా చదివినిన్ను పుట్టించిన భగవంతునికొరకు నోటితో ఏమైనా అనవలసినదనిన్ని నేము ఆకస్మికముగా ఇక్కడికి వచ్చినాముగనుక ఆతిథ్యము చేయవలసినదనిన్ని అనేకవిధములుగా కల్పించి మాటలు ఆడినానుగాని ఏమిన్ని వినియోగించలేదు ఆబిడ ఊరికే బొమ్మలాగు కూర్చుండి వినేది అప్పుడు ఎదుటికి వచ్చి కాళ్లమీద చేతులు వేసి ముట్టుకొంటే గట్టిగా తగిలినందున తుదకు ఈపత్నమును(౧) అజర్ అనే అతడు రాతితో చేసిన విగ్రహముకాని మనిషి కాదని గ్రహించి దాన్ని పూజిస్తూవున్న ఆముసలివానితో నేను మీ లేడికి కాలుమీద గుచ్చుకొనేలాగున ఎగిస్తే అందుకు బదిలీగా మీరు ఈ మోహము అనే ఆయుధముతో నాగుండెలు ముక్కముక్కలయ్యేలాగు ఛేదించివేసినారు మీశాపము పట్టుకొన్నది ఇకను దీనియొక్క స్థితి ఏమిటో ఈయంత్రము ఎవరు చేసినారో మీరు పట్టణము వదిలిపెట్టి అడవులు కొండలు పట్టి తిరగడమునకు కారణమేమో చెప్పుమని అట్టే పీడపెట్టి అడిగితే ఈమాటే తన్ను చెడగొట్టిన దన్నిన్ని ఏమినీవున్ను విని భ్రష్టుడవై పోతావా అనిన్ని అన్నందున ఇదివరకే చాలా మాయమాటలాడినావు ఇకనైనా కావలసినమాట చెప్పవలసినదని లేకుంటే చంపివేస్తానని గట్టిగా పట్టుకొని వదలనందున ఆముసలివాడు ఓచిన్నవాడా దేవుడు ప్రతిజన్మమునకున్ను విరహాగ్నియొక్క కాక తగలకుండా చేయవలెననిన్ని ఇది ఎట్టివంటి ఆపదలనుకలగచేస్తున్నదంటే ఆహేతువున నేకదా స్త్రీ పెనిమిటితో గుండానపడి ప్రాణము వదులుకొంటున్నదనిన్ని పరహాదుమజునూ అనే ఇద్దరి

(౧) అజర్ అనే అతను బొమ్మలను బాగా చేసే గొప్పపనివాడు.

యొక్క చరిత్ర సమస్తమైనవారికి విశదమయ్యె ఉన్నదిగదా ఇప్పుడది విన్నందువల్ల
నీకేమిఫలముకలుగుతున్నది ఊరికె గాథరాపడ్డి ఐశ్వర్యమువదులుకొని శోవట్లపి
యుంటున్నదనిన్ని అంటే అందుపైని నాకు కోపమువచ్చి చాలును ఇప్పుడునీస్నే
హము వొకమూలకట్టిపెట్టి ఉంచినన్ను నీశత్రునిగా ఎంచుకో నీకుప్రాణము
కావలసియుంటే సాఫుగాచెప్పుమని అన్నందున విధిలేక కండ్లనిండానీళ్లు తెచ్చు
కొని ఈఇల్లుచెడ్డవానిస్థితిఇదని ఉపక్రమించినాడు తానునేమాన్ సఖ్యా) …
నే పేరుగలగొప్పవర్తకుడను వయఃకాలములోవ్యాపారమునిమిత్తమును ద్వీప
ములున్ను సంచరించిఅందరిరాజులసన్నిధికివెళ్లినానుగానిజాతులవారిద్వీపమునకు
వెళ్లి ఆరాజును ప్రజలను చూడలేదనిన్ని వారిమతముఆచారము తెలియలేదనిన్ని
వొకపర్యాయము మనస్సుయందు కోరికఉదయించి స్నేహితులయొక్క యి
లాకాదారులయొక్క సలహాపుచ్చుకొని అక్కడికితగియుండేవస్తువులుపట్టుకొ
ని అనేకమంది వర్తకులను కూడాతీసుకొని ఓడమీదనెక్కి బయలుదేరడమైనది
గాలిబాగావేసినందునకొన్నినెలలకు ఆదేశములోకివెళ్లి ప్రవేశించి పట్టణములో
ఢేరావేసినాను అదివింతైనపట్టణముమరి ఏపట్నానితోతులదూగలేదు ప్రతిబ
జారులోనున్ను వీధులలోనున్ను కంకరతో చేసిన రస్తాలుకలిగియుండడమే గాక
నీళ్లున్ను చల్లిఉంటున్నవి ఎక్కడనున్ను వొకతృణమయినాఉండకుండా శుభ్రము
చేసి వుంటున్నప్పుడు ఇకచెత్తఅనేమాట ఎత్తడమునకే ప్రశక్తిలేదు తరహాతరహా
గలలోగిళ్లుకలిగియున్నవి రాత్రిభాగమందు ఉభయపార్శ్వములను అడుగడు
గుకు లాంతరులతో దీపములువెలుగుతూనుండేవి స్వర్గముదక్క మరిఎక్కడ
నున్ను లేనటువంటివింతైన పుష్పములున్ను ఫలములున్ను గలతోటలుఊరివెలు
పలనున్నవివరిన్ని అక్కడఎంతమట్టుకువర్ణన సేయడమునకున్ను తగియున్నది
తరువాత సౌదాగరులు వచ్చినారగన్న వార్తపుట్టినందున వొక మోతుబరైన
పెద్దబోల్లేరుగుఱ్ఱపుసవారినై కొందర్ను పరిచారకులను వెంటతీసుకొని మాదండు
లోకివచ్చి వ్యవహార లతోటి మీయజమానుడెవరనిఅడిగినాడు అందరున్ను నా
వైపుచెయ్యిచూపించినందున ఆయన నాబసవద్దకువస్తే తాజీముఇచ్చి ఉభయులము
న్ను వొకరికొకరము సలాములుచేసుకొన్నాము అనంతరము అతణ్ని చిత్రాసన
ముమీదకూచుండబెట్టి కాలికిందఉంచుకోవడమునకు వొక బెక్యాచేతితో అం
దిచ్చినాను పిమ్మట తమరుఇక్కడికివిజయముసేయడమునకు హేతువయేమో సెల
విప్పవలసినదని అడిగితే ఆబోల్లేరువిస్తారముగా సరుకుతీసుకొనివర్తకులువచ్చి
నట్టు మారాచకోమార్తెకు తెలిసినందున వెళ్లినారిని తీసుకొని రావలసినదని తన

కటాక్షించినారనిన్ని సర్కారులో ఉంచడమునకు లాయకైన ఆయాసాహే బులు తూ తీసుకొని వచ్చి వారి అస్థానమును ముద్దుబెట్టుకొనే ఫలమును పొందవ లసినదని అన్నాడు అందుపైని మాగాడయాసము కలిగియున్నందున ఈరోజు నకుతన నేరముతుమించవలసినదనిన్ని రేపటిదినము ముఖ్యావ /గా హాజరై నావద్ద నున్న సామానును నజరుదాఖలు చేస్తాను గనుక అందులో వారికి కావలసినది పుచ్చుకో వచ్చుననిన్ని వనివిచేసి అత్తరవు తాంబూలము ఇచ్చి పంపించినాను అందరువ ర్తకులను నావద్దికి పిలిపించి మొవ రెవరియొద్దనున్న వింతైనసరుకులున్నాయో ద్దనున్నవిన్ని పోగుచేసి ఉదయమున నేరాజుగారి మహల్ దేవిడీవద్దికి హాజరైనా నుచోప్దారులు నేనువచ్చినానని బకీరు చేసినందున సన్నిధికి రావచ్చునని సెల వైనది ఆబాళ్లేరు నాకు ఎదురుగుండా వచ్చి తన చేతులో నా చెయ్యి వేసుకొని స్నే హామాగాముగా మాటలాడుతూ మొదటి అంగడము తేన్న ఒకవిలాసమైన రాజ గృహములోకి తీసుకొని వెళ్లినాడు ఓస్నేహితుడా నీవు నమ్మవు గంధర్వస్త్రీలకు ఎగిరే రెక్కలు తీసివేసి వదలివేసిన విధముగా అక్కడ అనేకమంది స్త్రీలు ఉన్నారు ఎటువైపు చూస్తే దృష్టి అక్కడే తగిలిన్ని భూమిమీదనుంచి కాలు తేలితేలి పోతున్న ఉండేవిగాని నేనునిట్టూరుతూ ఎదటికి వెళ్లినాను ఆక్షణమే రాజకుమారుడు నను చూ చేవరకు మూర్ఛవచ్చి కాళ్లు చేతులు వణకినవి ఏలాగైతే నేమినిల్చి సలాముచేసి నాను కుడిఎడమ రెండువైపుననున్న బారులు కట్టి గంధర్వస్త్రీలవంటి రూపముగల మృదుస్త్రీలు చేతులు కట్టుకొని నిలవబడియున్నారు నేను సమస్తమైన తరహాలు గలరత్నములున్ను వస్త్రములున్ను ఇంకా తాను తెచ్చిన అనేకవింతవస్తువులున్ను కొన్ని మాటలతో ఆబిడహుజూరున నెంచి ఉంచినాను అవివారి చిత్తవృత్తికి బా గానున్నందున సంతోషించి బాళ్లేరు పరముగా ఇప్పించివీటి ఖరీదులెక్కప్రకా రము రేపటిదినము ఇప్పిస్తామని సెలవిచ్చినందున నేను సలాముచేసి ఈమిషమీద రేపుకూడా రావచ్చునని సంతోషించినాను పైకి రాగానే నేను వెర్రివానిలాగు సమతిబోయి ఒకటి అనబోయి మరివకటి అంటూ బసలోకి వచ్చినానుగాని ప్రా ణము నిలుపడలేదు అందరు స్నేహితులు బంధువులు నీస్థితి యేమి ఈలాగునున్న దని అడిగితే ఈరాకపోకలవల్ల వెట్టి తలకెక్కినదని చెప్పినాను తుదకు ఇటున్ను అటున్ను దొర్లుతూ ఆరాత్రి జరిపినాను ఉదయాన నే తిరిగి వెళ్లి హాజరై ఆబాళ్లేరు తోకూడానే హవేలిలో ప్రవేశించిన్ని చూచిన శృంగారమే తిరిగి చూచినాను రా చకొమారుడున్ను చూస్తునే ప్రతివారినిన్ని ఆయా పనులలోకి పంపించివేసి ఏ కాంతస్థలమునకు లేచి వెళ్లి నన్ను పిలిపించినందున వెళ్లి తేకూచుండుమని సెలవిచ్చి నది నేను సలాముచేసి కూచుండగానే నీవు తెచ్చిన సామానులో లాభము నీకు

ఎంతకావలసియున్నదని అడిగితే ఏకిసఖారిపాదదర్శనము సేయుటమునకు నాకు చాలాకోరికకలిగియుండెననిన్ని భగవంతులు అదిసంప్రాప్తింపచేసినందున నాకు సమస్తమున్ను సంపూర్ణమై ఇహపరసౌఖ్యముకూడా కలిగినదనిన్ని ఐతే జాబితాలో వ్రాసియున్న కిమ్మతులో సగము ఖరీదున్ను సగమునఖాయిఘున్ను అనిమనవి చేస్తే నాకపనినీవల్ల అయ్యేటట్టయితే నీవు వ్రాసినప్రకారమే విలవసొమ్మున్నవి శేషించి ఇంకా ఇనామున్ను ఇప్పిస్తామని రాచకుమార్తె ఆజ్ఞాపించినందున ఈగులాపువానియొక్క ప్రాణమున్ను ధనమున్ను సర్కారుపనికి అక్కరకు వచ్చేటట్టయితేతన అదృష్టబలమే అని ఎంచుకొని చేతులతోటి కాళ్లతోటి కాదుకళ్లతో సహితముచేస్తానని మనవిచేసినాను అదివింటూన్నే దస్త్రముకలందాను తెప్పించి నాకచీటీ వ్రాసి ముత్యాలకవరులో ఉంచి అందుపైని మంచులాటి వాకరుమాలుచుట్టబెట్టినాపరముగా ఇచ్చి చిటికెనవేలునుంచి నాకఉంగరముతీసి ఆనవాలునిమిత్తముఇచ్చి ఈపట్టణమునకు ఎదురుగుండా మనోభిరామమనే పేరుగల వాకపెద్దతోటఉన్నదనిన్ని ఆడకివెళ్లి (ఖైఖుసురో) అనేపేరుగల అందలి ఉద్దారుని చేతికి ఈఉంగరముఇచ్చి మేము ఆశీర్వాదించినట్టుచెప్పి అందుకుజవాబుపుచ్చుకొని అక్కడఅన్నముతింటే ఇక్కడనీళ్లుతాగవలసియున్నంతశీఘ్రముగా రావలసినదనిన్ని సెలవిచ్చినందున అక్కడనుంచి బైలుదేరి ప్రతివారినిన్ని అడుగుతూ చెందుతూ రెండుక్రోసులు వెళ్లినతరువాత సదరుతోటకనపడ్డది ఆదగ్గిరకు వెళ్లగానే ఆయుధస్తుడైన నాకమనుష్యుడునన్ను పట్టుకొని గుమ్మములోకి తీసుకొని వెళ్లినందున అక్కడనాకయావ్వనవంతుడు వ్యాఘ్రముఖముకలవాడుకవచముతొడుగుకొనినాలుగుఆయుధములుధరియించి ఇనపటోపివేసుకొని మిక్కిలివైభముతో బంగారపుకుర్చీమీదకూచున్నాడు మరిన్ని అయిదువందలమంది జాలు తరువాయులున్ను అమ్ములపొదులువిల్లున్ను ధరియించిలయనులుదీర్చి సిద్ధముగానిలువబడియున్నారు నేను ఆయనకు సలాముచేస్తేదగ్గిరకుపిలచినందున వెళ్లిఆఉంగరము ఇచ్చిసంతోషపరే గునమాటలాడిఆరుమాలకనపరచిఅందలిస్థితిన్ని తెలియచేసి నానుఅదివింటున్నే వేలుకరుచుకొని తలపంకించి ఇక్కడికిమృత్యువునిన్ను తీసుకొనివచ్చినది కాబోలునుమంచిది తోటలోకివెళ్లి సగురుడు చెట్టుకువేలాడుతూఉన్న ఇనపపంజరములో ఖయిదుసేయబడియున్న నాకచిన్నవానికి ఈయుత్తరముఇచ్చి అందుకుజవాబుపుచ్చుకొని త్వరగారమ్మని అన్నాడు నేను వెంటనే తోటలోకివెళ్లి నాను అది బ్రతికి యుండగానే స్వర్గములోకివెళ్లినట్టున్నది ప్రతితోటలోను పుష్పములు వికసించిన్ని అవుతాక్కానాలు ఎగురుతున్న పక్షులు అను స్తున్నఉన్నవి

నేనుతిన్నగా వెళ్లి అక్కడ ఆ ప్రకారముగా ఉన్న సదరు చక్కని చిన్నవానికిక్కడని
కట్టలసంచినుంచి ఉత్తరమిస్తే విప్పుకొని చదువుతూ మిక్కిలి ఆసక్తితో రాచ
కుమార్తెయొక్క స్థితి అడగడమునకు ఉపక్రమించినాడు ఇంకా ప్రసంగమున
సమాప్తికానేలేదు ఇంతలో నాలుగువైపులనుంచి యుద్ధపుసేనవచ్చి చుట్టుకొని నా
సైన్యపతి సంకోచములేకుండానున్ను బల్లెములతో పొడవడమునకున్ను కత్తులతో
నరకడమునకున్ను ఉపక్రమించినారు అప్పుడువొట్టిమనుష్యుడు ఏమిపనిని సే
యగలడు వొక్కనిమిషములో వాలికలుఅయ్యేలాగున గాయములుచేసినందు
న నేను వొళ్లుతెలియకుండా పడిపోయినాను తిరిగితెలివివచ్చేసరికి వొక మంచ
ముమీదపడియున్నాను అది ఇద్దరుమనుష్యులు మోసుకొనిపోతూతమలోతాము
మాటలాడుకొంటూఉన్నారు అందులో వొకడు ఈశవమునుఊరిబైటపారవేస్తే
కుక్కలు కాకులు తినివేస్తున్నవనిన్ని రెండోవాడు వొకవేళ ఈసంగతి రాజుకు
తెలిసినయెడల మనను బ్రతికియుండగానే పాతిపెట్టించి మనచిన్న వాళ్లనుకలు
గానుగులో ఆడిస్తాడు ఏమిమనకు ప్రాణముభారమైయున్నదా ఇటువంటిఅక్ర
మవుపని సేయడమునకనిన్ని అనుకొంటూఉన్నారు నేను ఆప్రసంగమువిని ఆఇ
ద్దరు యమకింకరులతోనున్ను దేవునికొఱకు నాయందుకనికరించండి ఇంకా నా
కుతికసరంత ప్రాణమున్నది చచ్చిపోగానే మీకిష్టమైనట్టుసేయవచ్చునుగాని నాకు
సంభవించిన ఈఉపద్రవమేమోనన్ను ఎందుకునరికినారో మీరుఎవరో ఇదైనా
చెప్పవలసినదనిఅంటే వాండ్లుదయచేసి ఆపంజరములో ఖైదుసేయబడి ఉన్న
చిన్నవాడు రాజుకు అన్నకుమారుడు ఇంతకముందు ఆయనతండ్రి ఏసింహాసనా
ధిపతియైయుండెను చనిపొయ్యేటప్పుడు తనతదనంతరకర్తయైన కుమారుడుచి
న్నవాడైనందున ఈరాజ్యాధికారము నీవుచేస్తూఉండవలసినదనిన్ని అతనియు
క్తవయస్సురాగానే నీకుమార్తెను పెండ్లిచేసి రాజ్యము వొప్పగించవలసినదనిన్ని
తనతమ్ముడైన ఈరాజుతో చెప్పి చనిపోయినహేతువచేత ఈరాజ్యభారముయీ
యనకు సంప్రాప్తమైనదిగాని ఇతడు ఆప్రకారముజరిగించలేదు సరేకదా ఆ
చిన్నవానికి వెర్రెత్తినదని ప్రకటనచేసి ఆపంజరములో పడవేసి పక్షిఅల్లాడకుం
డా గట్టిపారా కూడా ఉంచినాడు అనేకపర్యాయములు విషప్రయోగము
కూడా చేయించినాడుగాని గట్టిప్రాణమైనందున ఎక్కినదికాదు ఇప్పుడుఆరా
చకొమార్తెనున్ను ఈరాజుకుమారునికిన్ని వొకరినొకరు మోహించి ఆబిడ్డ
యింటిలో ఆలాగున్ను ఈయనతోటలో ఈలాగున్ను కొట్టుకుంటూఉన్నారుగనుక
చీటిలేసుకొనివెళ్లి ఇచ్చినసంగతి హరకారులురాజుకు తెలియచేయగానే నీకుంతు

గతిసంభవించేలాగున జేయడమే కాకుండా ఆచిన్నవాణ్ణి కూడా చంపించి వేయ
డమునకు రాజుమంత్రితో సలహాచేస్తే ఆదుర్మార్గుడు రాచకొమార్తె చేతు
లమీదుగామీరుచేయుటనే అతణ్ణి చంపించి వేయడమునకు ఆబిడను సమాధాన
పరచినానని మనవిచేసినాడు ఈమాటవాండ్లవల్ల వినగానే చచ్చిపోతూపోతూ
ఈతమాషాకూడాచూస్తాను అక్కడికితీసుకొని పదండని అన్నాను తుదకు నాం
డ్లు వొప్పి వెళ్లినందున మేముముగ్గురమున్ను వొకమూలనిలువబడిచూస్తే సింహా
సనముమీద రాజు కూర్చుండియున్నాడు ఆయనకుమార్తె వొరలేనికత్తి చేతపు
ట్టుకొనియున్నది ఆచిన్నవాణ్ణి పంజరములోనుంచి పైకి తీసి ఎదుట నిలువబెట్టి
యుంచినారు అప్పుడు ఆబిడకత్తితీసుకొని తీరాదగ్గిరకువచ్చి అవి పారవేసి ఆచి
న్నవానిమెడను తానుచుట్టబెట్టుకొనిపోయినది అప్పుడు ఆచిన్నవాడు ఈలాగుచ
చ్చిపోవడమునకు తనకుసమాధానమే అనిన్ని ఇహమందుపరమందుకూడానిన్నే
కోరియున్నాననిన్ని అంటే ఆచిన్నదినిన్ను చూడడమునకే ఇదివొకవేషముచేసినా
నని అన్నది రాజు ఈస్థితిచూచి వజీరుపైనిగట్టిగాకోపబడి యీ చమత్కారము
నాకు చూపించడముకోసరకై తీసుకొనివచ్చినట్లు ఉన్నదనిదటాయించినాడు అప్పు
డు వొకడు ఆయుద్దగ్గిరనున్న పిడతీసి ఆబిడను అంతఃపురములోకి తీసుకొనివెళ్లినందు
న వజీరుమండిపడుతూ ఆచిన్నవానిపైకెకత్తిఎత్తినాడు ఇంతలో వొక్కడినుం
చో అకస్మాత్తుగా వొకబాణమువచ్చి అతనినుదుటతగిలినందున కిందపడిపోయి
నాడు రాజుయీస్థితిచూచి యింటిలోకిదూరి పారిపోయినందున తిరిగి ఆచిన్న
వాణ్ణి పంజరములోఉంచి తోటలోకితీసుకొనిపోయినారు నేనున్ను అక్కడినుం
చిజారిపోతేవొకమనుష్యుడునన్ను పిలిచి రాచకుమార్తెయొద్దకు తీసుకొనివెళ్లి
నందున ఆబిడ కనికరించి నాయొంటిగాయములు బాగుచేయించి వొకదస్తుబట్ట
లున్ను ఆబిడ సెలవిచ్చినదానికి రెట్టిగానగదున్ను ఇచ్చి నాకు సెలవిచ్చినారు నేను
అక్కడనుంచి అం? తీసుకొని బైలువెళ్లి ఇక్కడికి రాగానే వాళ్లతో నేను ఈ
కొండపైనుని ఆబిడలాగువిగ్రహముచేసుకొని పూజిస్తూఉండి ;పోతాననిన్ని మీరం
తా స్వస్థలమునకు వెళ్లిపోవలసినదనిన్ని దానుబ్రతికియున్నంతవట్టుకున్ను అన్న
ముపరాయశ్చిత ఇస్తూఉండవలసినదనిన్ని చెప్పి ఆలాగున సుండిపోయినాను తన
స్థితిఇదని ఆముసలవాడు నాతో తెలియచేసినాడు ఓ ఫకీరులారా నేను అదివింటు
న్న ఈఫకీరువేషము వేసుకొని ఆ దేశము వెళ్లడమునకు కోరిక కలిగి బైలుదేరినా
ను కొంతకాలము పర్యంతము మజిలూ ఫరహాదువలెను అడువులు కొండలు పట్టి
తిరుగుతూ ఉంటిని తుదకు నాకొకక ఆపట్టణములోనన్ను ప్రవేశపెట్టినందున నన్ను

దులలోనూ వీదులలోనూ వెర్రివానిలాగున తిరగడము మొదలుపెట్టినాను తరు
చుగా రాచకోట మూతేయుండే మహలుచుట్టూ తిరుగుతూఉండేవాణ్ని గాని లో
పలప్రవేసించడమునకు ఏవిధముగానున్ను మార్గముకనపడనందున నేను ఎం
తమాత్రముఇంతశ్రమపడి వెళ్లినానో అది ఫలపడలేదు ఒకరోజున నేను బజా
రులోనిలువబడియుండగా మనుష్యులంతా పారిపోవడమున్ను దుకాణదారులు
తలుపులు వేసుకొని వెళ్లిపోవడమున్ను ఆరంభమైనందున అంతప్రకాశముగా
నున్న పట్టణము ఒక్కమారే పాడైపోయినట్టు కనపడ్డది ఇంతలో ఒకవైపు
నుంచి రుస్తుమువంటి ముఖవిలాసముగల ఒకజవాను పులవలెను అరుస్తూరెం
డుచేతులనున్ను ఒరతీసిన ఫిరంగికత్తులుపట్టుకొని సాముచేస్తూ ఇనపకవచము
తొడుగుకొని టోపివేసుకొని జోడుపిస్తోళ్లు మొలలోదోపుకొని కైపెత్తిన వా
నివిధముగా పేలుతూ జోగుతూ వచ్చినాడు అతనివెనక అవతల ఇద్దరుగులాము
లు బాగాముస్తాబై మొఖమలుతో తయారుచేసిన గుమ్మటము నెత్తిమీదపుంచు
కొనినడిచివస్తూఉన్నారు నేను ఈతమాషా చూస్తూ కూడానడిచినాను నాకుకన
పడ్డమనుష్యులంతా వద్దని ఆటంకపరిచినారు గాని నేనెక్కడవింటాను వెళ్లగా
ఆవీరుడు ఒకవిశాలమైన దివ్యభవనములోకివెళ్లినాడు నేనున్ను వెంటాడినాను
అతడుఅప్పుడుతిరిగిచూచి ఒక్కదెబ్బతోనన్ను రెండుముక్కలుచేయడమునకు
నిశ్చయిస్తే నేనున్ను అదేకోరియున్నాను ఆదోషమునీకులేదు ఏవిధముగానై
నాతుచ్ఛబ్రతుకుయొక్క కష్టముగట్టెక్కించు నేను మిక్కిలి విసికియున్నాను చావు
ఎరిగియుండే మీయెదుటికివచ్చినాను గనుక మరి ఆలస్యముచేయవద్దని ఒట్టుకూ
డావేసినాను అందుపైని నేను మరణమునకుముందు అడుగువేసియుండడము అత
డుకనుక్కొని ( భగవంతుడు ) అతనిమనస్సునందు కనికరముపుట్టిస్తే కోపముచ
ల్లారిచిమిక్కిలికటాక్షముతోనున్ను నీవు ఎవరుఎందుకునీప్రాణమువిసికెయున్నద
నిఅడిగినాడు అందుకుకొంచమువిశ్రమిస్తే చెప్పుతాననిన్ని నాసంగతిచాలా ఉ
న్నదనిన్ని మోహమునకుచెయ్యిచిక్కియున్నాననిన్ని నేనంటేఅతడు నడుమువి
ప్పి కాళ్లుచేతులు మొఖముకడుక్కొని కొంచెముఫలాహారముచేసి నాకున్నుద
యచేసి స్థిమితముగాకూచుండే నీసంగతి ఏమని అడిగినాడు నేను ఆముసలవా
నికిసంభవించినవిచారమున్ను తానుఇక్కడికివచ్చిన హేతువున్ను తనస్థితిన్ని తె
లియచేస్తే ముందుగావిడిచి తరువాత అన్నా ఈముండకూతురు చెండాలికొం
పలుమాపినది కానియ్యిఅయితేనేమి నీకార్యమునాచేతులలో ఉన్నదిగనుక ము
ఖ్యముగా ఈపాపాత్మునివల్ల నీవు కామ్యఫలమును పొందుతావనిన్ని మరివిచా

రభడకుండా స్తిమితముగా ఉండవలసినదనిన్ని చెప్పి మంగలివాణ్ని పిలిపించి క్షౌ
రము చేయించి స్నానము కాగానే మంచిబట్టలు తొడగించి ఇప్పుడు నీవు చూచి
న గుమ్మటము ఆపంజరములో ఖైదు సేయబడి చనిపోయిన రాచకుమారుని
దనిన్ని అతణ్ని రెండోవజీరు తుదకు యంత్రముచేసి చంపివేసినాడనిన్ని తాను
అసేనిచాయంది ఈకొమారుడై నందున ఆవజీరునురికివేసి రాజునుకొట్టవేయుడ
మునకు ప్రయత్నపడితే ఆయనగడగడవణికి తాను నిర్దోషుడనని ప్రమాణము చే
స్తే వదిలిపెట్టివేసినాననిన్ని అదిమొదలుకొని ప్రతిచందుతున్న ఆగుమ్మటము ఈ
విధముగానే పట్టణములోకితీసుకొనివచ్చి తిప్పుతూ అతనికిదుఃఖపడుతూ ఉన్నా
ననిన్ని చెప్పినాడు అదివినగానే నేను ధైర్యము తెచ్చుకొని ఇతడు చెయ్యవలెనం
టే తనకార్యమవుతున్నదనిన్ని భగవంతుడు ఇటువంటివెర్రివానికిసైతమువచ్చినం
దున దేవునిదయఉంటే అందరిదయయున్న ఉంటున్నదని అనుకొన్నానుఇంతలు
సాయంకాలమైప్రొద్దుగ్రుంకినది ఆజవాను గుమ్మటము బైలుతీసినాడు ఆఇద్దరి
లోనున్న వొకగులాపువానికి బదులీగాఆగుమ్మటము నాతలమీదఉంచి తనతోకూ
డాతీసుకొనివెళ్లుతూ రాచకుమారైదగ్గరకువెళ్లినిన్నుగురించి తనశక్తిమట్టుకు
సిఫారసుచేస్తానుగనుక నీవు ఏమిఅనక ఊరకకూచుండి వింటూ ఉండవలసిన
దని అన్నాడు నేను తమసెలవుప్రకారమే జరిగిస్తాను నాయందుమీరు కనికరిస్తు
న్నారుగనుక భగవంతుడు మిమ్మునసురక్షితముగా ఉంచవలెనని అన్నాను తరు
వాత అతడు సర్కారుతోటలోకి తీసుకొనివెళ్లినాడు ఆమధ్యప్రదేశమందుచం
ద్రకాంతశిలలతో ఎనిమిదికోసులుగా తయారుచేసిన వొక అరుగున్న అందు
పైని తెల్లమేఘమువంటి రంగుగల వొక షెమ్మెనాయున్న దానికి ముత్యాల
జాలరున్న వజ్రపు స్తంభములున్న కలిగియున్నవి అందుక్రిందజలతారుమసలం
దున్న బాలీసున్న బెక్యాలున్న వేసియున్నవి ఆగుమ్మటము అక్కడ ఉంపిం
చి మాఇద్దరినిన్ని చెట్టుదగ్గర కూచుండ వలసినదని చెప్పినాడు మరియొక
నిమిషమునకు మషాల్లవెలుగు కనపడ్డది దానితోనే కొందరుదాసీలు వెనకను
న్న ముందున్న కైవారములుచేస్తూ ఉండగా ఆరాచకుమారై విజయము
చేసి ఆమసలందు మీదకూచున్నారుగాని ముఖమందు ఏమో విచారము కో
పము కనపడుతున్నది అప్పుడు ఆ పాలదాయి కుమారుడు మిక్కిలి వినయము
గా చేతులుకట్టుకొని నిలువబడి తరువాత ఫరుషుకోసనుకూర్చుండి చనిపోయిన
రాచకుమారునివిషయమై ఆగుమ్మటమువద్ద మంత్రముచదివి ఏమోమాటలా
డమునకుపక్రమించినాడు నేను అట్టివైపే చెవులు ఉంచివింటూఉంటిని ఆఖర

న్ను ద్వేసించి ఫారసీదేశపురాచకుమారుడు మిగులనాతిశయములున్ను వైభ
వములున్ను కలిగినవారియొక్క ఐశ్వర్యము వదులుకొని (౨) యిబరాహీము అధ
హాంవలెనె ఫకీరుడై చాలా కష్టపడి ఇక్కడికి వచ్చినాడనిన్ని అమ్మాయిమీదగల
మోహముచేత (౩) బలఖుఅనేపట్టణమువదులుకొని ఈపట్టణములో మిక్కిలి శ్రమపడు
చున్నూ చాలారోజులనుంచి ఉండడమేకాకుండా చనిపోవడమునకున్ను ప్రయ
త్నపడ్డాడనిన్ని మొదలైనసంగతులు తెలియచేసి ఆయనను హుజూరుకు పిలి
పించవలసినదని మనవిచేసినందున ఈమాట ఆమెవిని అతడు ఎక్కడనున్నాడనిన్ని
రాచకుమార్తె నడిగినందు అందుకేమిసందేహము ఎదుటికి పిలిపించవలసిన
దనిన్ని అన్నది అప్పుడాతడు నాయొద్దకువచ్చి కూడాతీసుకొనివెళ్లితే నేను ఆబి
డను చూడడమువల్ల మిక్కిలి సంతోషించినాను గాని బుద్ధిన్ని జ్ఞానమున్ను ఎగిరి
పోయినందున మాటలాడడమునకు అవకాశములేక మూగవానిలాగున ఊరి
కేయున్నాను యింతలో రాచకుమార్తె తిరిగియింటిలోకివెళ్లిపోయినది ఆపా
లదాయీకొద్దుకు బసకువచ్చి నాతోనీస్థితి యావత్తు హుజూరులో అగుపరిచి
సిఫారసుచేస్తే అంగీకరించినారుగనుక ఇంతటనుంచి ప్రతిరాత్రిన్ని తప్పకుండా
ఆ మేడయొద్దకు వెళ్లిభోగిస్తూ ఉండవలసినదని చెప్పినందున నేను అతని పాదాలమీ
దపడితే నన్ను లేవనెత్తి కౌగలించుకొన్నాడు ఆపగలంతా ఎప్పుడు సాయంకా
లమవునని ఎప్పుడు వెళ్లుదునని గంటలు లెక్కపెడుతూ ఉంటినితుదకు రాత్రి కాగా
నే నేను అతనియొద్ద సెలవుపుచ్చుకొని వెళ్లితోటలో ఆఅరుగుమీద బాలీసును ఆనుకొ
నికూర్చున్నాను ఒకగడియైనతరవాత రాచకుమార్తె స్వయముగా ఒకదాసీ
నిమాత్రము కూడా తీసుకొని సన్నగావచ్చి మసలందుమీద కూర్చున్నది నా
మంచి అదృష్టముచేత ఆదినము సంభవించినందున నేను వంగిపాదములు ము
దుపెట్టుకొన్నాను తరువాత ఆబిడ నాతలపైకెత్తి కౌగలించుకొని యింతక
న్న మరిసమయము దొరకదుగనుక తన్ను అక్కడినుంచితీసుకొనిమరి ఏదేశమున
కైనాపోదమని అంటే చిత్తము నడవుండని అన్నాను ఆపిమ్మట ఉభయులమున్ను
తోటపైకివచ్చినాముగాని ఆశ్చర్యముచేతనున్ను సంతోషముచేతనున్ను కాళ్లు
న్ను చెయ్యిన్ని ఆడక దారితప్పిపోయి ఎటోవొకవైపునడిచివెళ్లుతూఉంటిమిగాని
దానికిహద్దున్ను అంతమున్ను లేకుండానుండెను ఇంతట ఆబిడనామీద కోపపడి
తా అలిసిపోయినాను నీబస ఎక్కడ త్వరగావెళ్లి త్ర వేసించవలెను లేకుంటే తన్ను

(౨) యిబరాహీము అధహాం అనేవాడు మోహముచేత ఫకీరై చనిపోయెను.
(3) బలఖు అనేపట్టణము ఖురాసాన్ దేశములో ఉన్నది.

ఏమిచెయ్యవలెనని అనుకొన్నావోగాని నాకాళ్లలో పొక్కులుపొక్కినవి గనుక దారిలో ఎక్కడనైనా చతికలబడిపోతానని అన్నది అందుకు జవాబుగా నేనునా గులాము తాలూకులోగల ఈసమీపములోనే ఉన్నదిగనుక ఇప్పుడేవెళ్లి ప్రవేసించి సుఖముగానుండవచ్చును కాలుసాగనిమ్మని అబద్ధమైతేఆడినానుగాని ఎక్కడికితీసుకొనిపోదునని మనస్సు ఆందోళనపడుతూఉండగా మంచినడిదారిలో తాళము వేసియున్న వొకగుత్తముకనపడ్డందున త్వరగా అదిఊడతీసి ఆలోపలికి వెళ్లితే ప్రశస్తమైనలోగిలి అంకలా ఫరుషులుపరచియున్నవి వంటయింటిలో రొట్టెలుమాంసము సిద్ధముగా ఉన్నది మా ఆయాసము అతిశయముగా నున్నందున ఒక్కొక్కగిన్నెడే సిసారావాటితో కూడా పుచ్చుకొని రాత్రియావత్తున్ను ఉభయులమున్ను సంతోషముగా కాలక్షేపము చేసినాము తెల్లవారగానే రాచకుమార్తె పారిపోయినదని ఊరిలో అల్లరైనది ఆబిడజాడ తెచ్చినవానికి వెయ్యిమొహరులున్ను దుస్తుబట్టలున్ను యినామిస్తామని ఇంటింటికి వీధికివీధికి సాటించినారు కుంటెనకత్తెలున్ను హరకారులున్ను వెతికిపట్టుకోవడమునకు జైలుచేరినారు పట్టణములో అందరిళ్లగుమ్మములమీదనున్ను సహారాలుకడాయించినారు రాజు సెలవులేనిది ఊరుదాటి పైకివొక్కచీమైనా వెళ్లనాటముకాదని ఆజ్ఞాపించినారు అప్పుడు నాదురదృష్టముచేత వీధితలుపుతీసియున్నందున దెయ్యములాటి వొకముసలిది దాని మొఖము కాళ్ళను చేతులో జపమాలలమీద ముసుకుధరియించి వేషము వేసుకొని లోపలికిచొరబడివచ్చి రాచకుమార్తె ఎదుటనిలువబడి చేతులెత్తి ఓ భాగ్యశాలీ ఆభగవంతుడు నీపుణ్య[illegible]వపుగాజులుచల్లగా ఉంచవలెననిన్ని గణించేవానిపాగా స్థిరముగా వుండవలెనని అనేకవిధములగా దీవించడమునకు మొదలుపెట్టినది మరిన్ని పీడలాగున సట్టుకుని తాను వొకబీదఫకీరుముండనని కన్నకుమార్తె గర్భిణిగానుండి నెలలునిండి నొప్పులుపడుతూఉన్నదనిన్ని అక్కడదీపము పెట్టడమునకు సయితము ఏగా మురుకైనా ఆదరువులేకుండా నున్నప్పుడు ఇక అన్నోదకములున్ను దాయీలకు మంత్రసానులకున్ను గాని ప్రసవమైతే పురిటాలికి కారమునకు పిప్పలికిగాని ఎక్కడనుంచి తేను ఇదివరకు రెండురోజులనుంచి ఆకలిచేత దప్పిచేత మలమలమాడుతూ పడియున్నాననిన్ని ఓతల్లి నీవు ఏమైనా ధర్మముచేస్తే అందుకు ఆధారమైయ్యుంటున్నదనిన్ని మనవిచేసినందున రాచకుమార్తె కనికరించి నాలుగురొట్టెలు యింతమాంసము చిటికెనవేలు ఉంగరము యిచ్చి అది అమ్మివేసి దానికిష్మతు తెచ్చుకుని నిష్కళముగా కాలక్షేపము సేయవలసినదనిన్ని ఈయిల్లు నీదిగా ఆలోచించి అప్పుడప్పుడు వస్తూ వుండవలసినదని కూడా అన్నది దానికిమనస్సులో

ఉన్నకోరిక అనవాలుతోకూడా లభించినందున సంతోషముతో దీవిస్తూ ముద్దు పెట్టుకొంటూ ఆబిడను వదలి గుమ్మములోనే రొట్టెలు మాంసము పారవేసి అంగరము పిడికిటిలోపట్టుకొని రాచకొమార్తె జాడ తనచేయిచిక్కిన దనుకున్ని సంతోషించుచు భగవంతుడు ఆ ఆపదలోనుంచి తప్పించుటకు ఆలోచించినందున ఆయింటియజమానుడు మంచిసిపాయి అశ్వగుఱ్ఱమెక్కి బల్లెము చేతపట్టుకొని వాకలేడిని వేటాడిగుఱ్ఱముమీద కట్టుకొనివచ్చినాడు తనదేవిడీ తలుపుతాళము విరగకొట్టియుండడమున్ను తలుపుతీసియుండడమున్ను ఆదొంగముండలోపలినుంచి రావడమున్ను చూచి కోపముచేత దానిశిగవాకచేతతో పట్టుకొని ఈడ్చుకుంటూ లోపలికివచ్చి దాని రెండుకాళ్లకు త్రాళ్లుకట్టి వాకచెట్టుకు తలక్రిందుగా వేలాడతీసినందున గిజగిజగింజుకొని తత్క్షణమే చచ్చిపోయినది ఆసిపాయీనిచూచి గుండెలుకొట్టుకోవడ మునకున్ను ప్రాణాలు ఎగిరిపోవడ మునకున్ను ఆరంభమైనందున ఆస్నేహితుడు మాస్థితిచూచి భయములేదని ధైర్యముచెప్పి వీధితలుపుతీసి ఉంచడముమిక్కిలి బుద్ధితక్కువపనియని అన్నాడు అందుపైని రాచకుమార్తె చిరునవ్వునవ్వి ఈరాచకొమారుడు ఇదితనగులాముతాలూకులో గలియని తన్నుతీసుకొనివచ్చి సమాధానపరిచినాడని చెప్పితే ఆయిల్లుగలవాడు ఆయనచెప్పినమాటనిజముసమస్తప్రజలు రాజులయొక్క నవుకరులు అనిన్ని వారియొక్క అనుగ్రహాశీర్వచనములవల్లనే అందరున్ను సంరక్షించబడినిలిచియుంటున్నారనిన్ని తానుసొమ్ము ఇచ్చికొనకుండా ఉన్నతమనవుకరును గాని రహస్యము దాచడముబుద్ధివిశేషమనిన్ని మీరుఉభయులున్ను ఈబీదవానియందు కటాక్షించి ఇంటిలోవిజయించుటతనకు ఇహపరసాధనమైయున్నందునఏవిధముగానున్ను గద్దివుమకకైనా లోపములేకుండానున్ను నేనుసొమ్మున్ను ప్రాణమునకున్ను లక్ష్యపెట్టకుండానున్ను తనవిషయమై సంచరిస్తానుగనుక మీచిత్తమువచ్చినట్టు సుఖించవలసినదనిన్ని ఆచచ్చినముండ సురక్షితముగా పైకివెళ్లినయెడల మీకుఆపదసంభవించుననిన్ని ఇకనుమీకబురు దేవతులకు సహితము తెలియదుగనుక రాజుకుతెలియడము మరియెక్కడిమాటలనిన్ని మొదలైన చాలాసంగతులుచెప్పినందున మనస్సుస్తిమితమైనది అందుపైని నేను సెహంబాసు నీవుమంచి గట్టివాడవు ఇందుకుప్రత్యుపకారము మావల్లనున్ను ఐనప్పుడు అందరికీతెలుస్తున్నదనిచెప్పి నీపేరుఏమని అడిగితే తనపేరు ( బహంజాదుఖా ) అని అన్నాడు తుదకుఆరుమాసములపర్యంతము మాకు కావలసిన సహాయములన్నిన్ని ఆతడు మనస్ఫూర్తిగాజరిగించినందున మహాసుఖముగాజరిగినది తరువాత వాకదో

జీసనాకు స్వదేశము తలిదండ్రుల జ్ఞాపకమువచ్చినందున మిక్కిలి పచారము గొంటూర్చుంటే నాముఖము వాకలాగునసుండడము చూచి (బహాజాదుఖా) ఎదుటకివచ్చినిలువబడి చేతులుజోడించుకొని ఈలాగుమువల్ల ఏలినవారి చరణసేవలో ఏమయినా లోపముజరిగివున్నట్టు విశదపడ్డయెడల అదియేమిటో ఆజ్ఞాపించ వలసినదని మనవిచేసినాడు అందుకైనినేను దేవుడుసాక్షి యిదిఏమిమాట తల్లి గర్భవాసమందు ఉన్నప్పుడు పిల్ల పెరిగినట్టుగా మేము మీఇంటిలో సంరక్షింపబడ్డాము లేకపోతే మేముచేసినపనివల్ల ఇక్కడనంతా మాకు విరోధులే వాకతుణమయినా నిమ్మళించుమని చెప్పేవారు ఇక్కడమాకుమరియెవరున్నారు భగవంతుడు నీకుసంతోషమే కలగజేయవలెను బహుపెద్దమనుష్యుడవనిఅంటే ఇక్కడనుంచిమరిఎక్కడికైనా వెళ్లడమందు కోరికకలిగియున్నయెడల మరక్షితము తీసుకొనివెళ్లి దిగపెడుతానని కూడా అన్నాడు అపిమ్మట ఈఫకీరు తనస్వస్థలానకుతీసుకొనివెళ్లి తేతలితండ్రులనుచూస్తానానుకు ఈగతిపట్టగానే భగవంతులకు తెలియవలెనువారు ఏమయినారో నేను దేశభ్రష్టుడనైనకోరిక ఏమో అదిసమకూడినందునఇకను వారిపాదములుముద్దుపెట్టుకోవడమున్నా న్యాయమయియుంటున్నదితానుచనిపోయినదిన్ని బ్రతికియున్నదిన్ని వారికితెలియనందున వారిమనస్సు ఎంతతొందరపడుతూఉన్నదో అనిఅంటే ఆషూరుడు శుభస్య శీఘ్రముగా బైలుదేరుండనిచెప్పిరోజుకు నూరుక్రోసులువడిచేతురికేగుఱ్ఱమునానిమిత్తమున్నా రెక్కలుకత్తిరించనిలాటిజలుదైనటువంటిన్ని సాదైనటువంటిన్నివాక ఆడగుఱ్ఱమురాచకొమాతేనిమిత్తమున్నుతీసుకొనివచ్చివాటిపైనిమమ్మును ఎక్కించి తానుఆయుధస్తుడై తనగుఱ్ఱముమీదకూచుండి నేను ముందునడుస్తూఉంటాను మీరువెనకఅవతలతోసుకొనిరండని బైలుదేరినాడు ఊరుబైలగుమ్మముదగ్గరకు వస్తున్నేవాక్కకేకవేసిగొడ్డలితోచానితాళమువిరగకొట్టిపహరావాండ్లను తిట్టి వెళ్లగొట్టి (బహాజా ఖా) రాచకొమాతేనున్నుఆపెడవరించిన ఫారసీదేశపు రాచకొమారుణ్నిన్ని బాహాటముగాతీసుకొనివెళ్లుతూఉన్నాడుగనక మనుష్యదైనపశువుమందువచ్చి ఆచిన్నదాన్ని వదిలించుకొ వలసినదనిన్ని లేకుంటే వారు మూసుకొనియింటిలో కూచుండుమనిన్ని నీఖామందుతో చెప్పుమనిఅన్నాడు ఈసంగతిరాజుకు తెలియగానే మంత్రికిన్ని సరదారుకున్నూ ఆముగ్గురినిన్ని పట్టి కట్టికాని లేదా వాండ్లనుచంపితలలుగాని హుజూరుకుతీసుకొని రావలసినదని ఆజ్ఞాపిస్తూవాకగడియఅవ్వేటప్పటికిభూమి ఆకాశము ధూళికేగేలాగునవిస్తారభుజనముకూచుకొనివచ్చినారుఅప్పుడు(బహాజాదుఖా)కూఇద్దరినిన్నివాక మడుము

లోనిలువబెట్టితాను గుఱ్ఱమునుఫ్రులిలాగున దాటించుకొంటూ కేకలు వేస్తూ ఆసేన లోజొరబడి ఆయిద్దరుసరదారులయొక్క బుఱ్ఱలుకొట్టివగకు సర్వస్యగాత్రస్య శిరః ప్రధానమన్న సామితిగానే సేనంతా యతాయతములైపోయినది ఆతణ మీరాజుమరికొంతజనములుకూర్చుకొనివచ్చినాడుగాన యుద్ధముసేయలేకపా రిపోయినాడు జయాపజయములు యీశ్వరాధీనమయియున్నవి అలాగే కాక పోతే వేలకొద్దిమనుష్యులువొక్కనిచేతికిఎందుకులొంగిపోతారు ఇటువంటిపనిరు స్తుమువల్లనైనా ఐయుండలేదు ఆపిమ్మటబహుజాముఖాతిరిగి మాయొద్దకువచ్చి మా ఉభయులనున్నుతీసుకొనిపైయులుదేరినాము ప్రయాణమనుకూలముగాజరిగినం దున కొంచముకాలములోనేమాదేశముయొక్కసరిహద్దుకువెళ్లిప్రవేశించి ఈళ శీయుతండ్రియైన రాజుపేర మేము క్షేమముగావచ్చినామని అర్జీవ్రాసిరవానాచే సినాను అదివారుచిత్తగించిసంతోషించిభగవత్ప్రార్థనచేసివాడినచేలమీద వర్షః ముకురిసే తెమ్మతేరినట్టుసంతోషముచేత నుప్పొంగిపన్నపెద్దలందరినిన్ని వెంటబె ట్టుకొని ఈదీనునితో ఎదురుసన్నాహముసిమిత్తముబైలుదేరివచ్చి ఏటిఅవతలవొ డుననిలువబడిపడవలనిమిత్తముఉద్దారునకుఆజ్ఞాపించినారుయింతలోనేను ఇవత లవొడ్డునుంచిఆస్థితిచూచిపాదములనుత్వరగాముద్దుపెట్టుకోవలెననే కోరికచేత గుఱ్ఱమునునీటిలోకిదాటించిఈదించుకొంటూహుజూరుకువచ్చినందున మిక్కిలి ప్రేమచాత నన్ను కౌగలించుకొన్నారు ఐతేఅకస్మాత్తుగావొకఆపదఅడ్డపడ్డది ఏమంటేరాచకుమార్తె సనారియైనగుఱ్ఱము నాగుఱ్ఱమునకుతల్లికావడముచేత నోలేకదానిజాతిగుణముచేతనో నాగుఱ్ఱముదాటడముచూచి అదిన్నివెనకనే నీటి లోధుమికి ఈదడముమొదలుపెట్టినది ఆబిడతొందరపడి కళ్లెములాగితే అదిమ హామొత్తనినాలుకకలదైనందున వెనకకుతిరగబడితే రాచకుమార్తెబుడకలుపె డుతూఅందులోమునిగిపోయినది తిరిగి ఆబిడయొక్క గుఱ్ఱముయొక్క జాడయె క్కడనున్ను కనపడలేదు బహుజా దుఖః ఈస్థితిచూచి ఆబిడకు సహాయమునిమి త్తముతనగుఱ్ఱముతోకూడాఅందులోపడ్డాడు అతడున్నుఆసుడిలో నేచిక్కబడి తిరిగిపైకిరాలేక చాలాసేపుకాళ్లుచేతులుకొట్టుకొనిమరిఈదలేకమునగిపోయినా డుమాతండ్రి ఈఆపత్సంభవముచూచి పెద్దవలలుతెప్పించివేయించివెతికించినా జాలరులు ఈబుడకలుపెట్టిఅడుగుమట్టిసహాతముపైకితీసుకొనివచ్చినారుగా ని ఆయిద్దరున్నుదొరకలేదు ఓఫకీరులారా ఈఆపదలోపడినేనువెర్రివాడనైపో యితిరిగిఫకీరునై ఈపాపపుకండ్లతో అదిన్నిచూచినాను ఇదిన్ని చూచినానన్ను ఆబిడఎక్కడనైనా మాయమయిపోయినాలేకచనిపోయినా ఇంతదుఃఖములేక

పోవుననిన్ని అంటూతిరుగుతూఉండేవాడనుతిరిగి తేర తెరలుగాదుఃఖమువచ్చినప్పు డెల్లా వెతకడానకు బైలువెళ్లుతున్నూమళ్లిశాంతపడుతున్నూ ఉండేవాడను దాని తువతు ఆయేట్లో మునిగిపోవడానకై నాతాను చనిపోయితనప్రియురాలినికలు సుకోవడమునకై నా నిశ్చయించినాను వొకరోజునరాత్రి ఆయేటిలోపడిమునిగి పోవడమునకు గొంతుక బంటినీటిలోకివెళ్లి ముందు అడుగుబెట్టి మునిగిపోదునా అని అనుకొనేసరికి మీఇద్దరికిన్ని ధైర్యముచెప్పిన ఆ (మహాపురుషుడే) వచ్చినా చెయ్యిపట్టుకొని రాచకుమారుడాయున్న బహూజాదుఖూ నున్ను బ్రతికే యు న్నారనిన్ని భగవదనుగ్రహమువల్ల వొకనాటికె కాకపోతే మరివొకనాటికైనా వారునీతో కలుసుకొంటారనిన్ని నీవలెనే ఆపదనుపొందిన ఇద్దరుఫకీరులు (రూమ్ దేశ) మునకువెళ్లియున్నారు గనక వారినికలుసుకొంటే మీమీకోరికలు ఈడేరు తున్నవనిన్ని సెలవిచ్చినందున నేనున్ను మీదివ్యసమ్ముఖములోకివచ్చి ప్రవేసించి నాను ఈతిథియాత్రాపరునియొక్క అవస్థ ఇదిఅని మనివిచేసినాడు.

మూడోఫకీరుకథ

ముగిసెను.

---

## నాలుగోఫకీరుకథ.



నాలుగోఫకీరు ఏడుస్తూమొదలుకొనలేనటువంటి తనచరిత్రమువినడమందు ఈప త్తుతమరిటుధ్యానమునుంచి తాను తవాయిబడి ఇక్కడికి కొట్టుకొనివచ్చిన విధము యావత్తున్ను చెప్పుతానుగనక చిత్తగించుండని చెప్పడమునకు నుపక్ర మించినాడు ఓభగవద్భక్తులారా ఆపదనుపొందియున్న ఈఫకీరునైననేను చీనా దేశపురాజకుమారుడ ముద్దుమురిపెములచేత పెరిగినానుగాని ఎల్లప్పుడున్ను ఈవిధముగానే జరుగుతున్నదనేతాత్పర్యము చేత ప్రపంచముయొక్కనుంచిచె డ్డలుఏమిన్ని అక్కరలేకుండా ఉండేవాడను ఈలాగునమిక్కిలి నిర్విచారముగా ఉండగా ప్రభువైనమాతండ్రిగారు కాలముచేసినారు ప్రాణము పోయ్యేటప్పు డు ఆయనతమ్ముడైన మాపినతండ్రిని పిలిపించి అతనితోతాను నమ స్తమైనధన మున్ను దేశమున్ను వదిలివెళ్లిపోతున్నానుగనక నీవుపెత్తనమునపొంచి ఈచిన్న వాడు పెద్దవాడై బుద్ధితెచ్చుకొని ఇల్లుతిప్పుకొనేపాటి వాడయ్యే పర్యంతము నీవు ఈరాజ్యపరిపాలచేసి తరువాత ఇతనికి వొప్పగించవలసినదనిన్ని (రోషన్

ఆ ఖాతూన్ పేరుగల సితుమాతేజాను ఇతనికి వివాహము చేయవలసినదనిన్ని ఇందు
వల్ల రాజాంగముయొక్క అధికారము విచ్ఛిత్తికాకుండా మనకుటుంబము లోనే
నిల్చియుంటున్నదనిన్ని చెప్పి స్వర్గస్థులైనారు ఆపిమ్మట మాపినతండ్రి నన్ను
అంతఃపురములో పెద్దవాడయ్యేపర్యంతము ఉండవలసినదని ఆజ్ఞాపించినందున
పదునాల్గుసంవత్సరముల పర్యంతము రాణీలయొద్ద దాసీలయొద్ద సంరక్షింపబ
డుతూ ఆడుతూ గెంతుతూ పినతండ్రికుమార్తెను తనకుచేస్తారన్న కబురువిని
సంతోషిస్తూ నిశ్చింతగానుండేవాడనుమరిన్ని మనస్సులో ఇక కొంచెమరోజులలో
నే రాజ్యభారముచేయి చిక్కుతున్నదనిన్ని వివాహమవుతున్నదనిన్ని కూడా ఆ
మరి నేవాడను చనిపోయినమాతండ్రిగారిదగ్గిర తరిబియ్యతైనటువంటిన్ని బహు
బుద్ధియోగ్యతలు కలిగినటువంటి (ముబారకు) అనే పేరుగల వొకమనుష్యునియొ
ద్దకు నేనులఘుగా వెళ్లి కూర్చుంటూనుంటే అతడున్ను నన్ను మిక్కిలి ప్రేమ
చేతచూస్తూ అడేతరహాగా ఉంటూనుండేవాడు వొకరోజున నిర్హేతుకముగా
వొకదాసిముండనన్నుఫ్రాని అయిదువేళ్లు అంటుకొనేలాగున వెంపకాయ కొ
ట్టినందున నేను ఏడుస్తూముబారకువద్దికి వెళ్లితే అతడునన్ను ఎత్తుకొని కౌగలిం
చుకొని కండ్లనీళ్లుతుడిచి పదండి మిమ్ముని రాజునొద్దకు తీసుకొని వెళ్లుతాను
ఆయనమిమ్ములనుచూచి అనుగ్రహించి లాయఖువిచారించిన్ని ఉస్తిత్తిమీకు ఇచ్చి
వేస్తాడని అప్పుడే పినతండ్రియొద్దకు తీసుకొనివెళ్లినాడు ఆయన దర్బారులో
మిక్కిలిప్రేమతో ఏమిఈలాగువిచారముగా ఉన్నావనిన్ని యిక్కడికి ఎందుకు
వచ్చినావనిన్ని నన్ను అడిగితే ఈయన వొకమనవిచేయుడమునకు వచ్చినాడనిము
బారకు జవాబుచెప్పినాడు అదివింటున్నే మాపినతండ్రి ఈఅబ్బాయికి వివాహ
ముచేసి మరిరాజ్యము వొప్పగిస్తానని తనంతటతానే అన్నందున ముబారకుశు
భమనిఅన్నాడు ఆక్షణమే జ్యోతిషికులును సిద్ధాంతులను ఎదుటికిపిలిపించి ఈ
సంవత్సరము ఏనెలలో ఏరోజున ఏవేళప్పుడు మంచిముహూర్తమో చెప్పితే వివా
హప్రయత్నముచేస్తానని పైకెమాత్రముఅన్నందున వారు ఆసరసముగ్రహిం
చి వేళ్లుమణిచిలెక్కపెట్టి ఈసంవత్సరము యావత్తున్ను బాగా నుండనందున
ఏమాసములోను మంచిముహూర్తము కుదరలేదనిన్ని ముందు సంవత్సరములో
బాగా నున్నదనిన్ని మనవిచేసినారు అందుపైని రాజు ఏలాగైనా ఈసంవత్సర
ముజరిగిపోతే ముందు దేశముయావత్తున్ను ఆలాగేవొప్పగిస్తాను గనక ఇతణ్ని
జనానాలోగిటిలోకి తీసుకొనివెళ్లి వొప్పగించి చదువుకొంటూ వ్రాసుకొంటూ
ఉండేలాగున చేయవలసినదని సెలవిచ్చినందున అతడు సలాముచేసి బైలుదేరి

ఆప్రకారముజాగ్రత పెట్టినాడుతరవాతమరి రెండుమూడురోజులకు నేనుఆచ్చా
రకుడుదగ్గరకువెళ్లితే నన్ను చూస్తూనే ఏడుపు మొదలుపెట్టినందున నేను ఆశ్చ
ర్యపడిఏమి తాతా అంతా క్షేమమా అని అడిగినాను నన్ను ప్రాణతుల్యము
గా ఆలోచించుకొనే ఆయనమిమ్మున ఆనాడు ఆదుర్మార్గునివద్దకు తీసుకో
నివెళ్లినప్పుడు మంత్రిమొదలైన సభికులంతా చూచి సంతోషించి ఎంతవేగము
పెద్దవాడై రాజాధికారమువహింతురు ఎప్పుడుతమయొక్క ప్రవీణతకనుక్కొం
దురు అని భగవత్ప్రార్థన చేసినందున ఈవార్త ఆవిశ్వాసహీనునికి తెలిసి
గుండెలుకొట్టుకొంటూనన్ను ఏకాంతానకుపిలిచి రాజుకుమారుణ్ని ఏమాయ
చేతనైనాచంపివేసి అతనిబాధతన ప్రాణానకు లేకుండాచేసి సుఖపెట్ట వలసిన
దని అన్నాడనిన్ని అదిమొదలుకొని మీపినతండ్రియేనీకు ప్రాణశత్రువైయున్నా
ట్టుతాను తెలుసుకొని ఊపిరిలేకుండా నున్నాననిన్ని అన్నాడు ఆదుర్వార్త
వింటున్నే నేను కొట్టకుండానే చచ్చిపోయిన వాడిలాగున ప్రాణభయముచేత
అతని పాదములమీదపడ్డి నాకురాజ్యము లేకపోతే పాయెను ప్రాణమునిలిచి
యుండేలాగున చేయవలసినదని అన్నాను ఆఉపకారిఅప్పుడు నాతలఎత్తిగుండె
లుమీదఉంచుకొని వొకఆలోచననాకు పొడగడుతూఉన్నది అదిసమకూడినయెడ
లమనకేమిన్ని భయములేదు ప్రాణముఉంటే సమస్తమున్ను కలదనిన్ని అందువ
ల్లమీ ప్రాణము నిలిచియుంటున్నది రాజ్యముయావత్తున్ను కూడా దొరుకుతు
న్నది అనిన్ని ధైర్యముచెప్పినాడు అందుపైని అది ఏమిటని నేను అడిగితే
మీతండ్రిగారు జీవించియున్నప్పుడు (జిన్నిఅనగా) మలికేసాదఖుఅనే పేరుగల
గంధర్వరాజుతో చాలాస్నేహముచేసి యున్నందున ఆయనవొకటితక్కువసల
భైయంత్రపుకోతులుఇచ్చియున్నాడనిన్ని ఆవొక్కటిన్నికూడాభర్తయైతేఆడి
నదిఆటాపాడిందిపాట అవునుగానిఇంతలోమీతండ్రిగారుకాలముచేసినారనిన్ని
ఇప్పుడుయేలాగునైనా మిమ్మును నేనుఅక్కడికితీసుకొనివెళ్లితే ఆయనఅదికూ
డాఅనుగ్రహించినయెడల సకలకార్యదిగ్విజయ మవుతున్నదని చెప్పినందున ఓ
యినాయనా ఇప్పుడు నా ప్రాణానకు నీవేయధికారివి ఏదిమంచియనితోస్తేఅది
చేయమనిఅంటే మరియేభయములేదనిచెప్పి అక్కడికికావలసిన చిత్రమైనవస్తు
సామాగ్రియావత్తున్ను బాజారుకు వెళ్లికొని రెండోరోజున(౧) అబూజహేక్

---

(౧) అబూజహేక్ అనేవాడు మహమదుపినతండ్రి తురకలమతము అవలంబించ
లేదు అతణి చంపివేయడానకు ప్రయత్నముచేసిరి.

కుమారుడుగా ఉన్న ఆపానికి ఘాలినసాపినతండ్రి యొద్దకు నన్ను తీసుకొని వెళ్లి ఈచిన్న
వాణ్ని కా జేయడమునకు. వొక ఆలోచన చేసినాను సెలవైతే వనిచేస్తానని
అన్నాడు ఆనమూర్ఖగుణము సంతోషించి చెప్పుమంటే ఇతణ్ణి ఇక్కడచంపివే
సేయెడల మీకు అన్ని విధములనున్న అపకీర్తి సంభవిస్తున్నదన్ని వొకవేళనే
మఅడవులలోకి తీసుకొని వెళ్లి అక్కడ ఆపని చేస్తే ఎవరికిన్ని తెలియదనిన్ని ముబార
కు తెలియచేసినందున విని శుభము ఆలాగు చేయవలసినదన్ని ఇందుకుబదులుగా నీకు
చాలా ఉపకారము సేయునై యున్నానని అన్నాడు ఆపిమ్మట ముబారకు మనస్సు
స్థిమితపడి ఆతో పావ స్తుఫులు పట్టుకొని నన్ను కూడా తీసుకొని అర్ధరాత్రి వేళ
పట్టణములోనుంచి ఉత్తరదిక్కుకు బైలుదేరినాడు వొకనెలమట్టుకున్ను కాలున
డకను వెళ్లినాము వొకరోజు నరాత్రి వెళ్లుతూ ఉండగా ముబారకు దైవసహాయ
మువల్ల మన ముకోరిన స్థలమునకు వచ్చి ప్రవేసించినామని అన్నాడు అపనేను విని
ఏమిటి తాతా అంటున్నావు అంటే మీకు గంధర్వసేన కనపడలేదా అని అన్నందున నీకు
మించ మరి ఎవరున్ను కనిపించలేదని అన్నాను అంతట ముబారకు వొకడబ్బిలో
నుంచి కొంచము కాటుక తీసినా రెండుకళ్లకు తగిలించినందున ఆక్షణమే ఆదండు
మఘేరాలున్ను కనపడ్డవి ఆజనులంతా చక్కనివాండ్లు అనుకూలముగా ముస్తా
బైయున్నారు వారు ముబారకును చూచి పోలిచి స్నేహరీతిగా అతణ్ణి కౌగలించు
కొంటున్నా మర్యాద చేస్తూన్నా తీసుకొని వెళ్లి రాజుగారి ఢేరా దగ్గిర ప్రవేశపెట్టి
నారు ఎపుటికి వెళ్లిచూస్తే క్రమముచొప్పున దీపములు వెలిగించియున్నవి రెండు
వైపుల సుతరహాతరహా గలిగినటువంటి కురిచీపీటలు వేసియున్నవి పండితులున్ను శా
స్త్రిజ్ఞులున్ను ఫకీరులున్ను అమీరులున్ను వజీరులున్ను (అ) అమీరుబకిషీలున్ను
దివానులు మొదలైన హోదాదారులున్ను వాటిపైని కూచున్నారు చోపుదారుల
నకీబులు మొదలైనవాండ్లు ఆయాపనులలో చేతులు కట్టుకొని చుట్టున్ను నిలువబడి
యున్నారు అస్యమందు రత్నఖచితమైన వొకసింహాసనము ఉన్నది అందుపైని
టికేసాదరు చట్టూ ముత్యములతో తాపడము చేసిన కిరీటము ధరియించి ఆమసలం
దుమీందు చాలీసున చేరబడి మిక్కిలి వైభవముతో కూచుండియున్నాడు నేను దగ్గి
రకు వెళ్లి సలాము చేస్తే కూచుండుమని సెలవిచ్చినాడు తరువాత భోజనము కూ
డా అయినది ఆపిమ్మట ముబారకు వైపు తిరిగి నాస్థితి అడిగితే ఇప్పుడు ఈయని లం
త్రిస్థానమందు పినతండ్రి రాజ్యము చేస్తూ ఇతనికి ప్రాణశత్రువై యున్నందున ఈ
డక్కుమాలినవాణ్ని ఎత్తుకొని పారిపోయి తమసన్నిధికి తీసుకొని వచ్చినానన్ని
ఈయనకు తమదగ్గర వేరే స్వాపకము లేదుగనక తండ్రియింటకలిగియుండేదయు

కుప్రతిగా ఈయనయందు అనుగ్రహించి తతింపాకోలిని ఖాఖా యిప్పించిన
యుజలనలజైస్ని భరీకాపడిఅందువల్ల ఈయనహాక్కు తిరిగిసిద్ధింస్తుందనిన్ని ఇవిము
జ్జైననంగతులుమనివిచేసినందునమలికేసాదకుకొంచెము ఆలోచించినిజము ఈ
చిన్నవానితండ్రిమావిషయమైజరిగించిన ఉపచారముయొక్కయున్ను భారము
మాయందు చాలాకలిగియున్నదిగనకనున్ను ఇతడుపదభ్రష్టుడై ప్రాణసంరక్షణ
నిమిత్తముమాశరణువొచ్చినాడుగనకనున్ను మాశక్తిమట్టుకు లోపములేకుండా
ఇతనివిషయమైసహాయముచేస్తాము అయితేఇతనివల్ల అయ్యేయెడలమాకువొ
కపనియుక్తముగాచేసికనపరిచెటట్టయితే ఇతనివిషయమైవిశేషముగాజరిగించడ
మేకాకుండా ఏదికోరితేఅది అయ్యేటట్టువరమిస్తామనికూడా అన్నారు అదివింటు
న్నే నేను తమఆజ్ఞకండ్లనదుకొని శిరసావహించి అదేనాకుఇహపరములాగున
నాలోచించిజరిగిస్తానుగనక ఆపనిఏమిటోసెలవివ్వవలసినదనిమనివిచేస్తే ఇంకా
నీవుబాలుడవైనందున మాటిమాటికిన్ని చెప్పుతాము ఇందులోఏమైనా అక్రమ
ముచేసేయెడలనీకుపద్రవముసంభవిస్తున్నదిసుమీయనిఅన్నందునఆలాగుననేం
తమాత్రముచేయుననిఅన్నాను అదివినిమలికేసాదకునన్ను దగ్గరకుపిలిచితనచేద
స్త్రములోనుంచి వొకకాగితముతీసి అందుపైనివ్రాసియున్నచిత్తరువుమోస్త
రు స్త్రీ॥ఎక్కడికైనావెళ్లి వెతికితననిమిత్తముతీసుకొనిరావలసినదనిన్ని దానిజా
డకనుక్కొని ఎదుటికివెళ్లినప్పుడు నేనుచాలాఅడిగినాననిముందుగా చెప్పవలసిన
దనిన్ని ఇందులోనీవుఏలాగుననడిస్తే ఆలాగునఅనుభవిస్తావనిన్ని సెలవిచ్చినారు
నేనుఆకాగితముపుచ్చుకొనివిప్పిఅందులోవ్రాసియున్నతస్వీరుచూడగానే నాకు
మూర్ఛరావడమారంభించినది అయితేభయముచేత సమాళించుకొని ఆయన
యొద్దసెలవుపుచ్చుకొనిముచారకునుకూడావెంటతీసుకొని అడవిదారిపడిగ్రామ
గ్రామమున్నుపల్లెపల్లెయున్ను పట్టణము పట్టణమున్నుదేశము దేశమున్ను తిరు
గుతూప్రతివారినిద మొక్క పేరు ఆనవాలు అడగడముమొదలుపెట్టినానుకా
నినేనుయెరుగుదుననిన్ని లేదావినియైనానున్నావనిన్ని చెప్పేవారుఎవరున్ను కన
పడలేదుఏడుసంవత్సరములమట్టుకు ఈతొందరఆయాసముపడుతూ తుదకు వొ
కపూరిలోప్రవేశించినాను అదిమిక్కిలిగొప్పలోగిళ్లుగలదిన్ని ప్రజాసమృద్ధిగల
దిన్నిఅయియున్నదిగానిఅక్కడప్రతిమనుష్యుడు అపత్తుచేత భగవన్నామము
పఠిస్తూపూజాపురస్కారములుచేస్తూఉన్నారుమరిన్ని ఇంతలోఅంధుడైన వొ
కహిందుస్తాన్ దేశపుఫకీరుభిక్షమెత్తుకొంటూకనపడ్డాడు అయితేఎవ్వరున్ను వొ
కగవ్వైనాకవళమైనాఅతనికిఇవ్వనందున నేనుఆశ్చర్యపడి అతనియందు కనికరం

పెట్టెలోనుంచి వొకమొహరుతీసి ఆఅంధుని చేతికిఇచ్చినాను అదిపుచ్చుకొని ఓఅయ్యా బాబా దేవుడునీకుమేలు సేయవలెను నీవుపరదేశివికాబోలునని అన్నాడు అవునుఏడుసంవత్సరములనుంచి ఈతవాయిలోబడివొక పనినిమిత్తము తిరుగుతునుగాని ఆజాడఇంకాదొరకలేదు ఈరోజునఈపట్టణము లోకివచ్చినానని అన్నానుతరువాత ఆముసలివాడునన్నుదీవిస్తూ వెళ్లిపోయినాడు నేనున్నుకూడానే తగులుకొన్నానుఊరికైటవిశాలమైన వొకదివ్యభవనముకనపడ్డది అతడు అందులోకి వెళ్లినాడు నేనున్ను జొరబడిచూస్తేయెక్కడపడితేఅక్కడలోగిళ్లుపడిపోయి మరమ్మతు లేకుండాఉన్నందున నేనుమనస్సులో ఈలోగిలిరాజులు ఉండడమునకుతగియున్నది యిదితయారైనప్పుడు ఎంతమనోహరముగానుండునో ఇప్పుడు పాడైపోయినప్పటికిన్ని ఈవిధముగానున్నది ఈలాగునఎందుకైనదో తెలియదు ఈగుడ్డివాడు ఈఇలుపట్టేలాగునఉన్నాడని మనస్సులోఅనుకొన్నాను ఆగుడ్డివాడున్ను కట్టకెందఅనుకుంటూవెళ్లుతూనుండగా ఆలోపలినుంచి ఓబాబు క్షేమముకద్దా ఈరోజునవేమి పెందలాడేవచ్చినావన్నమాట వొకటివినపడ్డది అది ఆముసలివాడువిని భగవంతుడుఅనుగ్రహించినందున ఒకపరదేశికినాయందు దయపుట్టినాకువొకమొహరుఇచ్చినాడుచాలారోజులనుంచి కడుపునిండా మంచిభోజనములేకుండా ఉన్నాందునమాంసమున్ను మసాలానున్ను నెయ్యిన్ని నూనెయున్ను పిండిన్ని ఉప్పున్నుకొన్నానుమరిన్ని నీనిమిత్తముకావలసియున్నవొక బట్టకూడాపుచ్చుకొన్నానుగనుక అదిచింపికుట్టించుకొనితొడుక్కొని వంటచేస్తే భుజించిఅతనివిషయమైఆశీర్వదింతామనిన్ని అతనికోరికఏదో తెలియక పోయినప్పటికిన్ని భగవంతుడు అదిగ్రహించేవాడు అయినందున నిరాధారులమైక మనయొక్క ప్రార్థనలంగీకరించి అదిఅతనికి ఫలింపచేస్తాడనిన్ని అన్నాడు నేను అతడుపస్తుపడియుంటూఉండడము వినిఒక్కమారేయిరవై మొహరులు ఇవ్వవలెననిబుద్ధిపుట్టినదిగాని ఆమాటవస్తూవున్నవైపుపరకాయించి చూస్తేవొకస్త్రీ వేసమువాసినైనా భేదములేకుండా ఆపత్రములో వ్రాసియున్న ప్రియురాలివలెనేకనపడందున ఒక్కకేకవేసిపడిపోతేము బారకునున్ను చంకనెత్తుకొనివూచుకాండేవిసనకఱ్ఱతో విసరడమునకు మొదలుపెట్టినాడు నాకుకొంచము తెలివిరాగానే అవిడవైపుచూస్తూఉంటేనిఅప్పుడుమబారకునాతో మీకేమి ఈలాగుమూర్ఛవచ్చినదనిఅడిగినాడుగాని అప్పటికిన్నినోటిబడో జవాబుచెప్ప లేకుండా నేయుంటిని ఇంతలోఆప్రియురాలుఓచిన్నవాడా దేవునికిజడియవలసినది పరస్త్రీలయందుర్దృష్టినుంచకూడదు సిగ్గుబిడియము అందరికిన్ని కావలసియున్నదని చమత్కా

తముగా ప్రసంగించినందున నేను ఆబిడయొక్క మర్యాదయున్ను సౌందర్యమునకున్ను మోహపడ్డాను ముబారకు నాపరామర్శ చాలా వచ్చుకొన్నాడుగాని నామనస్సులోనున్న సంగతి అతని కేమి తెలుస్తున్నది తుదకు నాకు విధిలేక ఈయింటి గృహస్థులెవరో వారు ఈబీదవాడైన పరదేసియందు కటాక్షించి తనవద్దకు పిలిచి ఉండడమునకు జాగా యిచ్చినయెడల మహోపకార్యమని కేక వేసినంతలో ఆ అంధుడు దగ్గిరికి పిలిచి మాటపోలిక పట్టినన్ను కౌగలించుకొని ఆచిన్నది కూర్చుండియున్న ఇంటిలోకి తీసుకొని వెళ్లితే ఆబిడ వొకమూల దాగున్నది అప్పుడు ఆముసలివాడు నాతో మీరు ఎందుకు ఎవరినిమిత్తము ఇల్లువాకిలి వదిలిపెట్టుకొని వొంటరిగా తిరుగుతున్నారో ఆస్థితి చెప్పవలసినదని కోరినందున నేను మలికేసాదకు పేరున్న అక్కతీయున్ను చెప్పకుండా ఈవిధముగా చెప్పడమునకు నుపక్రమించినాను తాను చీనామహాచీనా రాజ్యముల యొక్క రాజకుమారుణ్ని యిదివరకున్ను తనతండ్రి రాజైయున్నాడని వొకనాటి కాలమందు వొకవర్తకునికి లక్షలకొద్ది రూపాయిలు యిచ్చి ఈపటము కొన్నందున అదిచూడగానె జ్ఞానమున్ను సుఖమున్ను మరిచిపోయి ఫకీరువేషము వేసుకొని అటువంటి స్త్రీనిమిత్తము ప్రపంచము యావత్తున్ను గాలించగా ఇప్పుడిక్కడ తనకోరిక లభించినదనిన్ని అందుకు నీవె స్వతంత్రుడవైయున్నావనిన్ని అన్నాను అదివింటున్నే ఆగుడ్డివాడు ఉసూరుమని నిట్టూర్పు నిగుడించి ఓస్నేహితుడా తనకుమార్తెను ఎవరైనా వివాహమై ఆఫలము అనుభవించడమునకు సాహించలేకుండానుండే ఆపదలో ఆబిడ చిక్కబడియున్నదని అంటే ఆవివరమేమిటో చెప్పుమని కోరినాను అప్పుడు అతడు తనస్థితి ఓ రాజకుమారుడా వినుమని ఈవిధముగా నుపక్రమించినాడు తాను ఈపాపిష్టి పట్టణములో కాపురము చేస్తూ ఉన్న వొకగొప్ప సంసారి నితనపూర్వులు విశేష ప్రతిష్ఠగలవారున్ను గొప్పవంశస్థులున్ను అయియుండిరి భగవంతుడు ఈకుమార్తెను తనకు అనుగ్రహించినాడు పెద్దదవుచు కాగా నేదీనియొక్క మంచిన్ని సౌందర్యమున్ను మర్యాదయున్ను ప్రకటనమైనసు స్తదేశములలోనున్ను ఫలానాయింటిలో ఇటువంటిచిన్నదికలిగియున్నదని ఆబిడరూపమునకు గంధర్వస్త్రీలు సహితముసరిగా కలజ్జిస్తూనున్నప్పుడు మనుష్యులు అనగా యెంతవారనిన్ని వ్యాపించినది ఇది ఈపట్టపు రాజకుమారుడు విని దాన్ని చూడకుండానే మోహించి అన్నపానాదులు వదులుకొని చెంగపెట్టుకొని తలకు బట చుట్టుకొని పడియుండెను తుదకు ఇది రాజుకు తెలిసి తనతో ఏకాంతముగా ఈసంగతి తెలియచేసి సమాధానపరచినందున ఆడపిల్లను ట్టగానే ఎవరికైనా ఇచ్చి వివాహము సేయవలసియుంటున్నదనిన్ని యింతకున్ను

రిమేమి కావలెను అలాగు రాజకుమారుని కేయిస్తే రాజకూడా సంతోషిస్తాడని న్ని ఆలోచించి అందుకు నేను అంగీకరించి సెలవుపుచ్చుకొన్నాను ఆరోజు మొదలుకొని ఉభయులము వివాహపు ప్రయత్నము మొదలుపెట్టి వొకరోజున మంచిముహూర్తమందు విద్వాంసులున్ను పురోహితులున్ను ఇంకా పెద్దలున్ను అంతా ప్రవేశించి మంగళసూత్రధారణము చేయించినందున అనుకూలముగా వివాహమైనది పెండ్లికూతురును మహాగొప్పసంభ్రమముతో అత్తవారి యింటికి తీసుకొని వెళ్లి గృహప్రవేశము చేయించినారు తరువాత పెండ్లికుమారుడు ఆరాత్రి దానితో సంసర్గము సేయడమునకు యత్నపడ్డప్పుడు ఆగదిలో వొకయేడుపు ధ్వని పుట్టినది అందువల్ల చౌకీదారులు భయపడి గదితలుపు తీసి ఈగందరగోళమేమిటో చూతామనుకొనేవరకు అవిబహుగట్టిగా వేసియున్నవి వొక్కనిమిషములోనే ఆధ్వనినిన్ని తగ్గిపోయినది తలుపు పెట్టగించి తీసి చూస్తే పెండ్లికొడుకు తల తెగిపోయి క్రిందపడి యున్నది పెండ్లికూతురు నోటివెంట నురుగు కక్కుకొంటూ ఆరక్తములోపడి వొళ్లు తెలియకుండా దొల్లుతూ ఉన్నది యీఉపద్రవము చూచి అందరికిన్ని మతిపోయి ఇటువంటి సంతోషములో ఈదుఃఖము సంభవించినదని రాజుకు కబుబురు తెలిసి నెత్తికొట్టుకొంటూ వచ్చినాడు సమస్తమైనవారున్ను కూడా పరిగెత్తుకొనివచ్చి పోగైనారు గాని యిది ఏమిటో కనుక్కోవడమునకు ఎవరిబుద్ధికిన్ని అసాధ్యమయినందున కడవరికి రాజు దుఃఖముచేత యీపెండ్లికూతురు ముండబుట్టకూడా సరికి వేయవలసినదని ఆజ్ఞాపించినాడు ఈమాట రాజు నోటివెంట బైలుపెళ్లిన క్షణమే తిరిగి అటువంటి గడబిడే మరివొకటి తటస్థమయినందున రాజుతన ప్రాణమునకు జడిశి పారిపోయి దీన్ని తీసుకొని పొండని చెప్పినాడు దాసీలు ఈచిన్నదాన్ని నా ఇంటిలో దిగబెట్టి వేసినారు ఈస్థితి లోకమందరికి తెలిసి విన్నవాండ్లంతా ఆశ్చర్యపడడమే కాకుండా రాజున్ను ఈఊరి కాపురస్థులందరున్ను నాకు ప్రాణశత్రువులు కూడా అయినారు తరువాత దినవారములు మొదలైన కర్మములు నలుబది రోజులు కాగానే రాజు సభికులతో ఇకముందు చేయవలసినదేమని సలహాచేస్తే అందరున్ను మరేమిన్ని లేదుగాని పైకి ధైర్యముగానున్న మనస్సు స్తిమితముగానున్ను ఉండడమునకు ఆపెండ్లికూతురును దానితండ్రిని చంపివేసి వాండ్ల తాల్కు ఆస్తి సర్కారు దాఖలు చేసుకోవలసి యుంటున్నదని చెప్పినందున రాజాజ్ఞపట్టుకొని కొత్వాలు వచ్చి నాయిల్లుచుట్టుకొని గుప్తముగా పహారా కూడా ఉంచి లోపరజొరబడి ఆప్రకారము జరిగించడమునకు యత్నపడ్డాడు ఇంతలో పైనుంచి రాక్షసవేషము వొకటి గట్టిగా కురవడము

మొఱలుపెట్టినందున వచ్చినజనముయావత్తున్ను నిలువలేక అటూ ఇటూ చక్కా
చక్కలై పారిపోయి తలదాచుకొన్నారు మరిన్ని రాజమందిరములో ఈవిధము
గా అకస్మాత్తుగా భయంకరమయినధ్వని వొకటివినవడి ఏమిస్సీకు చచ్చిపొయ్యే
కాలముపట్టినదా నీబాగుకావలసియుంటే ఆ ప్రియురాలిజోలికిపోవద్దు ఆలాగు
ఊరకుండకపోతే నీకుమారునికి జరిగినట్టుగానే నీకున్ను జరుగతున్నదని వినవడ్డది
అందుకు రాజుజడిసి వాండ్లజోలికియెవరున్ను పోవద్దు వాళ్లనుయేమిన్ని అనవద్దు
వాండ్లు యేమిచెప్పినా వినవద్దు ఆ యింటిలోపడి యుండనీయండని ఆక్షణమే సెల
విచ్చినారు ఆరోజ మొదలుకొని తనకూతురికి పిశాచముపట్టినదని దాన్ని వదలకొ
ట్టడమునకు అనేకమంది భూతవైద్యులుమంత్రించి విభూతిజల్లడమున్ను తీర్థ
ములివ్వడమున్ను యంత్రములు వ్రాసి రక్షరేకులు కట్టడమున్ను యింకా అనే
కమైన తంత్రములు చేయడమున్ను యీపట్టణ వాస్తవ్యులందరున్ను ఆభయము
చేత భగవన్నామస్మరణము చేయడమున్ను మొదలుపెట్టినారుగాని ఆమూల
మేమో యిదివరకు యెవరికిన్ని తెలియలేదు వొకపర్యాయము ఈచిన్నదాన్ని
తో నీవుకండ్లతో ఏమైనాచూచినావాఅని అడిగితే తనకేమిన్ని తెలియలేదుగాని
మేము ఏకశయ్యాగతులమై ఉన్నప్పుడు తనపైనిమిటి తనతోసాంగత్యము చేయు
డమునకు ప్రయత్నపడితే ఆఇంటినడికొప్పుబద్దలై రత్నఖచితమైన వొకసింహాస
నముకనవడ్డది అందుపైనుంచి సౌందర్యవంతుడైన వొకచిన్నవాడు మహారా
జులాగు ముస్తాబై కూచున్నాడు కూడా అనేకమందిమనుష్యులు సన్నచే
స్తూ ఉండగా ఆయింటిలోకివచ్చి రాజకుమారుణ్ని చంపివేయడమునకు సిద్ధప
డ్డాడు మరిన్ని అతడు నాయొద్దకువచ్చి యేమి ప్రాణనాయకా ఇప్పుడు నాదగ్గి
రనుంచి ఎక్కడికిపారిపొతావని కూడాఅన్నాడు అతనిదిమనుష్య రూపమువలె
నేఉన్నదిగాని పాదములుమాత్రము మేకకాళ్లవలెనున్నవి అంతటభయముచే
త నాగుండెలుకొట్టుకొని మూర్ఛబోయినాను తిరిగినాకు జ్ఞానమేమిన్ని లేనం
దున యేలాగున తెలిసినది నాకు తెలియలేదని చెప్పినది అదిమొదలుకొని మా రెం
డు ప్రాణములున్ను యీపాడుయింటిలో పడియున్నవి రాజుకోపముగానున్నం
దున మాస్నేహితులంతా వేరైపోయినారు నేను యాచకనిమిత్తము బైలుదే
రితే ఎవరున్ను వొకగవ్వయైనా ఇవ్వరుసరేకదా విశేషించి దుకాణముల యెదు
ట కూడానిలువబడితే నివ్వరు ఈదౌర్భాగ్యపుపిల్లమూనము కాపుచేసుకోవడ
మునకు వంటిమీదికి ఇంతగుడ్డపేలికైనాలేదు కడుపునిండాతింటికి ఆధారమున్ను
లేదు ఈబ్రతుకుకన్న చావేమహాశ్రేష్ఠమైయుంటున్నదని భగవంతుడు మాకిది

త్రీమానత్వమును భక్ష్యాదికిరంచించినందున అన్నవస్త్రములకు సదుపాయమైనది లేనిప్పుడానికి భూతము పోకకష్టోయినట్టయితే వాసికిబదిలగా మీసేవనిమిత్తము వాక్వగించి బహుపుణ్యకార్యముగా ఆలోచింతును ఈవీసునియొక్కస్థితి ఇలాగనేయుండు ఈచిన్నదాన్ని గురించి నన్నుతొందరపెట్టవద్దు ఆ ఆశవదులుకొంటనితాంతా అనినాడు అస్థితియావత్తు నేనుమిక్కిలి వినయమున్ను బతిమాలడమున్ను మీదవడమునకున్ను మొదలుపెట్టినాను అదృష్టము ఏలాగుంటే ఆలాగవుతున్నది తన్ను మీకుమారునిగాఆలోచించి నా ప్రార్థన అంగీకరించ వలసినదని మనవిచేసినానుగాని ఆముసలివాడు ఎంతమాత్రమున్ను ఒప్పనందునసాయంకాలముకాగానే ఆయనవద్ద సెలవుపుచ్చుకొని బసలోకిరాగా నేనుబారకునన్ను చూచి శ్రీరాజకుమారుడా శుభమౌతున్నది భగవంతుడుక్రియ కనపరచినాడు గనుక ఈకష్టము వ్యర్థముకాదని అన్నాడు ఆరాత్రియావత్తున్ను ఆలోచనచేత ఆందోళనపడుతూ జరిపి తూర్పుతెల్లవారగానే భైల్దేరి పెద్దబాజారులోకివెళ్లి మంచిమంచితానులున్ను అంచులున్ను గోట్లున్ను పండ్లున్ను కొనిఆవెద్ధమనుష్యుని సన్నిధికివెళ్లినాను ఆయనమిక్కిలి సంతోషించి ప్రతివారికిన్ని తనప్రాణముకన్న ఎక్కువపదార్థమేమిన్ని లేదుఅటువంటిదినా ప్రాణసహితము తమకుపనికివస్తే నిర్లక్ష్యముగాయిస్తును మరిన్ని తనకుమాత్రము యిప్పుడేమి అధీనముచేతును అయితే ఈపనిచేయడమువల్ల మీ ప్రాణమునకు మోసమునసంభవిస్తున్నదనిన్ని తనకు ఈఅపకీర్తి బ్రహ్మప్రళయముపర్యంతము నిలిచియుంటున్నదనన్ని చెప్పినందున నేను యీవిషయమై యిదివరకు పడ్డశ్రమను తుదకులభించినదని పొందుతూఉన్న సంతోషమున్ను తెలియచేసి నా ప్రాణసిమిత్తము మీరువెనకాముందూ చూస్తూఉన్నారుగాని మోహమనే ఫిరంగికత్తినరుకుతగలకుండా బుద్ధికాచుకొనితనప్రాణమును సంరక్షించుకోకపోవడము ఏమతములో చెప్పియున్నదో మీరు న్యాయదృష్టిచేత ఆలోచించుండనిన్ని యిక పోదిట్లుకాని అన్నిటికి తయారుబడియే యున్నాను ప్రియురాలు కలగడముచేతనే ఆ ఔదార్యము సంరక్షించబడుతున్నది లేకుంటే ఈతుణమేచనిపోయి యమసన్నిధానమందు విమర్శలో నిన్నుకొంగుపట్టుకొని నిలువబెడుతానని అన్నాను తుదకు నెలరోజులుపర్యంతమున్ను అవునుకాదుఅన్న ఆలోచనకిందనేపోయి నాప్రతిరోజున్ను అతనివద్దికినేనువెళ్లి అతనికిప్రియముగాయిచ్చకపు మాటలాడుతూ ఉండేవాణ్ని యింతలో ఆఅంధునికి కాయిలా సంభవించినందున ఆదాపకారులు అతనిమూత్రము హాకసీసాలోపట్టుకొని వైద్యునియొద్దకుతీసుకొనివె

ల్లి అతడు వ్రాసియిచ్చిన క్రమముగా కషాయము పెట్టి పట్టేస్తున్నా విద్యమునంది
కాచేస్తున్ను ఉండేవాణ్ని వొకరోజుననాయందు అతడుదయచేసి ఓచిన్నవాడా
నీవు బహుకింకరపట్టుపట్టి వదలకుండా నున్నావు గనక మంచిది తనకుమా తెల
కో నీస్థితి చెప్పుతాను అదియేమంటున్నదో అని అన్నాడు ఓ ఫకీరులారా ఆసంతో
షవార్తవిని నేను తొడుక్కొన్న బట్టలు పట్టకుండా వుండేలాగున ఉబ్బొంగి
సలాముచేసి ఇప్పుడు తమరు నేను బ్రతికియుండడమునకు తగినసాధనము విచారిం
చినారని తెలియచేసి సెలవుపుచ్చుకొని బసలోకి తిరిగి వచ్చినాను రాత్రి అంతా
ముబారకుతో ఈఊసే చెప్పుతూవుంటిని ఇకమరియెక్కడ నిద్ర అకలయెక్కడ
ఉదయాననే తిరిగివెళ్లి సలాముచేయగానే అతడు తనకుమాతెలను సీమయిచ్చి
వేసినాను భగవంతులుమీకు శుభముకల జేయవలెను ఐతే తానుజీవించియున్నా
లేమట్టుకున్ను తనసంరక్షణచేస్తూ ఇక్కడ నేవుండవలసినదని అన్నాడు మరికొం
చంరోజులకే ఆముసలివాడు కాలముచేసినందున ఆప్రియురాలికి ముబారకు
డోలీకట్టించి బసయొద్దకు తీసుకొనివచ్చి యీచిన్నది కేవలముమలికె సాదకుదే
గనక జాగ్రతముట్టుకోవద్దు ఈకష్టము యావత్తున్ను చెడకొట్టవద్దని అంటేనే
ను మలికెసాదకుదేగనక జాగ్రతముట్టుకోవద్దు కష్టముచెడకొట్టవద్దనిఅంటావు
యిక్కడనక్కడనున్నాడు యీచిన్నదాన్నిచూచి వోర్చియుండలేను రేపై
తే అదికాని నేరమిస్తానని అన్నాను అందుమైని ముబారకుచికాకుపడి చిన్నతన
ముచేయవద్దు ఆయన దూరముగానున్నాడని అనుకోవద్దుమొదటనే అన్నిసంగ
తులున్ను తెలియచేసియున్నాడు గనక నీవు క్రమముగా ఈచిన్నదాన్ని ఆయన
యెదుటకితీసుకొనివెళ్లితే అతడున్ను రాజుఅయియున్నందుననీకష్టముఆలోచిం
చినీకెఇచ్చివేసునేమో అనిన్ని అందువల్ల అతనియొక్క స్నేహమున్ను ఈచిన్న
ది కూడా నీకుదక్కుతున్నదనిన్ని తెలియచేసినందున నేను అంగీకరించి ఊరకు
న్నాను తరవాత రెండ గుర్రాలు ఖరీదుచేసిసవారినైతిరిగి మలికెసాదకుదే
శమువైపువస్తూఉండగా మలికెసాదకుమానిమిత్తము ఎదురుగుండా కొంతజన
మును పంపించినందున వచ్చి మమ్ముకలుసుకొన్నారు మాకు అన్నివిధముల
నున్ను సంతోషముకలిగియున్నప్పటికిన్ని రాత్రిపగలు మార్గాయాసము
మాత్రముతప్పలేదు తీరా ఆదగ్గిరకువెళ్లేటప్పటికి వొకరోజునముబారకు నిద్ర
బోతూవున్న సమయముకనుక్కొని నేను ఆప్రియురాలి పాదముమీదపడి దాని
కో నీవిషయమై తానుమనస్సుపట్టలేకుండా నుండడమున్ను మలికెసాదకు విష
యమై భయముకలిగియుండడమున్ను తెలియచేయడమే కాకుండా నీకసిరు

మాచినది మొదలుకొన్ని ఆహారనిద్రలు లేకుండా తిరుగుతున్నాననిన్ని మొదలైన అ
నేకసంగతులు తూటామని విచేసినందున ఆచిన్నదిన్ని తనకునాయందే తాత్పర్య
ము కలిగియున్నదనిన్ని భగవంతుడు ముందు ఏమి జరిగిస్తాడో తెలియదనిన్ని జవా
బు చెప్పినది ఇంతలో అకస్మాత్తుగా ముబారకు నిద్రమేలుకువచ్చి ఏమిస్త్రా ఇ
దేమి పనినీకు అతడు ఇవ్వడని అనుమానముతో నేస్తే తనవద్ద వొకతరహా అరఖు ఉండి
యున్నందున అది యీచిన్నదానివొంటికి రాస్తే ఆవాసన పట్టలేక అతడు ఈబిడను
వదిలి పెడు కాడు గనక అంతపర్యంతమున్ను ఓరిమి సేయవలసిన దనిన్ని నన్ను స
మాధానపరచినాడు ఉదయమయ్యే సరికి మలికే సాదకు విశేషపు విలువగలిగిన
టువంటి వొక పాగానున్ను ముత్యాలతోరవలతో అలంకరించియున్న వొక అంద
లమున్ను ఎదురుగుండా పంపించినందున ఆచిన్నదానికి ముబారకు ఆ అరఖు వొం
టికి రాసి ముస్తాబు చేసి అందులో కూచుండబెట్టి అక్కడికి తీసుకొని వెళ్లినా
డు అప్పుడు మలికే సాదకు నాయందు మిక్కిలి కటాక్షించి బహుమర్యా
దలతో కూచుండబెట్టి నీకార్యము అనుకూలముగా జాగ్రత చేస్తాననిన్ని నీవు
నాకు మారునివంటివాడవనిన్ని సంతోషముగా మాటలాడుతూ ఉండగా ఆస్త్రీ
యు రాలున్ను ఎదుటవచ్చినందున ఆవాసన భరించలేక ముబారకు వైపు చూ
చి ఈచిన్నదానితో ఏవో వొకఅక్రమము జరిగియుండును కాబోలునని కోప
గించేవరకు జడిసి తాను అటువంటి మనుష్యుడను కాననిన్ని అదివరకే ఖోజ్జానై
యున్నాననిన్ని మనవిచేసి ఆదాఖలా కూడా కనపరచినాడు ఆపిమ్మట ఇదినాక
నిమిత్తమై యుండవచ్చునని కోపపడుతూ నావైపు చూచినందున యికచంపివేస్తాడు
గదా అన్న భయముచేత ముబారకు నొద్దనున్న కత్తిపుచ్చుకొని మలికేసాదకు
భుజము దగ్గిరగా ఒకపోటు పొడిచినాను అందుతోనే అతడు చనిపొయ్యే వానివలె
ను కిందపడిపోయి దొర్లుతూ పువ్వులబంతియై ఆకాశముమీదికి ఎగిరిపోయి తిరిగి
వొక్కనిమిషములోనే అటుంచి పిడుగులాగున నురుముతూ వచ్చి నన్ను ఒక్కటి
తన్నినందున ప్రాణము పోయి తుమ్మచెట్లు బొమ్మజెముడు చెట్లు మొదలైనవి కలి
గియున్న వొక అడవిలో కి తూలిపడ్డాను అప్పుడు యేమి చెయ్యవలెనో ఎక్కడికి
వెళ్లవలెనో యత్నించ తన్ను బుద్ధికి పోగొట్టక నిరాశను పొంది ఆశ్చర్యముచేత
వ్యసనపడుతూ వొకదారిపట్టినాను ఎక్కడనైనా మనుష్యులు కనపడితే మలికే
సాదకు పేరు అడిగేవాళ్ళ వాండ్లున్ను వెర్రివానికింద పర్యవసానము చేసి జవా
బు చెప్పుతూ వచ్చేవారు తుదకు ప్రాణము విసికి వొక రోజున కొండమీదికి వెళ్లి తల
క్రిందుగా పడి ముక్కముక్కలై చనిపోవడమునకు నిశ్చయించుకొని తీరాసిద్ధ

తేనతకు మీకందరికిన్ని ప్రత్యేకమైనమహాప్రభువుదేవచ్చి చెయ్యిపట్టుకొని పట్టాభిషేకముగా ఎందుకు ప్రాణము పోగొట్టుకొంటావు మనుష్యునికి దుఃఖమున్ను క్రమమున్ను కలుగుతున్నే ఉంటున్నది ఇప్పుడునీయొక్క కష్టదినములు జరిగిపోయినవి మంచిరోజులైయున్నది ఇటువంటిఆపదనే పొందియున్న ముగ్గురుఫకీరులు ఈదేశమునకు ఇదివరకే వెళ్లియున్నారు గనక త్వరగానీవున్ను వెళ్లి వారితో కూడా ఆదేశపు చక్రవర్తితోటిన్ని కలుసుకోగానే మీ అయిదుగురియొక్క కోరిక తొక్కొ స్థలమందే సమకూడుతున్నదని సెలవిచ్చినందున ఆ అవ్వగారియొక్క వాక్యము నమ్ముకొని మీ అందరిసన్నిధికిన్ని వచ్చి చేరినానన్ని తనయొక్క స్థితియున్ను మనవిచేసినాడు.

గ్రంథ ఫలితము.

ఈ ప్రకారముగా నలుగురుఫకీరులున్ను బాదుషా అజాదుబఖ్తున్ను ఒకరితో ఒకరు మాటలాడుతూనుండగా అతః పురములోనుంచి వొక ఖోజ్జాపరుగెత్తుకొనివచ్చి సంతోషవార్తను మూచి రారాజుకు సలాముచేసి భగవదనుగ్రహమువల్ల సూర్యచంద్రులిద్దరు లజ్జించేటువంటి సౌందర్యముగలకుమారుడు తమకుజననమైనాడని మనవిచేసినాడు ఈవార్తవింటున్నే రారాజునకు వుటువంటిసంతోషము కలిగినదంటే ఆ ఆనందమువల్లనే చనిపోవును ఆనలుగురు ఫకీరులున్ను ఓ బాబూ ఆచిన్నవానియొక్క పాదము పెట్టినముహూర్తాన్నవమీ ఇల్లు అభివృద్ధిపొందవలెను అతనుమీఎదుటనే పెద్దవాడై వృద్ధుడుకూడా కావలెనని దీవించినందున రారాజు ఇదియావత్తున్ను తమ పాదరజస్సుయొక్క శ్రేయస్సు అనిన్ని సెలవైతే వెళ్లిచూస్తాననిన్ని మనవిచేసినంతలో మంచిదన్నందున మహారాజులోపలికి విజయముచేసి చిన్నవాణ్ని వొళ్లోఉంచుకొని భగవత్ప్రార్థన చేసి మనస్సుచల్లబడి అప్పుడేఆచిన్నవాణ్ని గుండెలనుఅనుకొని ముద్దెత్తుకొనిపైకి తీసుకొనివచ్చి ఆ ఫకీరుల పాదాలమీద పడవేసినాడు వారు ఆశీర్వదించి మున్ను దెంచి వీభూతిమూడాజల్లినారు అవిమొదలుకొని బాదుషావుత్సవము ఆరంభము చేసి జోడాజోడా నవుబతులువాయింపిస్తూ ధనముకొల్ల తాళములు విప్పించి చిటసాదలలో వొకగవ్వకైనాటికానా లేనివారికి లక్షలకొద్ది ధనమున్ను మంత్రులుమొదలైన సభికులకు వారివారిపరువుమర్యాదలకొద్ది రెట్టింపుగాజాగీరులున్ను మునసిబుదారులు మొదలైనవారికి విశేష కితాబులున్ను పౌజు యావత్తున్ను అయిదేసిసంవత్సరముల జీతము ఇనాముగన్ను పండితులకు పెద్దలకుఫకీరులకు లున్ను తొక్కొవ సతులున్ను ఫకీరులందరికిన్ని శాల్లు చిన్నలు జోతలనిండావు

ళ్లగములాగున రూపాయీలు మొహరీలు కలిపినన్ని ధాన్యాన్ని రయితులకు వాళ్ల
కందరికిన్ని మూడుసంవత్సరముల (సి స్తుతాలున్ను దయచేసినారు పట్టణవాస
స్తులందరున్ను తమతమ యిండ్లయొద్ద మిక్కిలిన్ని ఆనందముగా రంగువేయిం
చుకొంటూ మహారాజులలాగు కూచున్నారు ఇటువంటిమిక్కిలి సంతోషము
మరియు మందున నగరిలోనుంచి ఏడవడము మొత్తుకోవడముయొక్క సందడి
తెత్తుగా బైలువెళ్లినది ఇంతలో తరహాతరహా గలిగినటువంటి దాసీలందరు
న్ను నెత్తికొట్టుకొంటూ బుగ్గలు జల్లుకొంటూ పైకివచ్చి రాజుతో చిన్నవానికి త
లంటినీళ్లుపోసిదాయీవాళ్ల కూచుండబెట్టియుండగా చిన్నమేఘము వొకటి
వచ్చి దాయీని చుట్టుకొన్నదనిన్ని తరువాతమరివక్కనిమిషమునకు అవివాళ్లకు తె
లియక పడిపోయినందున చిన్నవాడు మాయమైపోయినాడనిన్ని మనవిచేసినంత
లో పాదుషా ఇటువంటి ఆశ్చర్యవార్తను విని నిశ్చేష్టుడై పాయను దేశములోయా
వన్మందిప్రజలు విచారగ్రస్తులై ఉండుటచేత రెండురోజుల పర్యంతము పొయ్యి
మీదను పెక్కనన్ను కుండఎక్కలేదుమరిన్ని అన్నపానాదులకుబదిలీగా ఆచిన్న
వానియొక్క దుఃఖము అనుభవిస్తు ఎవరిరక్తమువారే పానము చేస్తు విధిలేక బ్రతు
కుతూ ఉండిరి తరువాత మూడోరోజున తిరిగి ఆ మేఘమే రత్నఖచితమైనటువం
టిన్ని ముత్యపుజాలరులతో శృంగారించినటువంటిన్ని వొకఉయ్యాలమంచములో
రాజకుమారుణ్ని పరుండబెట్టితీసుకొనివచ్చి మహలులోవదిలివేసి మాయమై
పోయినది సమస్తమైన వారును ఆ చిన్నవాడు అందులో నిమ్మళముగా బొటనవ్రే
లు కుడుచుకుంటూ పరుండియుండడము చూచి రాజభార్యలను త్వరగా పిలిచి చి
న్నవాణ్ని ఎత్తుకొని వారిచేతికియిచ్చినందున గుండెలమీద వేసుకొని చూస్తే ఆశిశు
వు పారుతూ ఉన్న నీళ్లవంటి ముత్యాల అంచుకలిగినటువంటి జుబ్బా వొకటిన్ని అం
దుమీద నవరత్నములతోనున్ను అలంకరించిన హారములున్ను కంఠె మెడలోనున్ను
చేతులకు కాళ్లకు గుత్న స్థగితమైన కడియాలు ముఱుగులున్ను కలిగియున్నవి మరిన్ని
కూడా చిత్రవిచిత్రమయిన గలిగిచ్చకాయలు దొండపండ్లు మొదలైన ఆటవస్తు
వులున్ను ఉన్నవి అందరున్ను అందుకు సంతోషించి పైనుంచి దిగదుడుపులు మం
త్రాలు మొదలైన దోషపరిహారకార్యములు జరిగించి ఈ చిన్నవాణ్ని నీతల్లికడుపు
చల్లగా అడ్డుగా పెరిగి ముసలివాడవు కమ్మని దీవించినారు పాదుషా ఆతరువాత
ఒక పెద్ద మహలు కట్టించి అందులో ఆనలుగురు ఫకీరులను ఉంపించి వ్యవహారములు
తెలుసుకొన్న తరువాతవారివద్దకి వెళ్లి కూచుండి పరాచక ఉపన్యాసము ఫుస్ప కొం
టూ ఉండేవారుగాని ప్రతి నెలకున్ను చంద్రదర్శనమయిన మొదటి శుక్రవార

జాన ఆమేఘమువచ్చి ఆచిన్నవాణ్ని ఆవిధముగానే తీసుకొనివెళ్లుతూ రెండు జాలు అయినతరువాత తిరిగి తరహాతరహా గలిగినటువంటి తోఫావస్తువులతో నివచ్చిదిగబెట్టి వెళ్లుతూ ఉండేది. గత్యాగత్యా ఏడో సంవత్సరము వర్ధమాం తరోజున పాదుషా ఫకీరులతో ఓభగవత్ప్రియులలారా ఈవిచిత్రమేమో ఈచి న్నవానియొక్క రాకపోకలు ఈలాగుననున్నవి ఇందలి క్రియ యేలాగు తెలుస్తు న్నదో తెలియదనిమనివిచేస్తే వారు ఓరాజా మీరున్ను వాకపర్యాయము వెళ్లితమ దర్శనము చేయడమందు కోరిక కలిగియున్నదనిన్ని అందువల్ల మన స్తుతి మయి య్యేరటుందనిన్ని వూరుపేరు లేకుండా వాక ప్రియలేఖ వ్రాసి ఆ ఉయ్యాలతొట్టి లోపడవేయుమని సలహా చెప్పినందున ఆప్రకారము జరిగించినాడు అందుకు జ వాబుగా తమకున్ను అదే తాత్పర్యము కలిగియున్నదనిన్ని ఇక్కడనమస్త సంభా రములున్ను సిద్ధపరిచియుంచడమయినదిగనక వాక్కపర్యాయము తమరు రావ డమువా త్రమేయవశిష్టమయియున్నదనిన్ని సెలవైనపక్షమందు విమానము పం పిస్తూ ఉన్నామనిన్ని జవాబు వచ్చినందున అందుకు బాదుషా అంగీకరించి ఆన లుగువఫకీరులను కూడా తీసుకొని అందుమీద కూచుండి బైలుదేరి వెళ్లగా వెళ్ల గానుదకు ఆవిమానము దేవలోకములోకి తీసుకొని వెళ్లినది అంతట దేవేంద్రుడు ఎదురుగాను ండావచ్చి మర్యాదగా తీసుకొని వెళ్లి తగిన స్థలమందు వారిని కూచుండ బెట్టినాడు ఆఐశ్వర్యమే సమస్త విభవములకున్ను ఉపమేయమయియున్నందున ఆఅపూర్వ్యమువర్ణించడమునకు శక్యమయివుండలేదు ఆసభలో ఆచిన్నవాడు వాకచిన్నదానితో ఆడుతూ కేరుతూ ముద్దులుగుడుస్తూ ఉన్నాడు అప్పుడు దే వేంద్రుడు బాదుషానుచాలా ప్రీతి సేయడమేకాకుండా ఈఫకీరులయొక్క స్థితికూ డాభోగట్టా చేసినందున రాజు వీరివృత్తాంతము యావత్తున్ను అగుపరిచినంతలో ఆమహామేనమస్తమయిన దేవతులనున్ను పిలిపించి లంకలు కొండలు అడవులు నీళ్లు మొదలైన స్థలములలోగల్గు దేవతలు రాక్షసులు గంధర్వులు మొదలైనఅందరు సర దారులను వారివద్ద ఉండే ఈఫకీరుల తాలూకున్ను వీరుకోరియున్న తమ తాలూ కు స్త్రీలనున్ను వెంటపెట్టుకొని వచ్చేలాగున సేయవలసినదనిన్ని ఆలాగున రాక పోకలపాండ్లను శిక్షించడమవుతున్నదనిన్ని గట్టిగా తాఖీదు చేసి వంపించినాడు యింం తలో దేవేంద్రుడు ఆఫకీరుల వైపు తిరిగి తనకు చాలా కాలమునుంచి సంతాన ములేనందున భగవంతులను గురించి తపస్సు చేస్తే ఈ ఆడశిశువు జననమయినద నిన్ని ఈపిల్లకాయను గురించి మనుష్యులతో సంబంధము సేయవలెనని కోరిక కలిగి వెదికించగా భూలోకమందు అయిన ఈచిన్నవాడు మాత్రము కనపడ్డందున అ

